# అపరాధ పరిశోధన

రు. 6.50 మార్చి '86

సప్లిమెంట్

147

PRABHAKAR



అపరాధ పరిశోధన అనుబంధం—147

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ప్రేమలేఖ

రచన: వసుంధర

## వెంటాడే మృత్యువు

రచన: భీమవరపు పురుషోత్తం

## రేపటి ప్రమాదం

రచన: కె. వి. యస్. ప్రకాశరావు

## అగ్నిలహరి

రచన: సుంకరి రాంప్రసాద్

విషకన్య - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—147
మార్చి, 1986
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ప్రేమ లేఖ

## వసుంధర

క్యాబరే చూస్తున్నాడు డిటెక్టివ్ కిల్లర్.

నాట్యం నరాలు జివ్వుమనిపిస్తోంది.

ఆ సమయంలో "హాల్లో!" అన్న పిలుపు మెల్లిగా చెవిలో వినపడింది కిల్లర్‌కి. అతడులిక్కిపడి పిలుపు వినపడినవైపే తిరిగాడు.

సన్నని వెలుతురులో కూడా మిలమిల మెరిసిపోతున్న సుందరి ఆమె!

అంతవరకూ ఆమె తన పక్కన వున్నదని కూడా గుర్తించలేదతడు.

"హాల్లో!" అన్నాడతడు మెల్లిగా.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేశానా?" అందామె.

"లేదు—" అనడానికి మనసొప్పక—"అవును"—అనడానికి మొహమాటపడి యిబ్బందిగా ఊరుకున్నాడు కిల్లర్.

"మీరు నాతో బయటకు రాగలరా?" అందామె.

కిల్లర్ చెవులామెను చూస్తూనే వున్నా కళ్ళు కాబరే తారనే గమనిస్తున్నాయి. ఆమె వంటి సొంపులు సంగీతంతో పాటు లయబద్ధంగా కదులుతున్నాయి. ఆ దృశ్యం శరీరంలో వేడిని పుట్టిస్తున్నప్పటికీ కూడా మనోహరంగా వుంది.

"ప్లీజ్—మీరు నాతో బయటకు రావాలి—" అందామె మళ్ళీ.

"ఎందుకు?"

"బయటకు వచ్చేక — పోగొట్టుకున్న దానికంటె యెక్కువే లభిస్తుంది మీకు!" అందా యువతి.

కిల్లర్ చటుక్కున ఆమె వంక చూశాడు.

కాబరే యువతికంటె ఎన్నో రెట్లు అందంగా వుందామె.

"సారీ—నువ్వు పొరబడ్డావు. నాకు నీ అవసరం లేదు—" అన్నాడతడు నెమ్మదిగా.

"కానీ నాకు మీ అవసరముంది. అందుకు ప్రతిఫలంగా మీరు నన్నే అడిగినా యిచ్చుకోగలనని చెప్పడం నా ఉద్దేశ్యం...."

"అంటే?"

"ప్లీజ్—బయటకు వెళదాం...."

"ఎందుకు?"

ఆమె చటుక్కున—"నేను ప్రమాదంలో వున్నాను" అంది.

కిల్లర్ వెంటనే లేచి నిలబడి—"పద—పోదాం.." అన్నాడు.

అప్పుడే కాబరే తార దుస్తులు విప్పడం ప్రారంభించింది. సంగీతం స్థాయి మారింది.

కిల్లర్ అటువైపు చూడలేదు. ప్రమాదం పేరు వినగానే అతడి మనసలాగే తిరుగుతుంది.

ఇద్దరూ హోటల్లోంచి బయటకు వచ్చేక—"మీ యింటికి వెడదాం ..." అందా యువతి.

"నా యిల్లిక్కడే!" అన్నాడు కిల్లర్.

"ఇక్కడే అంటే ...."

కిల్లర్ దగ్గర్లో పార్కు చేసి వున్న మొబైల్ వ్యాన్ దగ్గరకు నడిచాడు. వెనుకనుంచీ తలుపు తాళం తీశాడు.

ఆ యువతి లోపలకు చూసి ఆశ్చర్యపడింది.

ఓ చిన్న సైజు డ్రాయింగు రూంలా వుందక్కడ.

"ఇదే నా వంటగది. ఇదే నా డైనింగ్ రూం. ఇదే నా బెడ్రూం—" అన్నాడు కిల్లర్.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. కిల్లర్ తలుపులు దగ్గరగా వేశాడు.

ఆ యువతి సోఫాలో కూర్చుంది. కిల్లర్ ఆమెకు యెదురుగా సోఫాలో కూర్చున్నాడు.

"ఈ రాత్రికి నేనిక్కడే వుండిపోవచ్చా?" అందామె.

"నో—" అన్నాడు కిల్లర్.

"ఎందుకని?"

"ఈ గది నా కోసం. నా ఒక్కడికోసం ...రెండో మనిషికిందులో స్థానం లేదు..." అన్నాడు కిల్లర్.

"మరి మీ భార్య?"

"నాకు పెళ్ళి కాలేదు...."

"పెళ్ళి చేసుకుంటే?"

"నేను పెళ్ళి చేసుకోను...."

"ప్రపంచంలో స్త్రీకి పురుషుడూ, పురుషుడికి స్త్రీ

తోడు కావాలి....”

“నువ్వే నన్ను పెళ్ళి గురించి ఒప్పించడానికే వచ్చి వుంటే తక్షణం వెళ్ళిపోవచ్చు. నీ అందం నా మీద ప్రభావం చూపించగలదని అనుకుంటే అది పెళ్ళివరకూ దారితీయదన్న విషయం ముందే హెచ్చరిస్తున్నాను....”

“అంటే?”

“నేను నిన్ను పెళ్ళి చేసుకోను....”

ఆమె నవ్వి—“నన్నెలా పెళ్ళి చేసుకుంటారు? నాకు పెళ్ళయింది!” అంది.

కిల్లర్ తెల్లబోయి—“నీకు పెళ్ళయిందా? మరిలా ఎందుకొచ్చావు?” అన్నాడు.

“నా గురించి మీరేమి అనుకొంటున్నారో చెప్పండి” అందామె.

“కాబరేలో ఓ తార తన వంపు సొంపులు చూపి రెచ్చగొడుతోంది. ఆ సమయాలో నన్ను పలకరించి అంతకంటే ఎక్కువ దొరుకుతుందన్నావు. నా యింటికి వచ్చి నా గదిలో ఈ రాత్రి ఉండిపోతానన్నావు. నీకు డబ్బు కావాలనుకుంటున్నాను. లేదా కండకావరమైనా అయుండాలి...”

“రెండూ కాకపోతే....”

“అంతకు మించి నే నాలోచించలేను....”

“మిమ్మల్ని పలకరించే ముందు మీ గురించి నే నేమాలోచించానో తెలుసా?”

“చెప్పు!”

“ఎత్తైన విగ్రహం మీది. చురుకతనమున్న కళ్ళు. అన్నిటికీ మించి మీ మీసాలు. ఆ మీసాలకే నే నాకర్షించబడ్డాను....”

"మీపాల్లో ఆకర్షణ ఏమిటి?"

"మీ మీపాల్లో నాకు రక్షణ కనబడింది. ఆ మీపాలే మీరు అసలయిన మగధీరుడని నే ననుకునేలా చేశాయి...."

కిల్లర్ రవంత సిగ్గుపడి—"నీకు రక్షణ ఎందుకు?" అన్నాడు.

"చెప్పానుగా—నేను ప్రమాదంలో ఉన్నాను...."

ప్రమాదమనగానే కిల్లర్‌లో మళ్ళీ కొత్త ఆసక్తి పుట్టింది.

"ఏమిటి నీ ప్రమాదం!" అన్నాడతడు—"పెళ్ళయిం దంటున్నావు. ప్రమాదం నుంచి నీ భర్త నిన్ను రక్షించ లేడా?"

"ప్రమాదం నా భర్తనుంచే అయితే!"

కిల్లర్ ఉలిక్కిపడి—"అదెలా సాధ్యం..?" అన్నాడు.

"నా భర్త నన్ను చంపాలనుకుంటున్నాడు...."

"ఎందుకు?"

"ఆయనకు నేనంటే యిష్టంలేదు.."

"మరి పెళ్ళెందుకు చేసుకున్నాడు?"

"అప్పుడు నేనంటే యిష్టముంది...."

"మరిప్పుడేమయింది?"

"ఆయనకు డబ్బు పిచ్చి పట్టుకుంది...."

"అయితే?"

"ధన సంపాదనకు నా అందాన్ని వినియోగించు కుంటాడు...."

కిల్లర్ తెల్లబోయి—"భార్య నిలా వేధించేవా రుంటారా?" అన్నాడు.

"ఆయన అసలు ఎత్తు నాకు తెలిసింది రెండు మూడు సంవత్సరాలపాటు నా అందంతో లక్ష లాలించి ఆ తర్వాత నా ప్రవర్తన మంచిది కాదు కాబట్టి విడాకులు పుచ్చుకుంటాడు. అప్పుడో అమ్మాయిని పెళ్ళి చేసుకుని స్థిరంగా కాపురం చేస్తాడు—...."

"అలా ఏ భర్తా అనుకోడు! నువ్వు పొరబడ్డావు...." అన్నాడు కిల్లర్.

"ఆయనతో కాపురం చేస్తూ గ్రహించిన సత్యమిది. మీరు కేవలం నా మాటలు విని ఇది నిజం కాదంటు న్నారు—...." అందా యువతి.

"ఇలాంటి వాడిని నువ్వసలెలా పెళ్ళిచేసుకున్నావు?"

"కట్నం లేకుండా ఏరి కోరి పెళ్ళిచేసుకున్నాడు.."

కిల్లర్ నిట్టూర్చి — "ఇప్పుడు నే నేం చేయాలి?" అన్నాడు.

"నా భర్తనుండి నన్ను రక్షించాలి...."

"ఎలా?"

"నిన్న రాత్రే ఆయన నన్ను చంపాలనుకున్నాడు. నేనది గ్రహించి ముందే గది తలుపులు లోపల్నించీ వేసుకుని పడుకున్నాను. ఉదయం ఆయన బయటకు వెళ్ళేదాకా తలుపులు తీయలేదు. ఆయన వెళ్ళిన వెంటనే ఇల్లొదిలి బయటపడ్డాను. నేనెప్పుడూ కేబరేలకు వెళ్ళలేదు. నా భర్తకు దొరక్కూడద నే ఆయన ఊహించని స్థలాల్లో తిరుగుతున్నాను ..."

"ఊహించని స్థలాలంటే?"

"సినిమాలంటే నాకు తలనొప్పి-ఈ రోజు నూన్ షో, మ్యాట్నీ, ఫస్టు షో వరుసగా చూసేశాను. నేను సినిమాలు చూడనని నా భర్తకు తెలుసు. ఆ తర్వాత

కేబరే షోకి నేను వెడతానని ఆయన ఊహించలేదు...."
అందా యువతి.

"మరిప్పుడేం చేస్తావు?"

"మీరేం చెబితే అది చేస్తాను...."

"అయితే మనిద్దరం కలసి మీ యింటికి వెడదాం.."

"మా యింటికి వద్దు "

"ఎందుకని?"

"నా భర్త అనుమానిస్తాడు. మనకు లేనిపోని సంబంధం అంటగట్టి — ఈ కారణంగా నన్ను తన పనులకు మరింత బలవంతం పెడతాడు...."

"అతణ్ని నేను హెచ్చరిస్తాను...."

"లాభంలేదు...."

కిల్లర్ గంభీరంగా — "భర్తను వదిలితే నీ సమస్యకు పరిష్కారం దొరుకుతుంది. అతడిని నేను సరైన మార్గాన పెట్టగలనన్న నమ్మకం నాకుంది—" అన్నాడు.

"ఆ నమ్మకం నాకు లేదు—...." అందా యువతి.

"నా సంగతి నీకు తెలియదు...." అన్నాడు కిల్లర్.

"నిజమే. కానీ నా భర్త సంగతి మీకు తెలియదు."

కిల్లర్ క్షణంపాటు ఆలోచించి — "నీకు అయిదు నిమిషాలు వ్యవధి యిస్తున్నాను. నీ నిర్ణయం చెప్పు. మనిద్దరం కలిసి నీ యింటికి వెడదాం! అందుకు నీకిష్టం లేకపోతే నన్ను మరిచిపో. ఇంకెవరైనా సాయమపేక్షించు—" అన్నాడు.

"గడువు అయిదు నిముషాలు చాలదు. ఈ రాత్రికి నన్నిక్కడ వుండనివ్వండి...."

"లాభంలేదు. అయిదు నిమిషాల్లో నీ నిర్ణయం చెప్పాలి...."

ఆమె మౌనం వహించింది. కిల్లర్ కూడా మౌనంగా గడియారం వంకే చూస్తున్నాడు. సరిగ్గా అయిదు నిమిషాలు కాగానే—"మనం వెడదామా?" అన్నాడు.

ఆమె లేచి నిలబడి—"నేను వెడుతున్నాను. ఇంకెవరి సాయమైనా అపేక్షిస్తాను...." అంది.

కిల్లర్ నవ్వాడు. ఆమె వెళ్ళిపోయింది.

## 2

ఉదయం ఆరుగంటలకు క్వార్ట్జ్ వాచ్‌లో అలారం విని లేచాడు కిల్లర్. ఒక్కసారి కళ్ళు విప్పుకుని—"రాత్రి బాగా నిద్రపట్టింది—" అనుకున్నాడు.

అక్కణ్ణించి ఎదురుగా ఉన్న హోటలుకు వెళ్ళాడు. పదిరూపాయలు చెల్లించి స్నానంతో సహా మిగతా కాలకృత్యాలన్నీ తీర్చుకుని ట్రిమ్‌గా తయారయ్యాడు. అప్పుడతడికి రాత్రి తనని కేబరేలో పలకరించి తనతో మొబైల్ వ్యానులో గడుపుతానన్న యువతి గుర్తుకు వచ్చింది.

"ఆడవాళ్ళు రకరకాలు!" అనుకున్నాడు కిల్లర్.

ఎందుకో అతడికామెపై రవంతకూడా జాలి కలగ లేదు. ఆమె చెప్పినవన్నీ అబద్ధాలనే అతడు భావించాడు. ఆమెకు పెళ్ళికూడా అయుండదని అతడి నమ్మకం.

చేతిలో డబ్బుంది. ఇంట్లో అదుపులేదు. ఏ కేబరేకో వచ్చి అక్కడ బ్లూ ఫిల్ము చూసి ఆవేశపడి నచ్చిన మగవాణ్ణి ఏదో వంక పెట్టి పలకరించి — కుంటిసాకులు చెప్పి ఒక రాత్రి అతడితో గడపడం....

ఆధునికత పేరు చెప్పి వెర్రితలలు వేస్తున్న కొందరాడవాళ్ళ విపరీత ప్రవర్తన యిది! కిల్లర్ ఆమెను ముందే

అనుమానించి దూరంగా వుంచడానికి ప్రయత్నించాడు. కానీ ఆమె ప్రమాదం పేరు చెప్పి అతణ్ని ఆకర్షించింది. అప్పుడతడామెదగ్గ భర్త ప్రసక్తి తీసుకువచ్చి బెదర గొట్టాడు.

ఆమెకు భర్త లేడు. ఉన్నా అతడినామె కిల్లర్‌కు చూపదల్చుకోలేదు.

రాత్రి కిల్లర్ ఆమెను పేరుకూడా అడగలేదు. అడిగినా అసలు పేరు చెప్పదని అతడి నమ్మకం.

కిల్లర్‌కిప్పుడు పనేమీ లేదు.

తనేమిటో ఆ యువతి తెలుసుకోవాలి. ఈ రోజామె గురించి మొత్తం ఆరాతీసి ఆ వివరాలతో కలుసుకోవాలి. ఆతర్వాత ఆమె మళ్ళీ తనవంటి వారి జోలికి వెళ్ళదు. పైగా తన మార్గం మార్చుకునే అవకాశంకూడా వుంది.

రాత్రి కిల్లర్ బాగా అలసట ఫీలయ్యాడు. అందుకే ఆమె ననుసరించలేదు. ఇప్పుడీ మహా నగరంలో ఆమె గురించిన వివరాలు తెలుసుకునేదెలా?

ఏ కేసుకైనా ముందుకు వెళ్ళడానికి ఒకటే పద్ధతి! ముందామె చెప్పినవన్నీ నిజంగా భావించడం....

అంటే ఈపాటికి ఆమె చంపబడి వుండాలి.

కిల్లర్ నవ్వుకుంటూ హోటల్లో రిసెప్షనిస్టు దగ్గరకు వెళ్లాడు.

ఆమె నవ్వుతూ—"వాట్ కెనై డూ ఫర్ యూ—" అంది.

"ఫోన్!" అన్నాడు కిల్లర్.

"మీరే చేసుకోండి—...." అంటూ ఆమె నవ్వింది.

కిల్లర్ ఓ నెంబరు తిప్పి—"హలో—ఇన్‌స్పెక్టర్ జగ్గారావుగారేనా? మీ ఏరియాలో అందమైన యువతి

ఎవరైనా హత్య చేయబడిందా?" అన్నాడు.

"లేదు—ఎవరు మీరు?" అంది అవతలి గొంతు.

"కిల్లర్ ...." అని ఫోన్ పెట్టేశాడతడు.

రిసెప్షనిస్టు కడి వంక ఆశ్చర్యంగా చూసి—"పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసి కిల్లర్నని చెబుతున్నారు. మీ రూపం నాకు బాగా గుర్తుంది. వాళ్ళు ఎంక్వయిరీ చేస్తే బొమ్మ కూడా గీసివ్వగలను— ...." అంది.

కిల్లర్ నవ్వి—"వాళ్ళు ఎంక్వయిరీ చేసిప్పుడు నన్ను తల్చుకుంటే—వెంటనే మనిషినే ప్రత్యక్షమవుతాను. మీకు బొమ్మగీసే శ్రమ తగ్గుతుంది—" అంటూ మరో నంబరు తిప్పాడు.

ఈసారి ఇన్‌స్పెక్టర్ విశ్వనాథ్ బదులిచ్చాడు.

మూడో నంబరుకూడా అయి నాలుగో నెంబరు తిప్పుతూన్న సమయంలో "ఇక్కడ ఫోన్ చార్జి రెండ్రూపాయలు—" అంది రిసెప్షనిస్టు ఖంగారుగా.

కిల్లర్ జేబులోంచి పదిరూపాయల నోటుతీసి ఆమె కందించి—"మళ్ళీ గుర్తుచేస్తే యింకో పదిస్తాను...." అన్నాడు.

ఆమెకతడి ధోరణి అర్థం కాలేదు.

"హలో—ఇన్‌స్పెక్టర్ గోవర్ధన్ స్పీకింగ్...." అంది అవతలి గొంతు.

కిల్లర్ తన ప్రశ్నను రిపీట్ చేశాడు.

"హూ ఆర్ యూ స్పీకింగ్ ప్లీజ్!" అన్నాడు గోవర్ధన్.

"కిల్లర్ ...."

"కిల్లర్ అంటే ...."

"డిటెక్టివును గురూ!"

"ఓహో....డిటెక్టివ్ కిల్లరా? జరుగబోయే హత్య గురించి మీకెలా తెలుసు?"

"హత్య నిజంగా జరిగిందా?"

"అవును. కానీ హత్య కాదు. ఆత్మ హత్య....స్పాట్ నించి నేను వచ్చి పదిహేను నిమిషాలే అయింది...."

"అయ్‌సీ .... నేనోసారి వచ్చి హతురాలిని చూడవచ్చా?"

"ష్యూర్ ...."

"ఇప్పుడే వస్తున్నాను...." అంటూ ఫోన్ పెట్టేశాడు కిల్లర్.

రిసెప్షనిస్టు అతడి ముందుకు ఓ పుస్తకంతోసి—"ఇందులో మీ పేరు, చేసిన ఫోన్ నంబర్లు వ్రాయండి" అంది.

"మీరు నా బొమ్మకూడా వేయగలనన్నారు. వివరాలు మీరే రాసుకోలేరా?" అన్నాడు కిల్లర్.

"మీకు రెండ్రూపాయలు తిరిగి వస్తాయి—" అందామె.

"మీ దగ్గరే వుంచండి. మళ్ళీ రేపు ఫోన్ చేసుకుంటాను...."

రిసెప్షనిస్టు కుతూహలంగా-"మీరెవరు? హంతకుడా, డిటెక్టివా, గూఢచారా?" అంది.

"నేనెవరినైనప్పటికీ మీకో చిన్న సలహా ఇస్తాను" అన్నాడు కిల్లర్.

ఆమె కుతూహలంగా అతడివంక చూసింది.

"ఫోన్ చార్జి రెండ్రూపాయలన్న విషయం నంబరు తిప్పడానికే ముందే చెబుతూండండి...." అని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు కిల్లర్.

రిసెప్షనిస్టు చిత్రంగా అతడు వెళ్ళిన వైపే చూస్తూండి పోయింది.

# 3

"ఆమె పేరు సీమ...." అన్నాడు గోవర్ధన్.

"శవం ఎక్కడుంది?" అన్నాడు కిల్లర్ ఆత్రుతగా.

"వాళ్ళింట్లోనే వుంది...."

"ఎందుకని?"

"శవాన్ని పోస్టుమార్టం చేయవద్దని కోరాడామె భర్త...."

"అయితే?"

"ఇంట్లో ఫ్యాన్‌కు ఉరిపోసుకొని చనిపోయిందామె. పోయేముందు ఉత్తరం కూడా రాసి పెట్టింది. నిస్సందేహంగా ఇది ఆత్మహత్య. అలాంటప్పుడు శవాన్ని మళ్ళీ ముక్కలుగా కోయడమెందుకు? ఆమె భర్త కోరికను మన్నించడానికి లీగల్ ఒపినియన్ తీసుకుంటున్నాను...."

కిల్లర్ నిట్టూర్చి—"ఆమె సీమ కాదు—" అని మనసులో అనుకున్నాడు. పైకి—"ఆత్మహత్యకు కారణమేమిటి?" అనడిగాడు.

"సీమ ప్రవర్తన మంచిది కాదు. పెళ్ళికి ముందే ఆమెకు వేరే యువకుడితో పరిచయముంది. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. తలిదండ్రుల బలవంతం మీద ఈ పెళ్ళి చేసుకుందామె. అయినా పాత ప్రియుణ్ని మరిచిపోలేకుండా వుంది. పాత ప్రియుడి జాడ లేదు. అతడు చివరిసారిగా వ్రాసిన ఉత్తరాన్నామె భద్రంగా దాచుకుంది. చనిపోయేటప్పుడా ఉత్తరమామె జాకెట్లో దాచుకుంది. భర్తతో కాపురం చేయలేక యుడిపై మమతను చంపుకోలేక — ఆమె చివరకు

ఆత్మహత్య చేసుకోవాలనుకుంది-" అన్నాడు గోవర్ధన్.

"భర్తకీ విషయం తెలుసా?"

"పెళ్ళికిముందు వేరే ఒకతణ్ని ఆమె ప్రేమించిందని భర్తకు తెలుసు. అయితే అతడామె పవిత్రతను నమ్మాడు. పాత కథనొక పీడకలగా మరిచిపొమ్మనీ, గతం గుర్తుచేసి ఆమెను బాధించననీ భర్త ఆమెకు ధైర్యం చెప్పాడు.."

"ఆ ఉత్తముడి పేరు నేను తెలుసుకోవచ్చా?"

"అతడి పేరు మోహనరావు. భార్య పాతప్రియుడి ఉత్తరాన్ని తనవద్ద భద్రంగా దాచుకున్నదనీ, అతడినే ఇంకా మనసులో ఆరాధిస్తున్నదనీ అతడికి తెలియదు. ఆ ఉత్తరాన్ని శవం కంట్లోంచి తీశాక చదివి అతడు షాక్ తిన్నాడు...."

"షాక్ తిని ఏమన్నాడు?"

"షాక్ తిన్నాడు కదా—ఏమీ అనలేకపోయాడు" అని నవ్వి — "ఎవనకు నవ్వులాటగా వుంటుంది కానీ అందమైన భార్య ఆత్మహత్య చేసుకొని చనిపోతే - ఆ బాధ అనుభవించే వాడికే తెలియాలి...." అన్నాడు గోవర్ధన్.

"ఇందులో మగాడి బాధేముంది? భర్త ఆత్మహత్య చేసుకుంటే భార్య ఏడవాలి కానీ భర్తదేముంది? మళ్ళీ కట్నం తీసుకొని కొత్త పెళ్ళాన్ని తెచ్చుకోవచ్చు...." అన్నాడు కిల్లర్.

"ఇతడలాంటివాడు కాదు. ఆదర్శవాది. కట్నం లేకుండా పెళ్ళిచేసుకున్నాడు."

"కట్నం లేకుండా ఏరి కోరి పెళ్ళిచేసుకున్నాడు.." అని రాత్రి ఆ యువతి తనతో చెప్పడం కిల్లర్‌కు గుర్తొచ్చింది.

"ఒకసారి నేను సీమ శవాన్ని చూడాలి...."

అన్నాడు కిల్లర్.

"అడ్రసు చెబుతాను. కావాలంటే వెళ్ళి చూడండి."

కిల్లర్ గోవర్ధన్ వద్ద అడ్రసు తీసుకున్నాడు.

## 4

శవాన్ని చూసి కిల్లర్ తిన్న షాక్—ఇంతా అంతా కాదు.

రాత్రి తన్ను కలుసుకున్న యువతి సీమ! అప్పుడామె భర్త తనను చంపుతాడని భయపడింది. ఆ తర్వాత కొద్ది గంటలకే యింటికి వెళ్ళి ఆత్మహత్య చేసుకుంది.

ఎందుకు?

తన్ను చంపే అవకాశం భర్తకివ్వకూడదనుకుందా?

లేక తనకీ ప్రపంచంలో రక్షణ లభించదని అధైర్య పడిందా?

రెండింట్లో ఏది నిజమైనా తప్పు తనదీ వుంది. ఆపదలో వున్న యువతిని ఆదుకోడానికి బదులు అవమానించి పంపినందుకు కిల్లర్ గిల్టీగా ఫీలయ్యాడు.

కిల్లర్ చుట్టూ చూశాడు.

ఒకపక్క సీమ శవం....

వేరొకపక్క కళ్ళనీళ్ళతో మోహనరావు....

మోహనరావు కన్నీళ్ళు కిల్లర్లో ఆవేశాన్ని కలిగించాయి. అతడు నెమ్మదిగా మోహనరావుని సమీపించి-

"డియర్ మోహనరావ్! నువ్వు చాలా దుఃఖంలో వున్నావని నాకు తెలుసు. కానీ అర్జంటుగా నీతో మాట్లాడాలి. ప్రయివేటుగా...." అన్నాడు.

"ఎవరు మీరు?" అన్నాడు మోహనరావు.

"నా పేరు కిల్లర్. అయామే డిటెక్టివ్!"

"మీకు నాతో ఏం పని?"

"నిన్న రాత్రి పదకొండు గంటలవరకూ నీ భార్య నా దగ్గరుంది...."

మోహనరావు వెంటనే—"పక్క గదిలోకి రండి.." అన్నాడు.

ఇద్దరూ పక్క గదిలోకి వెళ్ళారు.

"చెప్పండి!" అన్నాడు మోహనరావు.

కిల్లర్ అతడికి అంతకుముందు రాత్రి జరిగినదంతా చెప్పాడు.

మోహనరావు నిట్టూర్చి—"నిస్సందేహంగా నీకు మతి చెదిరింది...." అన్నాడు.

"అంటే?"

"మీకు నా సంగతి తెలుసో తెలియదో....మూడు లక్షలు విలువచేసే షేర్లున్నాయి. ఆరు లక్షలు విలువచేసే బ్యాంకు డిపాజిట్లున్నాయి. ఊళ్ళో ఓ హార్డువేరు షాపుంది..."

"అయితే?"

"డబ్బు సంపాదించడానికి నాకు భార్య కావాలా?"

అతడి సూటి ప్రశ్నకు కిల్లర్ తెల్లబోయాడు నిజమే! మోహనరావులాంటివాడు భార్యద్వారా డబ్బు సంపాదించాలనుకోడు. అతడి సంపాదన అనుభవించడానికే భార్య!

"మరి ఆమె అలా ఎందుకు చెప్పింది?"

"ఆమెను వివాహం చేసుకొని నేను చాలా పెద్ద పొరపాటు చేశాను...."

"ఏ విధంగా?"

"ఆమెనొకసారి సినిమా హాలువద్ద చూశాను. నాకు చాలా నచ్చింది. పలకరించి మాట్లాడాను. పరిచయం పెంచుకున్నాను. ఆమె నన్ను ప్రోత్సహించనూలేదు, నిరుత్సాహ పరచనూలేదు. ఆమె పెద్దలతో మాట్లాడాను. వారామె ఎవరినో ప్రేమించిందన్నారు. ఆమె గతంతో నాకు నిమిత్తం లేదన్నాను. ఈ పెళ్ళి జరిగితే ఆమె కుటుంబానికి ఉన్న కొన్ని ఆర్థిక సమస్యలను నేనే పరిష్కరిస్తానన్నాను ఆమె అన్నకు ఉద్యోగం.... చెల్లి పెళ్ళికి కట్నం.... నేనే ఏర్పాటు చేశాను. మా పెళ్ళి జరిగింది.... ఆడది మనిషినికాక డబ్బును ప్రేమిస్తుందని భావించాను. అదే నేను చేసిన పొరపాటు .." అన్నాడు మోహనరావు నిట్టూర్చి.

"నీవామెను ప్రేమతో ఆకట్టుకోలేక పోయావా?"

"అన్ని ప్రయత్నాలూ చేశాను..లాభంలేక పోయింది ఆమె చాలా లోతైన మనిషి. తన భావాలు తనలోనే దాచుకునేది. తన బాధలు తనే దిగమింగేది. అదే కొంప ముంచింది. నేనామెలో మార్పు వచ్చిందనీ, గతాన్ని మరిచిపోయిందనీ భ్రమపడేవాణ్ని. ఆమె నన్ను కాదన లేక, పాత ప్రియుణ్ని మరువలేక ఒకటే మథనపడేది. ఆ విధంగా మథనపడుతూ బుర్ర పాడు చేసుకుంది...."

"తను బుర్ర పాడుచేసుకుందని మీకెలా తెలుసు?"

"మీకు చెప్పిన విషయాలే — సీమ నా స్నేహితుడి భార్యకూడా చెప్పింది. ఆమె ఆశ్చర్యపడి నా స్నేహితుణ్ని వాగురించి నిలదీసి అడిగింది. నా స్నేహితుడు నాకు చెప్పాడు. అప్పుడు నేను షాక్ తిన్నాను...."

"ఏం చేశారు?"

"సైకాలజిస్టును సంప్రదించాను. ఆయన సీమను పరీ

క్షించి ఆమెలో ఏ లోపమూ లేదన్నాడు. అయితే నా కథంతా విన్నాక ఆమెలో అంతర్మథనముంటే మతి చెదరవచ్చునని అన్నాడాయన. ఆయన సీమ కేసును సీరియస్ గా తీసుకుంటానన్నాడు. సీమ అప్పుడు పెద్ద రగడ చేసింది. తన్ను పిచ్చిదానిగా నిరూపించడానికి నేను ప్రయత్నిస్తున్నానంది. అందువల్ల నాకేమి ప్రయోజనమో మీరే చెప్పండి!" అన్నాడు మోహనరావు దీనంగా.

"ఆ తర్వాత ఏమి జరిగింది?"

"ఏమీ లేదు. సైకాలజిస్టు విషయం తాత్కాలికంగా వాయిదా వేసుకున్నాను. సీమ మాత్రం మరి కొందరివద్ద నా గురించి దుష్ప్రచారం చేసింది."

"చాలా చిత్రమైన కేసు. నమ్మశక్యం కాకుండా వుంది—" అన్నాడు కిల్లర్.

"సీమ నా గురించి అలా చెబుతోందంటే నేనే నమ్మలేకపోయాను. నా దగ్గరింతో బాగా ప్రవర్తించేది. అందుకే ఆమెనే వేసుకున్నాను. ఎందుకిలా దుష్ప్రచారం చేస్తున్నావనీ, నావల్ల జరిగిన తప్పేమిటనీ అడిగాను. అన్నింటికీ మౌనంగా ఊరుకునేది. నేను మరీ నొక్కిస్తే తనూ యేడ్చేది! చివరకు నేను తనను చంపడానికి ప్రయత్నిస్తున్నట్టుకూడా ప్రచారం ప్రారంభించింది...."

"అలాంటప్పుడా మెపై నీకు ద్వేషం కలగడం సహజం...."

"అదే ఆశ్చర్యం! ఆమె గతంలో వేరే వ్యక్తిని ప్రేమించిందని తెలిసినా నాకామెపై ద్వేషం కలగలేదు సరిగదా ఎలాగో అలా పెళ్ళి చేసుకోవాలనిపించింది. ఆమె నా గురించి దుష్ప్రచారం ప్రారంభిస్తేకూడా

బాధ కలిగింది తప్పితే ద్వేషం పుట్టలేదు. ఇప్పుడామె శాశ్వతంగా నన్ను వదిలి వెళ్ళిపోయింది...." అంటూ మోహనరావు యేడ్చాడు.

"ఏడ్వకూడదు. ఏడ్చే మగవాణ్ని నమ్మకూడదని సామెత...."

మోహనరావు మరికొద్ది క్షణాలు ఏడ్చి—"సామెత లకు భయపడి యేడుపు ఆగదు—" అన్నాడు.

"నేనా సామెత చెప్పకపోతే నువ్వు తప్పకుండా మరి కాసేపు యేడ్చేవాడివి...."

"నిజమే!" అన్నాడు మోహనరావు.

"నిన్న ఆమె యెన్నింటికింటికి వచ్చిందీ చెప్పగలవా?"

"చెప్పలేను. నిన్న ఆమె కోరికమీద పొరుగూరు వెళ్లాను...."

కిల్లర్ ఆశ్చర్యంగా—"అంటే ఆత్మహత్య జరిగినప్పుడింట్లో ఇంకెవ్వరూ లేరా?" అన్నాడు.

"లేను లేను ..."

"ఆమె కోరిక ఏమిటి?"

"పొరుగూళ్ళో కనకదుర్గ ఆలయముంది. అక్కడ దుర్గామాతకు కుంకుమ అభిషేకం జరిపించాలంది. అక్కడి కుంకుమ తీసుకొని—ఉదయం అనగా తెల్లవారుఝామునే శివుడి దర్శనం చేసుకొని-బయల్దేరి రమ్మంది. పొరుగూళ్లో మా బంధువులున్నారు. వాళ్ళింట్లో బసచేశాను. రాత్రికి అభిషేకం జరిపించాను. తెల్లవారుఝామున లేచి శివుడి దర్శనం చేసుకున్నాను. బయల్దేరి ఇక్కడకు వచ్చాను. ఇంట్లో నీను ఫ్యానుకు వ్రేలాడుతోంది—"

"అంటే నీకు పటిష్టమైన ఎలిబీ వుందన్నమాట... "

మోహనరావు నిట్టూర్చి-"అవును— ...." అన్నాడు.

"ఆమె తను ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. నీకు ప్రమాదం వుండకూడదనుకుంది. అంటే నిన్నామె ప్రేమిస్తోందన్న మాట ...."

"కావచ్చు ...."

"నిన్నామె ప్రేమిస్తున్నప్పుడు ఆత్మహత్య అవసరమేముంది?" అన్నాడు కిల్లర్.

"ఆమె నన్ను ప్రేమించడంలేదు కానీ ద్వేషించడం లేదు. నేనామెకేలోటూ చేయలేదు. దేవతలా ఆరాధించాను. ఆమె నా విషయంలో మనసు సరిపెట్టుకోలేక ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. ఆ వ్యవహారంలో నేనిరుక్కోవడమామె కిష్టంలేదనుకోవాలి. లేదా నేనింట్లో వుంటే తన ఆత్మహత్యా ప్రయత్నం నిరాటంకంగా కొనసాగదని భావించి ఉంటుంది...."

"రెండోదే నిజం కావచ్చు. కానీ ఈ కథ విన్న డిటెక్టివ్ ఇంకోవిధంగా ఆలోచిస్తాడు...." అన్నాడు కిల్లర్.

"చెప్పండి...."

"పాలుగూరి కుడికి నీను నిన్ను వెళ్ళమన్నదన డానికి సాక్షులున్నారా?"

మోహనరావు క్షణం ఆలోచించి—"లేదు!" అన్నాడు.

"అంటే కావాలనే నువ్వు ఎలిబీ సృష్టించుకున్నావని ఆరోపించవచ్చు...."

"అయితే మాత్రం.... నేను హత్య చేయను గదా...."

"అందుకు రెండు మార్గాలున్నాయి. ఒకటి - నువ్వు రాత్రికి రాత్రి కార్లో యిక్కడికి వచ్చి హత్య చేసి తిరిగి

వెళ్ళి గప్ చిప్ గా పడుకోవడం. రెండు—నువ్వు హత్యకు వేరే మనిషిని నియోగించడం...."

"ఆత్మహత్యను హత్యగా మార్చాలని చూస్తున్నారు మీరు. రాత్రంతా మా బంధువులింట్లో పేకాడుతూ కూర్చున్నాను. కావాలంటే వెళ్ళి అడిగి తెలుసుకోవచ్చు. హత్యకు వేరే మనిషిని నియోగిస్తే అందువల్ల నాకెప్పుడూ ప్రమాదమే!" అన్నాడు మోహనరావు.

"నీ సందేహానికి సమాధానం చెప్పగలను. సీమ ఆత్మహత్య చేసుకున్నదన్న గ్యారంటీ లేదు. ఆమె నెవరైనా హత్యచేసి వుండవచ్చు. ఇక హత్యకు వేరేమనిషిని నియోగించడంలోని ప్రమాదమంటావా? డబ్బున్నవాళ్ళందరూ స్వయంగా హత్యలు చేయాలనుకుంటే ఈ గూండాలంతా ఏమైపోతారు?"

"మీరు చెప్పదల్చుకున్న దేమిటి?"

"సీమ తన ప్రాణాలు ప్రమాదంలో వున్నాయని ముందుగా నన్ను బ్రతిమాలుకుంది. నేనామె మాటలు లక్ష్యపెట్టలేదు. ఒక విధంగా ఆమె చావుకు నేనూ బాధ్యుణ్ణి. ఆమె చావును ఆపలేకపోయినా—అందుకు కారకులైనవాళ్ళని ఉరికంబం యెక్కించితీరతాను. ఈ విషయంలో నవ్వమాయకుడివే అయితే నీకే ప్రమాదముండదు. నీకు తెలిసినదంతా చెప్పు ..." అన్నాడు కిల్లర్.

"ఇంక నేను చెప్పవలసిందేమీ లేదు. సీమను చంపిన హంతకుణ్ణి మీరు పట్టుకుంటే ఈ పరిశోధనకు మీరడిగినంత ఫీజిస్తాను...." అన్నాడు మోహనరావు.

కిల్లర్ కు అతడి కళ్ళలో నిజాయితీ కనిపించింది.

"కళ్ళు చూసి మోసపోకు!" అంటూ హెచ్చరించిం దతడి అంతరాత్మ.

# 5

డాక్టరు రిపోర్టు ప్రకారం సీమది ఆత్మహత్య! ఆమె శంటిమీద గాయాలు లేవు. ఎవరూ ఆమెను బలవంత పెట్టిన చిహ్నాలు లేవు.

చనిపోయేముందు వ్రాసిన ఉత్తరంలో యిలాగుంది.

"నా ప్రియుణ్ణి మరిచిపోలేక నన్ను నేను అంతం చేసుకుంటున్నాను. నా చావుకి ఎవ్వరూ బాధ్యులు కారు. డబ్బుకోసం ప్రేమను నిరసించే తలిదండ్రులకూ, డబ్బుతో ప్రేమను కొనాలనుకునే భాగ్యవంతులకూ నా చావు కనువిప్పు కలిగించ గలదని ఆశిస్తున్నాను...."

దస్తూరీ ఆమెదేననడానికి తగిన సాక్ష్యాలు లభించాయి.

సీమ చనిపోయేముందు తనవద్ద దాచుకున్న ఉత్తరంలో ఇలా వుంది.

"ప్రియా!

ఇక మనం కలుసుకునే అవకాశంలేదు. డబ్బుకోసం నన్ను మరిచిపోవాలనుకున్నావు. అది నీ అసహాయత కావచ్చు. డబ్బు ప్రేమను కొనగల ఈ లోకంలో డబ్బులేని నేను ప్రేమించడమే ఒక తప్పు.

ఇకమీదట ప్రేమకోసం కాక, డబ్బుకోసం జీవిస్తాను. వీలుపడితే తిరిగి నిన్ను డబ్బుతో నే కొనడానికి ప్రయత్నిస్తాను. నా విజయంకోసం నువ్వు యెదురుచూస్తావన్న నమ్మకం నాకుంది.

ప్రస్తుతానికి నేను చేయగలిగినదల్లా శుభకాంక్ష
అందచేయడమే!''
ఉత్తరం క్రింద సంతకం —భగ్నప్రేమికుడు.
అని పెట్టివుంది.

"కేసు చాలా సులభంగా తేలిపోయింది...." అన్నాడు గోవర్ధన్.

"అనవసరంగా సంబరపడిపోవద్దు. మీరెవ్వరూ ఆ భగ్నప్రేమికుడి గురించి ఆలోచిస్తున్నట్లు లేదు...." అన్నాడు కిల్లర్.

"మధ్యలో అతడి ప్రసక్తి ఎందుకు?"

"అసలతడెవరో తెలుసుకున్నారా?"

"ఎందుకు?" అన్నాడు గోవర్ధన్ విసుగ్గా.

"అతడికి డబ్బులేదు. అయినా సీమ అతణ్ని ప్రేమించింది. డబ్బున్న మోహనరావును చేసుకున్నా ఆమె అతణ్ని మరిచిపోలేదు సరిగదా అతడికోసం ఆత్మహత్య కూడా చేసుకోవాలనుకుంది. ఆ మహానుభావుణ్ని కళ్లారా చూసి తరించాలని లేదూ?" అన్నాడు కిల్లర్.

"లేదు...." అన్నాడు గోవర్ధన్.

"అతణ్ని కలుసుకుంటే ఆత్మహత్య హత్యగా మారవచ్చు..."

గోవర్ధన్ భయంగా—"ఎందుకు?" అన్నాడు.

"ఉత్తరం చదవలేదా? సీమ తనదికానందుకతడు బాగా అసూయపడ్డాడు. ఆమెను చంపాలనికూడా అతడే అనుకొని వుండవచ్చు. తనవు దక్కని సీమ మోహనరావుకు దక్కకూడదని అతడి ఆలోచన...."

"మీకో నమస్కారం! కొండిగుడ్డుకు ఈకలు పీకవద్దు"

అన్నాడు గోవర్ధన్.

"నమస్కరించిన వాళ్ళను దీవించాలి. హంతకుడు త్వరలోనే పట్టుబడతాడు..." అన్నాడు కిల్లర్.

"హంతకుదేమిటి?" అన్నాడు గోవర్ధన్.

"మిస్టర్ గోవర్ధన్! మీకు చెప్పివున్నాను. చావుకు ముందు సీమ నన్ను కలుసుకుంది. తన ప్రాణాలు ప్రమాదంలో వున్నాయనీ రక్షించమనీ కోరింది. కానీ నేను పట్టించుకోలేదు. అందుకు కారణం తెలుసా?" అన్నాడు కిల్లర్.

"చెప్పండి!"

"అప్పుడు సీమ కళ్ళలో కోరికను చూశాను. ఆ కోరికను కామవాంఛగా భ్రమించి అప్పుడు పెద్ద పొరపాటు చేశాను. అది జీవితంమీద ఆమెకున్న కోరిక అని తర్వాత అర్థమయింది. ప్రాణాలపై ఆమెకెంతో తీపి వున్నదని నాకు తెలిసింది. ఆమె తనకుతానై చావదు. ఎవరో ఆమెను చంపారు.

"మరి డాక్టరు రిపోర్టు...." అన్నాడు గోవర్ధన్.

"జరిగింది హత్య అని నమ్మడం మొదలుపెడితే అన్నింటికీ సమాధానాలు దొరుకుతాయి. ముందుగా ఆ ప్రేమికుణ్ని కలుసుకోవాలి...."

గోవర్ధన్ కిల్లర్‌తో కరచాలనంచేసి—"మీ పరిశోధన ముందుకు వెళ్ళడానికి నా శాయశక్తులా సహకరిస్తాను. కానీ మాకు సంబంధించినంతవరకూ కేసు ముగిసిందనే భావించండి—" అన్నాడు.

"ఇదేమాట రేపు అనగలరేమో చూస్తాను!" అన్నాడు కిల్లర్ నవ్వి.

# 6

కిల్లర్ సీమ త్రిలోవారిని కలుసుకున్నాడు. వారు చెప్పిందాన్నిబట్టి సీమ మనస్ఫూర్తిగానే ఈ వివాహం చేసుకుంది. వివాహమైనాక కూడా ఆమె సంతోషంగా వుంది.

"ప్రేమికులను విడదీసి మీరు పెద్ద తప్పు చేశారు. అందుకని మీరిలా చెప్పడంలో ఆశ్చర్యంలేదు. భర్త తన్ను చంపుతాడేమోనన్న భయమున్నపుడు ఆమె మీ యింటికి రాలేదు. వరుసగా మూడు సినిమాలు చూసి కేబరే షో చూడ్డానికి వెళ్ళింది. అంటే ఆమెకు మీపై వున్న నమ్మకం అర్థమవుతోంది—" అన్నాడు కిల్లర్.

సీమ తండ్రి తలవంచుకొని — "కన్నవారి మనసును బిడ్డలే అర్థం చేసుకోలేనప్పుడు — పరాయివాళ్ళపార్థం చేసుకోవడంలో ఆశ్చర్యంలేదు—" అన్నాడు.

"అంటే?"

"సీమ నవనీత్ ను ప్రేమించింది. ఇప్పటికింకా అతడి కుద్యోగం లేదు. ప్రైవేట్లు చెప్పి పొట్ట పోషించుకుంటున్నాడు. పైగా అతడిది మా కులం కాదు."

"మోహనరావుది మీ కులమేనా?" అన్నాడు కిల్లర్ మధ్యలో ఆయన్నాపి.

"అవును...."

"ఊఁ చెప్పండి—" అన్నాడు కిల్లర్.

"సీమకింకా పెళ్ళికావాల్సిన చెల్లి వుంది. కులంకాని పెళ్ళివల్ల దాని పెళ్ళి కష్టమవుతుంది. మోహనరావును పెళ్ళిచేసుకోవడంవల్ల దాని అన్నకుద్యోగం, చెల్లి పెళ్ళికి డబ్బు—ఏర్పాటవుతున్నాయి మోహనరావు అందవికారి కాడు, దుర్మార్గుడు కాడు. మనసుపడి సీమను చేసుకుంటూ

నన్నాడు. సీమ గతం గురించి తెలిసినా తరవాతే దన్నాను....'' సీమ తండ్రి ఆగాడు.

"మోహనరావలా ఎందుకన్నాడోనని మీ కనుమానం కలగలేదా?"

"ఇందులో అనుమానించతగ్గదేమీ నాకు కనబడలేదు. సీమ సుఖం గురించి ఆలోచించాను. దానికి ఇంటిల్లపాదీ నచ్చజెప్పి చూశాము. ఓ పట్టాన వినలేదు. నేను, మా ఆవిడ ఆత్మహత్య చేసుకుంటామని బెదిరిస్తే ఒప్పుకుంది."

"చివరికి తను ఆత్మహత్య చేసుకుంది...." అన్నాడు కిల్లర్.

సీమ తండ్రి తప్పుచేసినవాడిలా తలవంచుకొని—

"ఇలా ఎందుకు చేసిందో నాకు తెలియడంలేదు. అతడు చాలా యోగ్యుడు...." అన్నాడు.

"మీ అమ్మాయి అతడితో సుఖపడిందా?"

"వాళ్ళు సుఖంగానే ఉన్నారని నాకు అనిపించేది. కానీ అమ్మాయి మాత్రం అతడు తన్ను కష్టపెడుతున్నాడని చెప్పేది. అది చెప్పే ఒక్క మాటకు కూడా ఋజువులభించేది కాదు—"

"అంటే?"

"అతడి ప్రవర్తన గురించి చాలా అబద్ధాలు చెప్పింది. తనను హింసిస్తున్నాడనేది. వంటిమీదలాంటి గుర్తులేమీ వుండేవి కాదు. తన మాట వినడనేది. అమ్మాయి కోరికలెలాంటివో నాకు తెలుసు. పెళ్ళయ్యాక ఆ వస్తువులన్నీ అమిరాయి. అంటే దానిమాట వింటున్నాడనేగా?"

"మరి అబద్ధాలెందుకు చెప్పేది?"

"ఎందుకంటే దానికి మా అందరిమీదా కోపం. మా గురించి తనేదో పెద్ద త్యాగం చేశానని అంతా

అనుకోవాలనుకునేది. మోహనరావుతో పెళ్ళయ్యాక జీవితంలో దానికి తీరని కోరికలేదు. తృప్తి దాని కళ్ళలోనే కనపడేది. కానీ ఒప్పుకోవడం దానికిష్టంలేదు...."

"ఆత్మహత్య యెందుకు చేసుకుందంటారు?"

"అదే ఆశ్చర్యంగా వుంది..." అని సీమ తండ్రి స్వరం తగ్గించి—"చిన్నతనం నుంచీ సీమ మహా మొండిమనిషి. తానను కున్నది సాధించనిదే ఊరుకునేది కాదు. ఇప్పుడేమో ఈ పెళ్ళి విషయంలో ఇలాగయింది. అందుకే అటు మోహనరావుమీదా, ఇటు మాపైనా పగబట్టి ఇలా సాధించాలనుకుంది. మేము చేసిన పనికి జీవితాంతం విచారించాలంటే దానికిదే మార్గం తోచింది...—" అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

అప్పుడాయన ముఖం చూస్తూంటే కిల్లర్‌కు జాలేసింది—"ఈ పెళ్ళి చేసినందుకిప్పుడు విచారిస్తున్నారా?"

"అవును. అది సుఖపడుతుందనుకున్నాంగానీ ఇలా ప్రాణాలు తీసుకుంటుందనుకోలేదు. ఈ పెళ్ళి జరక్కపోతే కనీసం మనిషైనా మిగిలేది...నా తెలివితక్కువతనంవల్ల అసలుకే మోసం వచ్చింది. దాని మొండితనం గురించి తెలిసీ తప్పటడుగు వేశాను..."

"ఒకవేళ సీమ ఆత్మహత్య చేసుకోలేదేమో..."

"అంటే?"

"సీమ హత్యచేయబడిందని నా నమ్మకం.."

"దాన్నెవరు చంపుతారు? ఎందుకు చంపుతారు?"

"ఎందుకో చెప్పలేను..కానీ భర్త అయుండవచ్చు.."

"అతడెందుకు చంపుతాడు? దాన్ని మనసారా కోరి ఇష్టపడి పెళ్ళిచేసుకున్నాడు. అదే తప్పుచేసినా క్షమించడానికి సిద్ధంగా వున్నాడు...."

"కావచ్చు....కానీ సీమ భర్తను విసిగించింది. అతడిపై దుష్ప్రచారం ప్రారంభించింది..."

"అవును. ఆ విషయం అతడు నాకు చెప్పుకుని బాధ పడ్డాడు...."

"మీకు చెప్పుకున్నాడా?" ఆశ్చర్యంగా అడిగాడు కిల్లర్.

"అవును..."

"అందువల్ల ప్రయోజనం...."

"సీమ ప్రేమను తప్ప అంచనా వేశామని అతడు బాధపడేవాడు అయితే సీమ నిప్పులాంటి మనిషనీ—ప్రేమతో ఆమెను తనవైపు తిప్పుకుంటాననీ అతడన్నాడు..."

"ప్రయత్నించి విసిగిపోయాడేమో!"

"లేదు. విసుగంటూ కలిగితే అతడు లేదా నా చంపుకుంటాడు తప్ప సీమ ఒంటిమీద చేయి వేయలేడు. సీమకు చీము కుట్టినా అతడు సహించలేక పోయేవాడు..."

"అదంతా నటన కావచ్చు.."

సీమ తండ్రి చురుగ్గా కిల్లర్ వంక చూసి—"సీమ గురించి మాకు తెలిసినట్లు మీకు తెలియదు. అది ఉండి తనంతో ఆత్మహత్య చేసుకుంది—" అన్నాడు.

"కన్నకూతురి గురించి మీకంతా తెలుసనుకున్నారు. ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని ఊహించలేక పోయారు!" అన్నాడు కిల్లర్.

"అంటే మీ ఉద్దేశ్యం..."

"చాలా విషయాలు మనకు తెలుసనుకుంటాం. కానీ తెలియవు.."

సీమ తండ్రి క్షణం తటపటాయించి—"మీరు మా

అల్లుడిననుమానిస్తున్నారనుకుంటాను. ఒక్కసారి మా చిన్నమ్మాయి స్నేహతో మాట్లాడితే మీ సందేహాలన్నీ తీరిపోతాయి—" అన్నాడు.

"ఎలా?"

"అమ్మాయింట్లోనే వుంది.."

"అమ్మాయికి పెళ్ళయిపోయిందేమో..."

"అయింది కానీ ఊళ్ళో ఊళ్ళోనేగా..అక్కపోయిన దుఃఖం తల్లితో పంచుకుందుకు వచ్చింది..."

"ఇంత దుఃఖంలోనూ మీరు అల్లుడి క్షేమం గురించి ఆలోచిస్తున్నారు.."

"కూతురుపోవడం నా దురదృష్టం. అందుకని ఓ అమాయకుడికి చేయని నేరాన్నంటగట్టలేను-" అన్నాడు సీమ తండ్రి.

"సరే—మీ అమ్మాయిని పిలవండి..మీ కభ్యంతరం లేకపోతే ఆమెతో యేకాంతంగా మాట్లాడాలి..." అన్నాడు కిల్లర్.

"మీరు డిటెక్టివులు. మీకు సహకరించడం నా బాధ్యత.." అన్నాడు సీమ తండ్రి.

కొద్దిక్షణాలలోనే ఓ గదిలో స్నేహను కలుసుకున్నాడు కిల్లర్.

స్నేహకూడా ఇంచుమించు సీమలాగే వుంది. మనిషి కాస్తరంగు తక్కువ. కొద్దిగా పొట్టి.

కిల్లర్ తన్నుతాను పరిచయం చేసుకుని సీమ హత్య కాబడిందనీ, మోహనరావుననుమానిస్తున్నానీ చెప్పాడు.

"బావ ననుమానించడం చాలా అన్యాయం!" అంది స్నేహ వెంటనే.

"ఎందుకని?"

"ఎందుకంటే మొదట్లో కొంతకాలం మేము కూడా బావనుమానించాము. అక్కయ్య బావ గురించి చాలా నేరాలు చెప్పింది. అవన్నీ నిజమని నమ్మేమంతా. ముఖ్యంగా నేను.."

"అసలవి అబద్దాలని ఎందుకనుకోవాలి?"

"బావ గురించి అక్కయ్యేం చెప్పిందంటే....?" అంటూ ప్రారంభించింది స్నేహ. ఆమె చెప్పిన విశేషాలతడి కాశ్చర్యాన్ని కలిగించాయి.

మోహనరావింట్లో ఓ పనిమనిషి వుంది. అది మనిషాటే బాగుండదు. మోహనరావా పనిమనిషి అందాన్ని పొగిడి సీమను దాని యెదుటే చిన్నబుచ్చేవాడు ఖరీదైన సీమ బట్టలు పనిమనిషిని కట్టుకోమనేవాడు. దాని బట్టలు సీమను కట్టుకోమనేవాడు. పనిమనిషి అజమాయిషీలో ఇంటి చాకిరీ అంతా సీమచేత చేయించేవాడు. ఇది వాళ్ళ ముగ్గురికీ తప్ప వేరెవ్వరికీ తెలియకూడదంటుంది సీమ. ఆమెకిది చాలా అవమానంగా వుండేది.

"అతడలా ఎందుకు చేసేవాట్ట?"

"నువ్వు దర్పురాలివి. ఒక్కసారిగా ఐశ్వర్యాన్ని భరించుకోలేవు. నెమ్మదిగా అలవాటు పడాలి—అనేవాడని సీమ చెప్పింది..."

"ఈ మాటలబద్ధమని యెందుకనుకోవలసి వచ్చింది?"

"అక్క మాటలు వినగానే నాకావేశం వచ్చింది. సరాసరి బావనే వెళ్ళి అడిగేశాను. బావ చలించలేదు. మీ అక్కకు నామీద అబద్ధాలు చెప్పడం సరదా అన్నాడు. కావాలంటే మీ అక్క చేతనే నిజం చెప్పిస్తానన్నాడు. చెప్పించమన్నాను. బావ అక్కను పిలిచాడు. ఓ గదిలోకి తీసుకొని వెళ్ళాడు. కాసేపాగి నన్ను

లోపలికి పిలిచాడు. అక్క తను చెప్పినవన్నీ అబద్ధాలని ఒప్పుకొంది..."

కిల్లర్ ఆశ్చర్యంగా—"తన అబద్ధాలెందుకను చెప్పిందిట?" అన్నాడు.

"అప్పుడప్పుడు తన మనసు మనసులో వుండదుట. ఎందుకో బావంటే ఆవేశం వస్తుందిట. బహుశా తన ప్రేమ వివాహాన్ని దెబ్బతీశాడనికూడా కావచ్చునంది. అలా అబద్ధాలు చెప్పాలనిపిస్తుందిట. బావ దేవుడుట. తన్ను దేవతలా ఆరాధిస్తున్నాడుట... ముందుముందుకూడా తాన అబద్ధాలు చెబితే సీరియస్‌గా తీసుకోవద్దంది—...." అంది స్నేహ.

"చాలా విచిత్రంగా వుంది. మీ బావ గదిలోనికి తీసుకొనివెళ్ళి ఆమెను బెదిరించాదేమో!" అన్నాడు కిల్లర్.

"అక్క ముఖంలో భయం లేదప్పుడు. ఎంతో ప్రశాంతంగా వుంది. బావ చెప్పినదేమిటంటే నిజం చెప్పమని తను బ్రతిమాలుతున్నానని!"

"ఆ బ్రతిమాలడం నీ యెదురుగా యెందుకు చేయలేదు?"

స్నేహ అంత విషాదంలోనూ నవ్వి — "మరదలి ముందైనా సరే భార్య కాళ్ళు పట్టుకోవడం తనకు చిన్నతనమన్నాడు బావ...." అంది.

"ఆ తర్వాత సీమ మళ్ళీ నీకు బావ గురించి అబద్ధాలు చెప్పిందా?"

"అహా—చెప్పడం అదేమానలేదు.... పైగా ఇంకా దారుణంగా చెప్పేది. బావలో యేదో మంత్రశక్తి వున్నదంది. అందుకే తను నవనీత్‌ని కాదని అతణ్ణి పెళ్ళి

చేసుకుందట. అందుకే అతడెదురుగా వుంటే అతడికి వ్యతిరేకంగా మాట్లాడలేదుట. ఆపైన నన్ను హెచ్చరించిందికూడా .... ఇక్కడికి రాకు .... నీకు తెలియకుండానే బావకు లొంగిపోతావు— ..అంటూ...." ఈ మాట చెప్పడానికి స్నేహ కొంచెం సిగ్గుపడింది.

"మోహనరావులాంటి వాడని నీకు అనిపించిందా?"

"లేదు. బావ చాలా మర్యాదస్థుడు." అంది స్నేహ వెంటనే.

"ఆ మాట నీవు మీ అక్కకు చెప్పావా?"

"చెప్పాను. ఇంట్లో యెవ్వరూ తనమాట వినడం లేదని విసిగిపోయి అది చివరికొరోజున — మీ రెవ్వరూ నాకు కలిసిరారు. ఏదో ఒకరోజున నేను ఆత్మహత్య చేసుకుంటాను. అప్పుడు తెలిసివస్తుంది.... అంది...."

కిల్లర్ ఆమెను మరికొన్ని ప్రశ్నలు వేసి అర్థం చేసుకున్నదిది.

సీమకు నవనీత్ ని మర్చిపోవడం సాధ్యం కావడంలేదు. ఆమె ప్రేమను అందరూ తక్కువ అంచనా వేశారు. ఆమె మోహనరావుని ద్వేషిస్తోంది. అతడిని మానసికంగా హింసించడమే ఆమె ధ్యేయం. అందువల్ల ప్రయోజన మేమిటీ అన్న విషయం ఆమె కవసరంలేదు. ఆమె మొండిది. అనుకున్నది సాధించాలి. ఆ మొండితనంతోనే ఆత్మహత్య చేసుకుంది.

ఇంచుమించు సీమ తండ్రి చెప్పినమాటలనే సీమ చెల్లెలూ చెప్పింది. సీమ అబద్ధాలు చెబుతున్నదని ఆమె వద్ద ఋజువుకూడా వుంది.

"ఇంతగా సీమ ప్రేమను పొందిన ఆ నవనీత్ ను కలుసు

కోవాలి. అతడి అడ్రసు కావాలి నాకు...." అన్నాడు కిల్లర్.

"అంటే మీరింకా ఈ కేసు పరిశోధిస్తారా?" అంది స్నేహ ఆశ్చర్యంగా.

"మొండితనంతో ఆత్మహత్య చేసుకుందని సీమ గురించి మీరంతా అంటున్నారు. ఆమెకు జీవించాలన్న కాంక్ష ఎక్కువగా వున్నదని నా అభిప్రాయం. ఆమె హఠాత్తుగా ఆత్మహత్య యెందుకు చేసుకుందో తెలుసుకోనితీరాలి నేను...." అన్నాడు కిల్లర్.

స్నేహ అతడికి నవనీత్ చిరునామా యిచ్చింది.

# 7

చాలా చిన్నగది అది. అందులో ప్లాస్టిక్ పట్టెడ వున్న ఇనుపమంచం మీద కూర్చున్నాడు నవనీత్. అతడి కెదురుగా చిన్న ఇనుప కుర్చీలో కూర్చున్నాడు కిల్లర్.

నవనీత్ చూడ్డానికి చాలా సామాన్యంగా వున్నాడు. సన్నగా, పొడుగ్గా, చామనఛాయలో వున్న నవనీత్ ముఖం మొదటిసారి చూడగానే గుర్తుండిపోతుందను కుందుకులేదు.

కిల్లర్ అతడికి తన కథ చెప్పి—"నిన్ను చూడాలని వచ్చాను—" అన్నాడు.

"నాకోసం ఉద్యోగం చూడండి. నేనే మిమ్మల్ని చూడాలని వస్తాను ..." అన్నాడు నవనీత్. అతడి గొంతు వినసొంపుగా వుంది.

"నువ్వు సీమను ప్రేమించావు. సీమ నిన్ను ప్రేమించింది. నీ ప్రేమ కథ గురించి నీ నోట వినాలనుకుంటున్నాను—" అన్నాడు కిల్లర్.

"మా ప్రేమ కథ నిజంకాదు. అబద్ధం!" అన్నాడు

నవనీత్.

"అంటే?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

"సీమ తమ్ముడికి ప్రైవేటు చెప్పడానికి నేను వాళ్ళింటికి వెళ్ళేవాణ్ని. అదే మా పరిచయానికి దారి తీసింది. నాకు మోహనరావు యెవర్కూ తెలీదు. సీమ తనే కల్పించుకొని మాట్లాడేది—"

"ఎందుకని?"

"మొదట్లో నాకు తెలియలేదు. కానీ తర్వాత తెలిసింది. చాలా విచిత్రమైన కేసు...." అన్నాడు నవనీత్. అతడు చెబుతున్నది కిల్లర్ కుతూహలంగా విన్నాడు.

సీమను మోహనరావు ప్రేమించి పెళ్ళి గురించి అడగడానికి రెండేళ్ళ ముందునుంచీ నవనీత్ వాళ్ళింట్లో ప్రయివేట్ చెబుతున్నాడు. మోహనరావుతో పెళ్ళి సీమకిష్టంలేదు. ఆ పెళ్లి నుంచి తప్పించుకోవడంకోసం నవనీత్ తో ప్రేమకథను సృష్టించింది సీమ.

"అందువల్ల ప్రయోజనం?"

"రెండువిధాలు. ఒకటి మా యిద్దరి పెళ్లికి తలిదండ్రులామోదించరు. సీమ గతం గురించి తెలిసిన మోహనరావుక్కూడా ఈ పెళ్ళంటే విముఖత బయల్దేరుతుంది. కానీ అలా జరుగలేదు...."

"నువ్వు నిజమే చెబుతున్నావా?"

"అబద్ధం చెప్పాల్సిన అవసరం నాకు లేదు..."

"ఉంది—" అన్నాడు కిల్లర్—"నీకుద్యోగం లేదు. ఎప్పుడు దొరుకుతుందో కూడా తెలియదు. సీమను నిజంగా ప్రేమించావు. కాబట్టి నువ్వామె సుఖాన్ని కోరి పెళ్లికి ఒప్పుకోలేదు. మోహనరావుతో ఆమె దాంపత్య జీవనం సరిగా కొనసాగాలని మీ ప్రేమ అబద్ధమని చెప్పావు."

నవనీత్ నవ్వి—"మీరిలాగనుకున్నా నా కభ్యంతరం లేదు—" అన్నాడు.

"నాకు నిజం కావాలి—" అన్నాడు కిల్లర్.

"సీమ నిజంగా నన్ను ప్రేమించలేదు. పెళ్ళిని వాయిదా వేయడంకోసమే ఆమె ఈ ప్రేమను నటించింది..."

"మోహనరావుతో పెళ్ళి సీమకిష్టంలేదంటే—అందుకొక్కటే కారణం .... ఆమె యింకెవరినో ప్రేమించి వుండాలి...." అన్నాడు కిల్లర్.

"కావచ్చు. ఆ ప్రేమికుణ్ని నేను మాత్రం కాను" అన్నాడు నవనీత్.

"పోనీ—ఎవరో నీకు తెలుసా?"

"ఉన్నట్లుకూడా నాకు తెలియదు...."

కిల్లర్ చటుక్కున — "నువ్వు సీమకు చివరిసారిగా రాసిన ఉత్తరం చనిపోయేముందుకూడా భద్రంగా తన వద్దనే దాచుకుంది. దాని సంగతేమిటంటావు?" అన్నాడు.

"నేను సీమకెన్నడూ ఉత్తరాలే రాయలేదు...."

కిల్లర్ తెల్లబోయి — "అయితే సీమవద్ద దొరికిన ఆ ఉత్తర మెవరు రాశారు?" అన్నాడు.

"ఏమో—నాకు తెలియదు...."

"నువ్వు ప్రయివేట్లు చెబుతున్నావు కదా — నీ స్టూడెంట్సు గురించి ప్రిపేరు చేసిన నోట్సేమైనా నీ దగ్గరున్నాయా?" అన్నాడు కిల్లర్....

"ఉన్నాయి—" అంటూ నాలుగు పుస్తకాలు తెచ్చిచ్చాడు నవనీత్.

కిల్లర్ వాటిని శ్రద్ధగా పరిశీలించి—"నేను చెప్పినట్లో

ఉత్తరం రాయి—" అన్నాడు.

నవనీత్ కాగితం, పెన్నూ, అట్ట తీసుకొన్నాడు.

"ప్రియా!" అంటూ ప్రారంభించాడు కిల్లర్. నవనీత్ రాస్తూంటే అతడి ముఖభావాలనే శ్రద్ధగా గమనించ సాగాడు. అతడిలో యేవిధమైన ప్రత్యేక భావాలూ లేవు.

ఉత్తరం రాయడం ముగిసేక అందులోని దస్తూరిని నోట్సులోని దస్తూరితో సరిపోల్చి తృప్తిగా తలాడించి— "ఈ ఉత్తరం దుర్వినియోగం చేసుకోను. నాకిస్తావా?" అన్నాడు.

"తప్పకుండా!" అన్నాడు నవనీత్.

"నీను ఆత్మహత్య చేసుకుందంటే నీకేమీ అనిపించడం లేదా?...."

"లేదు. నా కష్టాలు నాకున్నాయి...." అన్నాడు నవనీత్.

"ఓ అద్భుత ప్రేమికుణ్ని చూడాలని వచ్చాను. నిన్ను చూశాను. నువ్వు మీ ప్రేమ అబద్ధమన్న సంగతి మోహనరావుకు చెప్పావా?" అన్నాడు కిల్లర్.

"చెబుదామని ఒకసారి వెళ్ళాను — నీను పెళ్ళికి ముందే! అతడు నేను మాట్లాడకుండానే నేను చెప్ప దల్చుకున్నది చెప్పి — నువ్వు చెప్పాలనుకుంటున్నదిదే అయితే ఈ విషయం నీనుద్వారా నేనెప్పుడో విన్నాను- అన్నాడు. నేను కంగారుపడి — ఇది మేమిద్దరం కలిసి ఆడుతున్న నాటకమని అనుకోకద్దు. నిజంగానే మేము ప్రేమికులం కాదు — అని చెప్పాను. అతను పెద్దగా నవ్వి మే అవగాహనా లేకుండానే మా పెళ్ళెలా జరుగుతుంది? నీను నాకు అన్నీ చెప్పింది. నేనా మెను

నమ్ముతున్నాను — అన్నాడు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. సీమ ఒక విచిత్ర వ్యక్తి అనిపించింది నాకు...." అన్నాడు నవనీత్.

"నీ మాటలు నమ్మశక్యంగా లేవు...." అన్నాడు కిల్లర్.

"నాకు తెలిసిన నిజం చెప్పాను...." అన్నాడు నవనీత్.

"ఇంతకీ సీమ, మోహనరావు పెళ్ళికిముందే ఒకరి నొకరు బాగా అర్థంచేసుకొన్నారని అంటావు...."

"అవును. కానీ మోహనరావు మాటలు నాకు నమ్మకం కలిగించలేదు. సీమ ఈ పెళ్లి గురించి చాలా తీవ్రంగా ప్రతిఘటించింది...." అన్నాడు నవనీత్.

"ఏమిటో — ముందుకు వెళ్లినకొద్దీ కేసు మరింత అయోమయంగా తయారవుతోంది. పెళ్లి తప్పనిసరి అని గ్రహించి సీమ మోహనరావుకు నీతో ప్రేమ అబద్ధమని చెప్పి వుండవచ్చు. అయితే పెళ్లికి ప్రతిఘటించడానికి ఆమె వేరే యువకుణ్ని ప్రేమించడం కారణ మయుండ వచ్చు. అతడెవరో తెలుసుకోవాలి?" అని — "సీమ ఆత్మహత్య చేసుకొంటుందని నీకనిపిస్తోందా?" అన్నాడు కిల్లర్.

నవనీత్ పెదవి విరిచి నిట్టూర్చి—"నేనేం చెప్పగలను? ఆమె గురించి నాకు తెలిసింది చాలా తక్కువ—" అన్నాడు.

# 8

డిటెక్టివ్ కిల్లర్ ఇన్‌స్పెక్టర్ గోవర్ధన్‌ని కలుసుకొని శవం దగ్గర ఉత్తరాన్నీ, నవనీత్ ఉత్తరాన్నీ సరిపోల్చి చూశాడు. రెండూ వేర్వేరు దస్తూరీలలో వున్నాయి.

"సీమ ఆత్మహత్య చేసుకొంది. అందుకు కారణం ఆమె ప్రేమ. చివరి క్షణంవరకూ ఆమె తన ప్రియుడి ఉత్తరాన్ని తనవద్ద దాచుకొంది. మనకు తెలిసిన సమాచారాన్ని బట్టి ఆ ఉత్తరం నవనీత్ వ్రాసినదై వుండాలి. ఇప్పుడు తేలిందాన్ని బట్టి సీమకు వేరే ఇంకెవరో ప్రియుడుండి వుండాలి. ఆ ప్రియుడి గురించి సీమ తలిదండ్రుల కూడా తెలియదు ..." అన్నాడు కిల్లర్.

"మనమూ తెలుసుకోవద్దు. ఊరుకుందాం-" అన్నాడు గోవర్ధన్.

"నేనూ రుకోలేను ...."

"తెలుసుకొని ఏం చేస్తారు?"

"అతడే హంతకుడు కావచ్చు...."

"ఎలా?"

"నా అభిప్రాయంలో సీమ తన ప్రియుడివల్ల బాగా ప్రభావితమైంది. ఏ కారణంవల్లనో అతడి గురించి ఆమె యింట్లో చెప్పుకోలేకపోయింది. తాత్కాలికంగా నవనీత్ ని ఉపయోగించి పెళ్ళి తప్పించుకోవాలనుకొంది. ఫలించలేదు. అప్పుడు నిజంగానే ఆమె ఎటూ తేల్చుకోలేకపోయింది.

ఆమెలో రెండు భావాలమధ్య పోరాటం ప్రారంభమై భిన్న వ్యక్తిత్వాలకు రూపకల్పన జరిగింది. ఒక వ్యక్తి మోహనరావును ద్వేషించాలనుకొంది. రెండో వ్యక్తి మోహనరావును ప్రేమించాలనుకొంది. అందుకే ఆమె విచిత్రంగా ప్రవర్తించింది.

ఈలోగా ఆమె ప్రియుడామెను కలుసుకొన్నాడు. సీమను తనదాన్ని చేసుకోవాలని ప్రయత్నించాడు. సీమ భర్తను ద్వేషిస్తోంది కానీ ప్రియుడికి చేరువకాలేక

పోయింది.

ఆ నా మె ప్రియుడు సహించలేకపోయాడు. ఆమె మోహనరాఘవకూడా దక్కకూడద నుకున్నాడు. అందుకే ఆమె నాత్మహత్యకు ప్రోత్సహించాడు. ఇద్దరం కలిసి చచ్చిపోదామన్నాడు. తను చచ్చిపోతున్నట్లు ఆమెకు భ్రమ కలిగించాడు. ఆమె ఆత్మహత్య చేసుకొన్నప్పు డతడక్కడే ఉండివుంటాడు. ఏ విషమో మింగినట్లు నటించి ఉంటాడు. ఆ తర్వాత నిజంగా చచ్చిపోయాడో లేదో మనకు తెలియదు...."

"చాలా ఫన్నీగా ఉంది కథ...." అన్నాడు గోవర్ధన్.

"ఎందుకని?"

"భిన్న వ్యక్తిత్వాలు...."

"డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్ కథ చదివారా మీరు?"

"చదివాను కానీ దీనికి అన్వయించలేను. అది నమ్మినాకూడా మీ కథలో యింకా చాలా లోపాలున్నాయి...."

"ఆ లోపాలన్నిటికి బదులు దొరుకుతుంది—సీమ ప్రియుడెవరో తెలిస్తే....!?"

గోవర్ధన్ చిరాగ్గా—"అది మాత్రం యెలా తెలుసుకుంటారు?" అన్నాడు.

"చాలా సులభం" అన్నాడు కిల్లర్. అతడు గోవర్ధన్ దగ్గరున్న సీమ ప్రియుడి లేఖను పరీక్షగా చూశాడు. అదొక ఇన్లాండ్ లెటరు. దానిమీద పోస్టలు ముద్రలను పరిశీలించాడు. అదృష్టవశాత్తూ పరీక్షగా చూస్తే వాటి వివరాలు సులభంగా తెలిశాయి.

ఉత్తరం ఒకచోట పోస్టయింది. మర్నాడే రెండో చోటకు చేరుకొంది. చేరుకొన్న పోస్టాఫీసు సీమ ఫ్రుట్టింటికి ఉత్తరాలు చేరవేసే స్థలం కాదు.

"ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు గోవర్ధన్.

"అంతే కాదు. ఈ ఉత్తరంమీద ఫ్రం అడ్రసూ, టూ అడ్రసూ కూడా తిరిగి చదువలేని విధంగా కొట్టేయబడి ఉన్నాయి—" అన్నాడు కిల్లర్.

"అందులో ఆశ్చర్యమేముంది? సీమ ఆ పని చేసి ఉంటుంది. ఇలాంటి ఉత్తరాలు యెవరి పేరున వచ్చాయో, యెవరు రాశారో తెలియడం ప్రేమికుల కిష్టముండదు...."

"అది నిజమే....కానీ లోపల కూడా తేదీ కొట్టివేయబడి ఉంది. అంటే ఈ ఉత్తరం తనకెప్పుడు వచ్చిందీ కూడా ఇతరులకు తెలియడం సీమ కిష్టంలేదన్న మాట.... అయితే పోస్టల్ ముద్రల్నిబట్టి తేదీ తెలుసుకుంటారని ఆమె అనుకుని వుండదు"

గోవర్ధన్ నవ్వి—"మనం పోలీసు బుర్రతో తెలుసుకున్నాం గానీ—ముద్రల్లో తేదీలు స్పష్టంగా తెలియడం లేదు—" అన్నాడు.

"అదీ నిజమే! కానీ ఈ ఉత్తరం సీమప్రియుడు ఆమె పెళ్ళికి ముందు రాసేడని ముందు మనం అనుకున్నాం. పోస్టల్ ముద్రలనుబట్టి చూస్తూంటే ఈ ఉత్తరం రాయబడి అయిదు వారాలు మాత్రమే అయింది...."

అన్నాడు కిల్లర్.

గోవర్ధన్ ఆశ్చర్యంగా—"అవును—" అన్నాడు.

"దీన్నిబట్టి మనం రెండు విధాలూ లూహించవచ్చు. ఒకటి—సీమప్రియుడు—ఆమె పెళ్ళి సమయానికక్కడ

లేదు. ఇటీవలే తిరిగివచ్చి ఈ విషయం తెలుసుకుని ఆమెను కలుసుకోలేని దారిలేక ఈ ఉత్తరం రాసి ఉంటాడు. రెండో పాసిబులిటీ యేమిటంటే.... ఈ ఉత్తరం సీమకు కాదు.... వేరెవరికో అయ్యింటుంది...." అన్నాడు కిల్లర్.

"అదెలా సాధ్యం?"

"హంతకుడు మనని తప్పుదారి పట్టించడం కోసం ఈ ఉత్తరాన్ని సంపాదించి సీమ దగ్గరుంచి వుంటాడు...." అన్నాడు కిల్లర్.

"మీరు నిజంగా కోడి గుడ్డుకు—ఈకలు పీకుతున్నారు. మీ అనుమానాల నెలా నివృత్తి చేసుకుంటారు?" అన్నాడు.

"చాలా సింపుల్.... ఈ ఉత్తరం చేరిన పోస్టాఫీసు రేంజిలో—ఈ తేదీ ప్రాంతాల జరిగిన వివాహాల గురించి తెలుసుకుంటాను. ఆ యా యువతుల పూర్వ పరిచయాల గురించి విచారించి వారిలో ఉత్తరం పోస్టయిన ప్రాంతాల వారెవరైనా ఉన్నారేమో చూస్తాను...."

గోవర్ధన్ ఆశ్చర్యంగా—"యూ ఆర్ రియల్లీ ఏ జీనియస్—" అన్నాడు.

## 9

"డియర్ గోవర్ధన్! ఇప్పుడు చాలా విషయాలు తేలిపోయాయి...." అన్నాడు కిల్లర్ ఉత్సాహంగా.

"చెప్పండి—...." అన్నాడు గోవర్ధన్ కుతూహలంగా.

"ఈ ఉత్తరం ప్రియ అనబడే అమ్మాయికి వ్రాయబడింది. సుందరరావు ఆమెకు ఉత్తరం రాసిన భగ్న ప్రేమికుడు. ఆ ఉత్తరం ప్రియకు చేరలేదు.... ఉత్తరం

సుందర్రావే వ్రాశాడనడానికిదిగో—సుందర్రావు దస్తూరీ సాక్ష్యం...." అన్నాడు కిల్లర్.

"ఉత్తరం ప్రియకు చేరకపోతే ఈ అడ్రసు కొట్టివేయడం ఎలా జరిగింది?" అన్నాడు గోవర్ధన్.

"అన్నీ వివరంగా చెపుతాను—వినండి!" అన్నాడు కిల్లర్.

ప్రియను సుందర్రావు ప్రేమించాడు. ఆమె అతడంటే ఇష్టపడింది, కానీ వివాహానికి తలిదండ్రుల నిర్ణయానికే ప్రాముఖ్యత నిచ్చింది. ఇద్దరూ కలుసుకునేవారు. ఈలోగా ప్రియకు వివాహం కుదిరింది. సుందర్రావామెను కలుసుకునే అవకాశాలు తగ్గిపోయాయి. విషయాన్నతడర్థం చేసుకోగలడని ప్రియ అతడికి తన పెళ్ళి శుభలేఖ కూడా పంపింది.

వీరి ప్రేమ వ్యవహారం గురించి మోహనరావుకు తెలుసు. దూరపు బంధుత్వం కారణంగా మోహనరావుకు ప్రియ కుటుంబంతో పరిచయముంది. మోహనరావు ప్రియను రెండు మూడుసార్లు ప్రేమలేఖల గురించి అడిగాడు అవి దగ్గరుంటే ప్రమాదమనీ—నాశనం చేయమనీ చెప్పాడు. తనదగ్గర ప్రేమలేఖలేమీ లేవని ఆమె చెప్పింది.

"ముందు ఇంకా వస్తే?" అన్నాడతడు.

"వస్తే ఇంకొక్కటి రావచ్చు. నా పెళ్ళి శుభలేఖ పంపాను...." అంది ప్రియ. ఆమె అతణ్ణి కలుసుకోవడం తప్ప ప్రేమలేఖలు వ్రాసి ఉండలేదు.

తన ఉత్తరం ప్రియకందే ఉంటుందని సుందర్రావనుకొన్నాడు. పోస్టాఫీసు దగ్గర విచారించగా ప్రియ ఉత్తరాల గురించి రోజూ ఓ యువకుడు విచారిస్తూండేవాడని

చెప్పాడు పోస్టుమాన్. అతడు చెప్పిన పోలికలు— మోహనరావుకు సరిపోయాయి అంటే మోహనరావు ప్రియకు వచ్చిన ఉత్తరాన్ని సంపాదించడానికి ప్రయత్నించి విజయం సాధించాడన్నమాట!

"చాలా విచిత్రంగా ఉంది—...." అన్నాడు గోవర్ధన్.

"విచిత్రమే కావచ్చు. కానీ నేను చెప్పిన విశేషా లన్నింటికీ ఋజువు లున్నాయి—" అన్నాడు కిల్లర్.

"ఈ ఋజువులలో మీ రింకా యేమి సాధించదల్చు కొన్నారు?"

"ప్రియ నాకు కొన్ని విశేషాలు చెప్పింది. మోహన రావు కద్ద వశీకరణ శక్తి ఉంది. ఏకాంతంలో ఆడపిల్లల దగ్గర అతడు చనువు తీసుకుంటాడు. వారించడం కష్టం. అతడి స్వభావం తెలుసుకొన్నాక ఆమె అతడిని ఏకాం తంగా కలుసుకో నేది కాదుట...."

"తమ బలహీనతలను ఎదుటివారి వశీకరణ శక్తిగా భావించేవారు కొందరుంటారు. ప్రియ వయసు ప్రభా వానికి లోబడి ఉంటుంది...." అన్నాడు గోవర్ధన్.

"కావచ్చు. కానీ మోహనరావింట్లో పనిమనిషి కూడా కొన్ని విశేషాలు చెప్పింది. ఆమె చెప్పిన ప్రకారం మోహనరావెన్నడూ సీనును తనముందు చిన్నబుచ్చలేదు. కష్టపెట్టలేదు. అయితే ఆ యింట్లో తనేం చేసేదో, అక్కడేం జరిగిందో తల బద్దలు కొట్టుకొన్నా ఆమెకు గుర్తుండేది కాదుట. అలా అప్పుడప్పుడు మాత్రమే జరిగేదట...."

"అంటే?"

"మోహనరావు నేరస్థుడు. అందులో సందేహంలేదు.

అయితే అతడెందుకు నేరం చేశాడో మనం తెలుసు కోవాలి. అందుకు ముహూర్తం రేపు...." అన్నాడు కిల్లర్.

"ఎలా తెలుసుకొంటారు?"

"మీరే చూద్దురు గాని!"

## 10

"నాకు సీమపై ద్వేషం లేదు. ప్రేమ లేదు నీ నామె నొక ప్రయోగం గురించి ఎన్నుకున్నాను. నా ప్రయోగం విజయవంతమయింది.... నా రహస్యాలు కొన్ని సుకుమార్ కు తెలుసు. అతను నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. వ్యాపారంలో అభివృద్ధి సాధించడానికి ఎవరైనా తప్పుదార్లు తొక్కక తప్పదు. అవి సుకుమార్ కి తెలిశాయి. అతడు నా హార్డ్ వేర్ షాపును తన కమ్మమని బలవంత పెడుతున్నాడు. అతడిని అంతం చేయాలి. ఎలా?

"బాగా ఆలోచించాను. చిన్నతనం నుంచీ హిప్నాటిజమంటే నాకు ఆసక్తి. ఒక స్నేహితుడివద్ద కొన్ని ట్రిక్స్ నేర్చుకొన్నాను. వాటిని ఆడపిల్లలమీద ప్రయోగించేవాణ్ణి. హిప్నాటిజం ప్రభావంలో వాళ్ళు నా ఇష్టానికి తలవంచేవాళ్ళు. వారిచేత బట్టలు విప్పించి నెమ్మదిగా వారిపై హిప్నాటిజాన్ని ఉపసంహరించేవాణ్ణి. అప్పుడు వారు తమ పరిస్థితేమిటో తెలియక సతమతమయ్యేవారు. నన్ను తప్పుపట్టలేక, తాము తప్పు చేయలేక విచిత్రమైన మానసిక బాధకు గురయ్యేవారు. కొందరు నాకు లొంగిపోయేవారు. కొందరు నాకు దూరంగా ఉండేవారు. వాళ్ళు నాకు భయపడేవారు తప్ప ద్వేషించేవారు కాదు.

"సీమతో ఆ విధంగా పరిచయం పెంచుకొన్నాను. బీచికద్ద ఆమెను దగ్గరగా తీసుకొనేవాణ్ణి. ముద్దు పెట్టుకునేవాణ్ణి. శరీరం తడిమేవాణ్ణి కాసేపు హిప్నాటిజం, కాసేపు వాస్తవం. ఆమెకూడా విచిత్రానుభవకు గురయింది. నాతో పెళ్ళిని వ్యతిరేకించింది. నవనీత్‌ని కథలోకి లాక్కొచ్చింది. నేనామెను హిప్నాటిజంతో లొంగదీసుకొని నిజం తెలుసుకొన్నాను. చివరికామె పెళ్ళికి అంగీకరించింది.

"నా పనిమనిషిని హిప్నాటిజానికి గురి చేసేవాణ్ణి. సీమను రకరకాల బాధించేవాణ్ణి. నా యింటికి కొందరు స్నేహితులను రప్పించేవాణ్ణి వాళ్ళను హిప్నాటిజానికి గురిచేసి సీమపై అత్యాచారం జరగడానికి ప్రోత్సహించేవాణ్ణి తమకేం జరుగుతున్నదీ స్నేహితులకు తెలియదు. సీమతో వారిని ప్రతిఘటించవద్దనీ నా వ్యాపారానికీ, ధన సంపాదనకూ ఆమె సహకరించాలనీ చెప్పేవాణ్ణి. ఆమెకది నచ్చేదికాదు. ప్రతిఘటించేది. అత్యాచారం కొనసాగేది కాదు.

సీమ నా గురించి పుట్టింట్లో నేరాలు చెప్పేది. సీమను హిప్నటైజ్ చేసి ఆమెచేత అవన్నీ అబద్ధాలని వారికి చెప్పించేవాణ్ణి. ఫలితంగా సీమ నొక అబద్ధాలకోరుగా ఇంటిల్లపాదీ భావించేవారు. తనమీద తన కెందుకు అదుపు లేదో సీమకు తెలిసేది కాదు. ఆమె కిష్టంలేని పనులు ఆమెచేత హిప్నాటైజ్ చేసి చేయించేవాణ్ణి. వాస్తవంలో అది గ్రహించిన సీమ నా హిప్నాటిజం గురించి తెలియక మానసికంగా తనలో ఏదో తేడా ఉందని భయపడేది.

"ఆ తర్వాత నుంచి ఆమెను ఆత్మహత్య చేసుకోమనీ

లేకపోతే చంపుతానని బెదిరించసాగాను. నేను చెప్పినట్లు చేయకపోతే—వేరే దారికూడా ఆమెకు లేదని చెప్పాను. నా మాట ఆమె కాదనలేదనీ తప్పక ఆత్మహత్య చేసుకుంటుందనీ చెప్పసాగాను. అందుకో కొత్త పద్ధతి అవలంబించాను. రెండు గవ్వల నామెకు చూపించి అవి నా కళ్ళనీ—అవి చూస్తూండగా నేను చెప్పినవన్నీ చేయాలనీ ఆమెకు హిప్నాటిజంతో సూచించేవాణ్ణి. అప్పుడు నేనిల్లు వదిలిపెట్టినా, కూడా సీమ ఆ గవ్వల నే చూస్తూ నేను చెప్పిన పనులన్నీ చేసేది.

"సీమకింక తను ఆత్మహత్య చేసుకొంటానన్న భయం పెరిగి ఒక రోజున ఇల్లు వదిలి పారిపోయింది. రోజంతా ఆమెకోసం వెతికాను. రాత్రి పదకొండు గంటలు దాటేక ఆమె నాకు రోడ్డమీద తిరుగుతూ కనిపించింది. చూపులతో వశపర్చుకొని ఇంటికి తీసుకొనిపోయాను. గవ్వల నామె ముందుంచి ఎన్ని గంటలకు ఆత్మహత్య చేసుకోవాలో చెప్పాను. ఈలోగా పారుగూర్లో గుళ్ళో పూజ కూడా చేయించుకొని వచ్చాను.

"సీమ వాత్మహత్యకు పురమాయించేక తిరిగి పారుగూరు వెళ్ళాను. అక్కడివాళ్ళకు నేను కార్లో బయటకు వెళ్ళినట్లు చెప్పవద్దని కోరాను. డాక్టరు చెప్పిన ప్రకారం సీమ ఆత్మహత్య రాత్రి మూడు గంటల ప్రాంతాల జరిగింది. ఆ సమయంలో నేను పారుగూర్లో పేకాడుతున్నాను కాబట్టి—రాత్రి పన్నెండు నుంచీ నేను అక్కడే ఉన్నాను కాబట్టి వాళ్ళెవరూ నన్ననుమానించలేరు. పారుగూర్నించి తిరిగిరాగానే ఆమె ఆత్మహత్యకు కారణం ప్రేమేనని అంతా అనుకోనేటందుకు బలమైన సాక్ష్య ముండాలని ముందుగా సిద్ధం చేసి ఉంచుకొన్న

ఉత్తరాన్నా మెకద్ద భద్రపరిచాను.

"సీను ఆత్మహత్య నా ప్రయోగానికో పెద్ద విజయం. ఇక సుకుమార్ ను కూడా యిదే విధంగా తుదముట్టించ గలను"

మోహనరావి మాటలు చెప్పడం ముగియగానే అతడి ఎదురుగా ఉన్న వ్యక్తి "చెప్పింది చాలు....ఇక కాసేపు పడుకో!" అన్నాడు.

మోహనరావు వెంటనే వాలి కళ్ళు మూసు కొన్నాడు.

గోవర్ధన్, కిల్లర్ బయటినుంచి లోపలికి వచ్చారు.

కిల్లర్ అక్కడి వ్యక్తితో కరచాలనం చేసి— "థాంక్యూ—డియర్ ప్రొఫెసర్! హిప్నాటిజంతో ఓ హంతకుడి బండారం బయట పెట్టించారు—...." అన్నాడు.

ప్రొఫెసర్ నవ్వి—"మీకు సహకరించడం నా బాధ్యత. అయితే రికార్డయిన ఈ విశేషాన్ని మీరు ఆధారంగా ఉపయోగించుకో నేందుకు లేదు...." అని యేదో చెప్పబోయాడు.

కిల్లర్ అతణ్ని మధ్యలోనే వారించి—"మోహన రావు నోటితో చెబితే తప్ప జరిగిందేమిటో తెలుసుకో లేని పరిస్థితిలో ఉన్నాం మేము. ఇలాంటిదేదో జరిగిందన్న అనుమానమున్నా — సరిగ్గా ఏం జరిగిందో ఊహించలేక వశీకరణకు వశీకరణమే మందని భావించి అసలు విషయం తెలుసుకుందుకు మీ సాయం తీసుకొన్నాను. ఇప్పుడు మోహనరావుకు జరిగింది తెలియనివ్వకుండా సుకుమార్ విషయంలో అడ్వాన్సు కానిచ్చి రెడ్ హేండెడ్ గా పట్టు కోవాలి. అది ఇన్ స్పెక్టర్ గోవర్ధన్ బాధ్యత...."

అన్నాడు.

గోవర్ధన్ కిల్లర్‌ని కౌగలించుకొని—"ఇదంతా ఎలా సాధించారు మీరు? సింపుల్ ఆత్మహత్యను హత్యగా నిరూపించి హంతకుణ్ని పట్టుకున్నారు...." అన్నాడు.

"మోహనరావు అతి తెలివికిపోయి ఓ ప్రేమలేఖను సీమ దగ్గ ఉంచడం పెద్ద పొరపాటు. అటుపైన చావుకు ముందు సీమ నన్ను కలుసుకొని ప్రాణాలు రక్షించమని అర్థించడం అతడి దురదృష్టం. అప్పుడు నేనామె కళ్ళలో చూసిన జీవిత కాంక్ష నెప్పటికీ మర్చిపోలేను...." అన్నాడు కిల్లర్ నిట్టూర్చి.

"కిల్లర్స్‌ని పట్టుకొనే మీకు కిల్లర్ పేరు సరైనది కాదు...." అని గోవర్ధన్ యేదో అనబోయాడు.

"అఫ్‌కోర్స్....అయామ్ కిల్లరాఫ్ క్రైమ్...." అని నవ్వాడు కిల్లర్.

—: అయిపోయింది :—

# వెంటాడే మృత్యువు

## భీమవరపు పురుషోత్తం

"ఖ్వాశిం, దీపక్ అటు చూడండి!" అన్నాడు నాగు.

అటువైపు చూశాను నేనూ. దూరంగా రెండు లైట్లు కనిపించాయి. ఏదో వాహనం వస్తూందనుకొంటూ ఇటువైపు. అయోమయంగా చూశాను నాగువైపు.

ఖాశిం, దీపక్‌లు అటువైపు చూస్తున్నారు. కనిపించే లైట్లు దేనికి సంబంధించినవో వారు గుర్తుపట్టినట్టున్నారు.

"పోలీస్ .... పోలీస్ ...." అంటూ బిగ్గరగా అరుస్తున్నాడు నాగు. అక్కడ మేం నలుగురం మేకాకుండా మరో పది హేనుమంది వున్నారు. వాళ్ళు మాలాగ నిలబడి అజమాయిషీ చెయ్యడంలేదు. బరువయిన చెక్కపెట్టెల్ని బోటులోనుండి, వాన్ లోనికి మోస్తున్నారు.

నాగు అరుపులు వినగానే పరిస్థితి అర్థమయింది నాకు. కాళ్ళు చల్లబడిపోయినట్లు అయింది.

మోసేవాళ్ళు యెక్కడివాళ్ళక్కడ పెట్టెలు పడేసి, అడ్డదిడ్డంగా పారిపోసాగారు. అప్పటికి వాన్ సగం

లోడ్ అయింది. డ్రైవరు క్రిందే వున్నాడు. గబగబా బూట్ డోర్ మూసేసి, వాన్ యొక్క స్టార్టు చేసి ముందుకు దూసుకొనిపోయాడు.

అంత చీకట్లో యెవరు ఎటు పరిగెడుతున్నారో అర్థం కావడంలేదు. లైట్లు మరింత దగ్గరయ్యాయి మాకు.

నాగు నా చెయ్యి పట్టుకొని పరుగెడుతున్నాడు. అప్పుడు చూశాను, అతని చేతిలో ఎర్రటి లావాటి సూట్ కేస్! ఆశ్చర్యపోయాను!? దానిని నాగు తనతో తేవడం చూసి.

మా వెనుక గుండెలు అదిరే శబ్దాలు వినిపించసాగాయి. రివాల్వర్, రైఫిల్స్ పేలుతున్న శబ్దాలవి. వెంటవెంటనే యేవో మూలుగులు అరుపులు హృదయ విదారంగా వినిపిస్తున్నాయి.

నా కాళ్ళు వణకడంచేత నడక వేగం తగ్గిపోతూంది. నన్ను పట్టుకొన్న నాగు ఉక్కుహస్తం నన్ను కొంత భయంనుండి సేదదీరుస్తుంది.

బుల్లెట్లు రెండు మా ఇద్దరిమధ్యనుండి దూసుకొని పోయాయి.

మా వేగం పెరిగింది.

చేతిలో బరువయిన సూట్ కేస్ వుండికూడా నాగు నాకంటే వేగంగా పరిగెడుతున్నాడు.

సముద్రం ఒడ్డునుండి పరిగెట్టుకొంటూ . చాలా దూరం వచ్చేశాము. ప్రస్తుతం రివాల్వర్ శబ్దాలు వినిపించడం లేదు.

క్రమంగా ఆగిపోతాడు నాగు. నేనూ ఆగాను. చీకట్లో చూడలేక పోయినా సముద్రానికి చాలా దగ్గర లోనే వున్నామని గ్రహించాను హోరునుబట్టి.

నాగు అక్కడ యెందుకు ఆగాడో అర్థంకావడం లేదు. వెనక్కి తిరిగి, చీకటిలోనికి కళ్ళు చికిలించి చూడ పోగాను, భయంగా. పోలీస్ జీప్ వెంబడిస్తుందేమోనని నా అనుమానం. వాతావరణం ప్రశాంతంగా వుందక్కడ.

ఎడంవైపు చూశాను.

దూరంగా చీకట్లో యెవరో యిద్దరు పరిగెట్టుకొంటూ మావైపు వస్తున్నారు—

వాళ్ళ దగ్గరనుండి వస్తున్న టార్చిలైట్ కాంతి మా మొహాలపై పడుతుంది.

నాగువైపు చూశాను.

నాగు తాపీగా చేయి ఊపుతున్నాడు వాళ్ళకు. అప్పుడర్థమయింది నాకు వాళ్ళు ఖాశిం, దీపక్ లని. ఇంతక్రితమే ఖాశిం చేతిలో ఆ టార్చిలైట్ చూశాను.

వాళ్ళు మమ్మల్ని సమీపించారు.

"ఇక పోదామా!" అన్నాడు ఖాశిం వగరుసూ.

"ఓ.కే" అన్నాడు నాగు. చాలా సంతోషంగా వున్నాడు నాగు. వాళ్ళు ముగ్గురూ యేదో ప్లాన్ మీద వున్నారనిపించింది.

ఖాశిం, దీపక్ ఇద్దరూ ప్రత్యేకంగా చూశారు నావైపు.

చీకటిలో వాళ్ళ మొహాలలోని భావాలు కనిపించక పోయినా, వాళ్లు నన్నెంత అనుమానంగా చూస్తున్నారో ఊహించుకోగలను నేను.

నాగువయిపు చూశాను వెంటనే!

"అనుమానించాల్సిందేం లేదు. పూర్తిగా మన మనిషి" చెప్పాడు నాగు ఖచ్చితంగా.

నాగు చెప్పడంతో రిలీఫ్‌గా నిట్టూర్చారు ఖాశిం,

దీపక్ లు.

మళ్ళీ పరిగెట్టసాగాము. వాళ్ళ ముగ్గుర్ని ఫాలో అవుతున్నాను నేను. టైమ్ చూసుకొన్నాను, ఎలక్ట్రానిక్ వాచ్ స్విచ్ నొక్కి. పన్నెండు నలభై అయిదు అయింది.

నగరంలోనికి వచ్చేశాము ఇంచుమించు.

చిన్న, చిన్న సందులలో సాగుతుంది మా ప్రయాణం. నగర శివార్లలో వున్న వీధులవి.

చివరికి ఓచోట ఆగారు. బాగా ఇరుకు సందు అది. లోపలికి నడవసాగారు. ముగ్గురి వెనుక నడుస్తున్నాను, ముక్కు మూసుకొని. అసహ్యంతో ఒళ్ళు జలదరించింది నాకు. బారచేసి వెడల్పున్న గదులు వున్నాయి అటూ ఇటూ. అవే అక్కడ జనానికి ఇళ్ళు. ఇళ్ళముందు మురికి గుంటలు, రొచ్చు, భరించలేని దుర్గంధం!! అది బాగా బీదవాళ్ళు వుంటున్న ప్రాంతం.

కుక్కలు పడుకొని వున్నాయక్కడ. మా సందడికి ఓ కుక్క లేచింది. అసలే కుక్కలంటే భయం నాకు. అది అరిచిందంటే మిగతావికూడా లేచి, పీక్కుతింటాయి మమ్మల్ని. అదృష్టవశాత్తు అదీ మళ్ళీ మౌనంగా పడుకొంది.

ముగ్గురు ఆగారు. చిన్న గది వుందక్కడ తాళంవేసి. దీపక్ తాళంతీసి తలుపులు తెరిచాడు.

త్వరగా లోపలికి పోయి తలుపులు వేసుకొని, దుర్గంధం బారినుండి తప్పించుకోవాలని ఉంది నాకు.

గదిలోపలికి వెళ్ళాక తలుపులు వేసేశారు. బయటికి తలుపు చిన్నదిగానే వున్నా విశాలంగా వుందా గది.

గదిలోనికి వెళ్ళాక యెక్కడలేని రిలీఫ్ వచ్చింది నాకు.

"నాగూ, బాస్ ఇక్కడ వుండమని చెప్పాడా మనల్ని?" అనుమానంగా నే అడిగాను.

ఖాశిం, దీపక్ లు వింతగా చూశారు నా వంక.

నాగు నవ్వి ఊరుకొన్నాడు.

నా ప్రశ్నకు సమాధానంగా తనతో తెచ్చిన ఎర్ర సూట్ కేస్ గది మధ్యలో వుంచాడు నాగు. జేబులో నుండి కీస్ తీసి, సూట్ కేస్ తెరవసాగాడు.

ఆత్రుతగా చూడసాగాను. సూట్ కేస్ తెరుచుకుంది. భరించలేని టెన్షన్ తో నా కళ్ళు వెడల్పయ్యాయి.

## 2

భయాశ్చర్యాలు మిన్నుముట్టాయి నన్ను తెరుచుకొన్న సూట్ కేస్ లోనికి చూడగా నే!?

మిలమిలా మెరిసే తెల్లటి మేలుజాతి వజ్రాలు నాలుగు వున్నాయి అందులో.

వాటి కాంతికే నా కళ్ళు చెదిరిపోతున్నాయి. ఖాశిం, దీపక్ కూడా ఆ వజ్రాలవంకే రెప్పవేయకుండా చూశారు.

వజ్రాలను సూట్ కేస్ లోనే వున్న, ఎర్రటి ముఖమల్ సంచుల్లో యథాతథంగా సర్ది లాక్ చేశాడు నాగు.

అసలే అయోమయంగా వున్న నాకు, వజ్రాలను చూడగానే వున్న మతిపోయింది.

మెల్లగా నవ్వి చెప్పాడు నాగు. "బాస్ ఉక్కు హస్తం నుండి తప్పించుకొన్నాం. ఇంకా చెప్పాలంటే బాస్ ను మోసం చేశాం!"

ఊపిరి అందలేదు నాకు, నాగు చెప్పిన ఆఖరిమాట విని. బాస్ ను మోసం చేయడమంటే త్రాచుపాముతో పరాచికాలు ఆడినట్టే. ఆ విషయం నాకంటే, నాగుకే బాగా తెలుసు. అయినా తెగించాడంటే ప్రాణాలమీద

ఆశ వదులుకొన్నాడన్న మాట. అందుకు కారణం వస్త్రాలమీద ఆశే కావచ్చు.

ఇరుకోణాల్లోనే గ్రహించగలిగాను నేను బాస్ మనస్తత్వం. అలాంటి బాస్‌ను ఇంత భారీ ఎత్తున మోసగిస్తే ఫలితం?!? ఊహించలేనంత దారుణంగా వుంటుంది.

నలుగురం పడుకొన్నాం.

నేనెంత ప్రమాదంలో ఇరుక్కొన్నానో తల్చుకొంటుంటే నా ఒళ్ళు గగుర్పొడుస్తుంది నాకు. నామీద విపరీతమైన కోపం వచ్చింది నాకు. ఎంత స్నేహం అయితే మాత్రం, ఇలాంటి వ్యవహారాలలో జీరోలాంటి నన్ను; ఒకేసారి ఇంత పెద్ద ప్రమాదంలోనికి దించితే ఫలిత ??? ఎటూ తప్పించుకోలేని నా నిస్సహాయతకు కళ్ళ నీళ్ళు తిరిగాయి. కళ్ళు మూసుకొన్నాను.

అనాధను నేను నిరుద్యోగినికూడా. చిన్న ఉద్యోగం దొరకడంతో పరమానందంతో ఈ సిటీ వచ్చాను. ఉద్యోగంలో జాయినయ్యాను. అయితే దురదృష్టవశాత్తు నాకు తెలియకుండానే నేను చేసిన చిన్న అజాగ్రత్త పనివల్ల, ఉద్యోగం కాస్తా ఊడింది.

పిచ్చివాడిలా రోడ్లమీద తిరుగుతున్న నన్ను బాస్ మనుషులు చూశారు. నాలాంటి వాళ్ళకోసమే వాళ్ళు వెతుకుతుంటారు.

బాస్ దగ్గరకు తీసుకు వెళ్ళారు. బాస్ నా పూర్వాపరాలన్నీ పరిశీలించి తృప్తిపడ్డాకే, నన్ను తన గ్యాంగ్‌లో చేర్చుకొన్నాడు. కడుపు నింపుకోవడం కోసం వాళ్ళకు తలవంచక తప్పలేదు నాకు.

'మనం సభ్య సమాజంలో యెంతో ఆనందంగా స్వేచ్ఛగా తిరుగుతుంటాం. కానీ సభ్య సమాజం వెనుకే

యున్నో విద్రోహ శక్తులు, మతాలు, స్మగ్లింగ్ గ్యాంగ్ లు వున్నాయని; నాణేనికి బొమ్మా, బొరుసు లాగే. సమాజం, నకిలీ సమాజం అనే రెండు ప్రక్కలు వున్నాయని, నిజ జీవితంలో మనం వేసే ప్రతీ అడుగూ నకిలీ సమాజం అంచుల మీదనని' అర్థమయింది నాకు, బాస్ గ్యాంగ్‌లో చేరాక.

బాస్ రాష్ట్రస్థాయి స్మగ్లర్. దేశ దేశాల సరుకునూ అత్యంత సమర్థవంతంగా స్మగుల్ చేస్తూంటాడు. బాస్ మనుషులు ప్రతీ సిటీలో, ప్రతిచోటా అనుక్షణం అప్ర మత్తతగా వుంటారు. అందుకే బాస్ యే పనయినా పెకనలమీద అమలు జరపగలడు.

ఒక్క మాటలో చెప్పాలంటే బాస్ సర్వాంత ర్యామి.

బాస్ గ్యాంగ్‌లో నేనున్నది ఐదురోజులు. బాస్ దగ్గర చేరగానే నాకు బాగా పరిచయం అయ్యింది నాగు. నాగు బాస్ కుడి భుజంలాంటివాడు. బాస్ నోటినుండి వెలువడే చాలా మాటలు, నాగు చేతులమీదనే కార్య రూపం దాలుస్తుంటాయి.

నాగుతో నా పరిచయం గాఢమైన స్నేహంగా మారింది. నాగు యెక్కడికి వెళ్ళినా నన్ను వెంట తిప్పు కోవడమే అందుకు కారణం కావచ్చు.

నాగు డైమండ్స్ చూపించాక—వ్యవహారం పూర్తిగా అర్థమయింది నాకు. స్పెయిన్ పోర్టునుండి వస్తున్న, బంగారపు బిస్కెట్లు వున్న ఎనభై రెండు పెట్టెలకు; మూల్యం ఇచ్చేది నాలుగు వైట్ డైమండ్స్. బహుశా ఒక్కొక్క డైమండ్ విలువ కోట్లమీద వుండవచ్చు.

మగతగా మెలకువ వస్తూంది నాకు.

బయటనుండి వచ్చే సందడికి అనుకొంటా సన్నగా తలనొప్పి రాసాగింది. ఆ సందు రాత్రి యెంత ప్రశాంతంగా వుందో ప్రస్తుతం అంత గందరగోళంగా వుంది. చంటిపిల్లల యేడుపులు, అమ్మకొనేవాళ్ళ కేకలు, ఆడవాళ్ళ జగడాలు....ఇక పడుకో లేకపోయాను.

మెల్లగా కళ్ళు విప్పి చుట్టూ పరికించాను.

ముగ్గురూ నిద్రలో వున్నారు. నాగు సూట్ కేస్ తల క్రింద పెట్టుకొని పడుకున్నాడు.

టైమ్ చూశాను. ఎనిమిదిన్నర అయింది. అలాగే వుండిపోయాను లేవకుండా. ఆలోచనలు నన్ను చుట్టుముట్టుతున్నాయి.

కాసేపటికి నెమ్మదిగా లేచి నాగును తట్టాను. కళ్ళు తెరిచి నన్ను చూశాడు మందహాసం చేస్తూ. ఖాశిం, [illegible]పక్ లుకూడా లేచారు కాసేపటికి. నలుగురం కాలకృత్యాలు తీర్చుకొన్నాం. అంతా హుషారుగా వున్నారు, నేను తప్ప.

"ఇక్కడ యెన్నాళ్ళుండాలి మనం?" అడిగాను విసుగ్గా.

"పాస్ పోర్టులు దొరికేవరకూ" చెప్పాడు నాగు.

"పాస్ పోర్టులా? ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాను.

"టూరిస్టుల ఫ్లయిట్ లో శ్రీలంక వెళ్ళిపోతున్నాం, అందుకు."

అదిరిపడ్డాను. "శ్రీలంకా?"

"ఇక్కడుంటే బాస్ మనల్ని నంజుకుని తింటాడు."

బాస్ ప్రసక్తి రాగానే నా ప్రశ్నలు ఆగిపోయాయి.

నాగుయే చెప్పాడు మళ్ళీ. "ప్రస్తుతం మనల్ని వెంటాడేది బాస్ ఒక్కడే కాదు, పోలీసులు కూడా. అటు బాస్ బారినుండి, ఇటు పోలీసుల బారినుండి శాశ్వతంగా తప్పించుకుని పోవాలంటే శ్రీలంక పారి పోవడం తప్ప, వేరే గత్యంతరం లేదు మనకు."

"రాత్రి పోలీసులు మనల్ని పరిశీలనగా చూడలేదను కుంటా!" అన్నాను.

"పూర్తిగా చూడకపోవచ్చు. కానీ పోలీసులు తమ ప్రయత్నాలు మానుకోరు" చెప్పాడు నాగు.

ఇక వాదన అనవసరం అనిపించింది. మౌనంగా వుండిపోయాను.

పాస్‌పోర్టులు సంపాదించడంలాంటి వ్యవహారాలలో ఖాశిం అఖండుడు. అందుకే ఖాశింను ఆ పనిమీద పంపాడు నాగు.

ఖాశిం వెళ్ళిపోయాక ముగ్గురం గది తాళంవేసి బయటికి వచ్చాం టీ తాగుదామని సూట్‌కేస్ నాగు దగ్గరే వుంది. సందులో నడుస్తూంటే కొంతమంది మా వంక చిత్రంగా చూశారు. అతికష్టంమీద ఆ జనాల్ని తప్పించుకుని సందు చివరికి చేరుకున్నాం.

అక్కడ చిన్న టీ స్టాల్ ఒకటుంది అసహ్యానికి మారు పేరులా వుందది. ముగ్గురం ఓ మూల కూర్చున్నాం. అక్కడి వాళ్ళు మావంక కంటే, నాగు చేతిలో సూట్‌కేస్ వంక చిత్రంగా చూస్తున్నారని గ్రహించాం.

అక్కడనుండి త్వరగా బయటపడడం మంచిదనిపించింది. తలో బన్ను తిని, రెండుసార్లు టీ తాగాం! టీ బాగానే వుంది.

తిరిగి మా రూమ్‌కి బయలుదేరాం.

అక్కడ గది యెవరు సంపాదించారో ఎలా సంపాదించారో అర్థంకాలేదు. మొదటినుండీ అదే ఆసక్తిగా వుంది నాకు.

నాగును అడిగాను.

పెద్దగా నవ్వి, చెప్పాడు నాగు. "ఇలాంటి ప్రదేశాలలో గదులు సంపాదించడం జేబులు కొట్టేవాళ్ళకు, చిల్లర దొంగతనాలు చేసేవాళ్ళకు చాలా సులభం. అసలు వాళ్ళకోసమే ఇక్కడ కొన్ని గదులు ప్రత్యేకంగా వుంటాయి తక్కువ అద్దెకు. ఎవడో దాదా ఒకడు ఇలాంటి గదుల్ని తన ఆధీనంలో వుంచుకుని, అద్దెకిస్తుంటాడు. ఇలాంటివి తెలిసి వుండటంవల్ల, ఖాశిం ఈ గదిని రెండు రోజులకు అద్దెకు తీసుకున్నాడు."

నాగు, దీపక్ నవ్వుతూ, తుళ్ళుతూ చాలా హుషారుగా వుండటం గమనించాను. నేను మాత్రం అలా వుండలేకపోతున్నాను. నా మనసేదో కీడును శంకిస్తున్నది.

మా రూమ్ వచ్చింది. దీపక్ తాళంతీసి తలుపులు తెరిచాడు.

అంతే?!?

కట్టెల్లా బిగిసిపోయాం ముగ్గురం—

గది మధ్యలో చిన్న టేప్ రికార్డర్ వుంది.

రెండు క్షణాలవరకూ యెవరికీ యేమీ అర్థంకాలేదు.

ముగ్గురి చూపు ఒకేసారి పడింది, తలుపు యెదురుగా వున్న గోడమీద.

ఓ మనిషి పట్టేటంత కన్నం చేయబడి వుంది గోడ మధ్యలో.

ముగ్గురికి క్రమంగా అవగాహన అవుతుంది. నిజానికది

గోడ కాదు. ఒక పెద్ద గదిని మధ్యన భాగిస్తూ ఉంచిన చెక్క. పెయింట్ వేసి ఉండటంవల్ల గోడనుకున్నాం. పలకలా కోయబడిన చెక్కకూడా అక్కడే క్రింద వుంది.

నాగు మొహంలోనికి చూశాను. పాలిపోయి ఉంది.

దీపక్ నిలువెల్లా వణికిపోతున్నాడు. వళ్ళంతా చెమట పడుతూంది.

నాకు చెప్పుకోదగ్గ భయం వేయలేదు. ఎందుకంటే నేను ముందునుంచీ భయపడుతున్నవాడినే! బాస్‌నుండి తప్పించుకోవడం అసాధ్యం అన్న నిర్ణయానికి వచ్చిన వాడిని నేను.

నిశ్శబ్దంగా కదిలాడు నాగు. కన్నంగుండా అవతల గదిలోనికి చూశాడు. "గదిలో యెవరూ లేరు. తలుపులు కూడా వేసేసి ఉన్నాయి" అన్నాడు మా వైపు చూసి. అతని స్వరం హీనంగా వుంది.

దీపక్ తేరుకుని, మా గది తలుపులు వేసేసి టేప్ రికార్డర్ ఆన్ చేశాడు. సుమారు వారంరోజుల తర్వాత మళ్ళీ విన్నాను బాస్ కంఠస్వరం. ముందు నవ్వు వినిపించింది. వణుకు వచ్చింది మాగ్గురికీ ఆ నవ్వు వినగానే. అదిరే గుండెలతో వింటున్నాము బాస్ మాటలు.

"నాగూ, దీపక్, ఖాశిం, చక్రధర్ మీ నలుగురినీ చాలా తక్కువగా అంచనా వేశానయ్యా నేను. కానీ నేనే పొరపాటుపడ్డాను. మీరు చాలా తెలివయినవాళ్ళు. పోలీస్ దాడి జరగగానే; స్మైయిన్ పార్టీకి అందజేయమని నేనిచ్చిన నాలుగు వజ్రాలు జాగ్రత్తగా మళ్ళీ నాకు అప్పగించేస్తారేమో ననుకున్నాను....

"కాని, మీరంత అమాయకులు లోకజ్ఞానం లేని

వాళ్ళు కాదని నిరూపించుకున్నారు. కోట్ల విలువ చేసే వజ్రాలు చేజిక్కించుకున్నారు. జాక్ పాట్ కొట్టేశారయ్యా మీరు, లక్కీగా .... సరే మీ తెలివి తేటలు యెలాంటివో మీరు ప్రదర్శించారు. అది మీ తప్పు కాదు. కానీ ఇప్పుడు నా తెలివి తేటలు కూడా యెలాంటివో ప్రదర్శించకపోతే అది నా తప్పు అవుతుంది...

"అందుకే ఆ తప్పు నేను చేయను. నా సామర్థ్యం యెలాంటిదో రుచి చూపిస్తాను. అందుకు ఉదాహరణే ప్రస్తుతం మీ గదిలో నా మాటల్ని మీకు వినిపిస్తున్న ఈ టేప్ రికార్డర్ ....

"ఇకపోతే — నేను తప్పక చెప్పవలసినదీ మీరు శ్రద్ధగా వినవలసినది ఒక్కటే మిగిలింది. ఈ రోజు పదమూడవ తారీఖు. ఇప్పుడు టైమ్ యెంతయిందో చూడండి, సరిగ్గా పదహారో తారీఖున ఇదే టైమ్‌కి మీ నలుగురూ నాలుగు శవాలుగా మారతారు. ఇది తథ్యం. జరగబోయే నగ్నసత్యం...." అతి దృఢంగా వినిపిస్తుంది బాస్ కంఠం. "అంతవరకూ మిమ్మల్ని సరదాగా వెంటాడుతూ ఉంటాను. గుడ్ బై!" అన్న చివరి మాటతో టేప్ రికార్డర్‌లో బాస్ స్వరం ఆగిపోయింది.

ఊపిరి పీల్చడం కూడా మాని విన్నాం, పిడుగుల్లా వర్షించిన బాస్ మాటలు.

చాలా సేపటివరకూ యెవ్వరూ యేం మాట్లాడుకోలేదు. నోరు విప్పాలంటేనే భయంగా వుంది ముగ్గురికీ. మృత్యువు మా పక్కలోనే పొంచి ఉన్న భావన మమ్మల్ని వేధిస్తుంది.

ముందు తేరుకొన్నది నేనే. "ఏం చేద్దాం?" అన్నాను. స్మగ్లింగ్ ముఠాలో చేరడమే పెద్ద రొంపి

అంటే, నాగు మళ్ళీ ఈ రొంపిలో దించాడు నన్ను.

"తిరిగి వెళ్ళి బాస్‌కి లొంగిపోవడమే!" ఖచ్చితంగా చెప్పాడు దీపక్. అతడి స్వరం విని గ్రహించవచ్చు— అతడెంత భయపడుతున్నాడో.

అంత దిగ్బంధ పరిస్థితిలోనూ నవ్వాడు నాగు, దీపక్ చెప్పింది విని, "లొంగినా, లొంగకపోయినా మనల్ని చంపాలన్నదే బాస్ నిర్ణయం. బాస్ తన నిర్ణయాన్ని ఎట్టి పరిస్థితులలోనూ మార్చుకోడు."

మళ్ళీ అన్నాడు నాగు. "బాస్ నుండి తప్పించుకొని పోగల సామర్థ్యం, చాతుర్యం ప్రదర్శించడమే ప్రస్తుత పరిస్థితిలో మనం చేయగలిగింది."

దీపక్ నావైపు చూశాడు. "నా అభిప్రాయం కూడా అదే" అన్నాను.

"అన్నింటికంటే ముఖ్యం మనం ఈ గదిలో నుండి బయటపడడం" అప్పటివరకూ నొక్కిపట్టిన టెన్షన్ అంతా మాటల్లో వ్యక్తపరుస్తూ చెప్పాడు నాగు ఖంగారుగా.

"మరి ఖాశిం?" టక్కున అడిగాడు దీపక్.

"ఖాశిం వచ్చేవరకూ ఆగాలంటే మన ప్రాణాలకు ఇప్పుడున్న ఈ కాస్త గ్యారంటీ కూడా లేకుండా పోతుంది. బాస్ చెప్పిన మాటలు మర్చిపోయావా? పదహారవ తారీఖున యిచ్చే టైమ్‌లోపల మనల్ని హతమారుస్తానన్నాడు. తను చెప్పిన గడువు దాటితే ఏం చేయదలుచుకొన్నాడో మాత్రం చెప్పలేదు బాస్...."

"అయితే?...." మధ్యలో అడిగాడు దీపక్ చిరాగ్గా.

"గడువు దాటితే మనల్ని వదలిపెట్టడమే బాస్

ఉద్దేశం కావచ్చు అందుకే ప్రతి పెకనూ మనం జాగ్రత్తగా వుడడం శ్రేయస్కరమని నా ఉద్దేశ్యం—" చెప్పడం పూర్తిచేశాడు నాగు.

"అయితే యేమంటావు?" అడిగాడు దీపక్ అర్థం కాక.

"ఖాశిం గురించి ఎదురుచూసి ప్రాణాలు పోగొట్టుకోవడం కంటే మన ముగ్గురం ఇక్కడ నుండి వెళ్ళిపోవడం మంచిదంటాను" చెప్పాడు నాగు.

నాగు చెప్పింది దీపక్‌కు యేమాత్రం నచ్చలేదు. "బాస్ మనల్ని ఒకేసారి చంపాలనుకొంటే ఈ క్షణాన్నే చంపేవాడు. మనల్ని వెంటాడి చంపాలన్నదే బాస్ కోరిక. మనం భయంగాఖరుపడి ఖాశింను కంటకరివాడివి చేయడం దారుణం. మనల్ని వెంటాడుతూ మాత్రమే చంపుతానన్న బాస్ ఆఖరి మాట గుర్తుందా?" అన్నాడు దీపక్.

నాగు ముఖం ఎర్రగా మారింది.

దీపక్ ఎదిరింపుచర్య నాగుకి కోపం కలిగించింది. ఏది ఏమయినా, తక్షణం ఈ ప్రదేశాన్ని వదలిపెట్టాలన్నదే నాగు కోరిక అని గ్రహించాను.

"సరే, ఓ పని చేద్దాం. మనం ఎక్కడికి వెళుతున్నామో ఓ కాగితంమీద వ్రాసి, తలుపుకు అంటిస్తే సరిపోదా?" చిరాగ్గా అన్నాడు నాగు.

అంత దుస్థితిలోనూ నవ్వొచ్చింది నాకు, నాగు చెప్పింది విని. "అలా చేస్తే బాస్‌కి మన అచూకీ మనమే చెప్పినవాళ్ళమవుతాం" అన్నాను.

ఖంగుతిన్నాడు నాగు.

రెండుక్షణాలు ముగ్గురం మౌనంగా ఉండిపోయాం.

"నేను ఖాశిం వచ్చేవరకూ ఇక్కడే ఉంటాను" అన్నాడు దీపక్ చివరికి.

నాగు రిలీఫ్‌గా నిట్టూర్చాడు దీపక్ నిర్ణయం విని.

అప్పుడు గుర్తొచ్చింది నాకు "ఇంతకీ యెక్కడికి వెళతాం?" ఆసక్తిగా అడిగాను.

"సికింద్రాబాద్. అక్కడ నా స్నేహితుడి లాడ్జి ఒకటి ఉంది. అక్కడికి వెళదాం" చెప్పాడు నాగు.

దీపక్‌కి ఎడ్రస్ రాసి ఇచ్చాడు నాగు.

నేనూ, నాగు బయటికి కదిలాం.

"నాగూ!" పిలిచాడు దీపక్.

"మళ్ళీ ఏమిటి?" విసుక్కున్నాడు నాగు.

"అసలు విషయం మర్చిపోతున్నావు."

"ఏమిటది?"

"మా వాటా రెండు డైమండ్స్ ఇచ్చి వెళ్ళిపో" ఖచ్చితంగా చెప్పాడు దీపక్.

నాగు ముఖంలో ఎక్కడలేని కోపం కనిపించింది నాకు. అతి కష్టంమీద కంట్రోల్ చేసుకొన్నాడు.

సూట్‌కేస్ తెర్చి ముఖమల్ సంచిలో ఉన్న ఒక వజ్రాన్ని సంచితో పాటు అందించాడు దీపక్‌కు.

"రెండోది కూడా నీ చేతికిస్తే. అది ఖాశింకు అందచేస్తావన్న నమ్మకం యేమిటి?" అడిగాడు కసిగా.

"అంత మోసం చేసేవాడినయితే ప్రాణాలకు తెగించి ఇలా ఖాశిం కోసం ఎదురుచూడను మిస్టర్ నాగు" గట్టిగా చెప్పాడు దీపక్.

నాగు మాట్లాడకుండా రెండో వజ్రం కూడా తీసి దీపక్‌కు అందించాడు.

నాగు, దీపక్‌లకు మనసులో ఒకరిమీద ఒకరికి

కోపంగా ఉన్నట్టు గ్రహించాను.

తర్వాత యిద్దరం ఇంటికి నడిచాం. 'దీపక్ కు, ఖాసిం ఎంత స్నేహితుడయినా అతనికోసం ఎదురుచూసి, కోరి ప్రమాదం తెచ్చుకొంటున్నారేమో' అన్పించింది, నాకు వెళ్ళిపోతుండగా.

అప్పుడు టైమ్ చూశాను. పదిన్నర దాటింది.

## 4

ట్రైన్ లో వెళుతున్నామన్న మాటేగాని ప్రాణాలు అరచేతిలో పెట్టుకొన్నాం యిద్దరం. ఏ క్షణాన ఏం జరుగుతుందో తెలియని పరిస్థితి.

"నాగూ, మీ ప్లాన్ గురించి నాతో ముందుగానే చెప్పవలసింది" అన్నాను నాగువంక చూస్తూ.

"సారీ ఫ్రెండ్! నేనొక్కణ్ణే ఊహించాను. వజ్రం దక్కుతుంది అనగానే ఎగిరి గంతేస్తావనుకొన్నాను. ఈ రిస్క్ లో నువ్వు మరీ యింత వర్రీ అవుతావని తెలిస్తే నిన్నిందులోనికి లాగేవాడినే కాదు—" చెప్పాడు నాగు.

"వజ్రం దక్కుతుంది సరే! ఈలోపల ప్రాణాలు దక్కేలా లేవు వజ్రం ముఖ్యమా? ప్రాణాలు ముఖ్యమా?" విసుగ్గా అడిగాను.

నాగు మౌనంగా ఉండిపోయాడు.

"అసలు ఈ ప్లాన్ కి సంబంధించిన ఆలోచన ఎలా వచ్చింది మీకు? బాస్ ముందుగానే ఈ విషయం గుర్తించలేకపోయాడా?" ఆసక్తిగా అడిగాను, నాగు మౌనం వహించడం గమనించి.

నా ఆసక్తి చూసి నాగు సన్నగా నవ్వాడు. "బాస్

దగ్గర నేను వినయంగా ఉండడం నువ్వు గమనించే ఉంటావు. కానీ అది కేవలం నటన. బాస్ నిరంకుశత్వానికి, ఎలాంటి విశ్వాసపాత్రులకయినా ఈ వృత్తిమీద విరక్తి పుడుతుంది. గత ఐదారు నెలల నుండి బాస్ నిరంకుశత్వం పెరుగుతోందే గానీ తరగడం లేదు....

"అందుకే బాస్ బారినుండి తప్పించుకోవాలని నిర్ణయించుకొన్నాను. బాస్ నియంతృత్వం నచ్చక అప్పటికే తిరుగుబాటు చేయాలనుకొన్న ఖాశిం, దీపక్ లను నేను గుర్తించాను. దీపక్ అప్పటివరకూ నాతోనే తిరిగేవాడు. కాని దీపక్ లో తిరుగుబాటు ధోరణి ఉన్నట్టు నేను గ్రహించలేకపోయాను

"ఒకసారి ఖాశిం, దీపక్ లు మనసు విప్పి నాతో మాట్లాడారు. అప్పుడే ఆ విషయం గుర్తించాను నేను. వెంటనే నా అభిప్రాయం కూడా చెప్పాను. నాతో చేయి కలపడానికి సంతోషంగా అంగీకరించారు ఇద్దరూ. బాస్ ఎంత గట్టివాడయినా మా గూడుపుఠాని గ్రహించలేకపోయాడు....

"ఇంతలో, మేం యెదురుచూసిన అవకాశం రానే వచ్చింది. స్పెయిన్ పార్టీ వాళ్ళకు గోల్డుకు బదులు డైమండ్స్ ఇవ్వాలి. సాధారణంగా ఇంత పెద్ద మొత్తాలతో వ్యవహారం ఉన్నప్పుడు బాస్ స్వయంగా వస్తాడు. కాని ఐదారేళ్ళ నుండి నేను నమ్మకంగా బాస్ కి కుడిభుజంగా ఉండడంవల్ల, ఎందుకో నన్ను గట్టిగా నమ్మాడు బాస్. ఆ అవకాశాన్ని మేం వినియోగించుకొన్నాం. నిన్ను తీసుకొనిరావడానికి మరో కారణం కూడా ఉంది...." చెప్పాడు నాగు.

"ఏమిటది?" ఆత్రంగా అడిగాడు.

"ఉన్న డైమండ్స్ నాలుగు. మేం ముగ్గురం. మాలో మాకు కలహాలు రాకుండా ఉండడానికి డైమండ్స్ సరి సమానంగా పంచుకోవడానికి, ఒక డైమండ్ నీకు ఇవ్వా లని నిర్ణయించాం."

"అసలు ఒక్కొక్క డైమండ్ ఎంత వుంటుంది?"

"సుమారు ఒక్కొక్కటి నాలుగున్నర కోట్లు ఉండ వచ్చు" చెప్పాడు నాగు మౌనంగా.

తల తిరిగినట్టయింది నాకు వజ్రం ఖరీదు వినగానే.

"సమయానికి పోలీసులు రాబట్టే కదా! ఇంత సొత్తు మన స్వాధీనమయింది" అన్నాను.

నవ్వాడు నాగు. "పోలీసులు రాలేదు. రప్పించాం. మనమే రప్పించాం—ఫోన్ చేసి."

తెల్లబోయాను—నాగు చెప్పింది విని.

సికిందరాబాద్‌లో దిగాము. టైమ్ చూశాను. రెండవు తోంది. టాక్సీలో కూర్చున్నాం. లాడ్జి పేరు చెప్పాడు నాగు. పది నిమిషాలలో లాడ్జిముందు ఆగింది టాక్సీ. టాక్సీవాడికి డబ్బులిచ్చి లోపలికి అడుగుపెట్టాం.

లోపలికి వెళుతూ పేరు చదివాను. 'లాడ్జి మహో దయా' అని ఉంది.

అదృష్టవశాత్తు రిసెప్షన్ దగ్గరే వున్నాడు నాగు స్నేహితుడు. నాగును చూడగానే నవ్వుతూ పలక రించాడు.

నాగు అతడిని పక్కకు తీసుకెళ్ళి కాసేపు యేదో మాట్లాడాడు.

తర్వాత యిద్దరం లిఫ్ట్‌లో నాలుగవ అంతస్తు చేరు కొన్నాం.

నడుస్తూ అడిగాను—"అతడి పేరేమిటి?"

"రంగరాజు" చెప్పాడు నాగు.

మళ్ళీ అన్నాడు నాగు నా అనుమానం గ్రహించి, "వజ్రాల విషయం తప్ప మిగతాది అంతా చెప్పాను."

"ఎలా నమ్మాడు?"

"ఎందుకు నమ్మడు, మనం చేసిన పెద్ద పొరపాటువల్ల బాస్‌కి చాలా నష్టం వచ్చిందని, మనల్ని చంపాలని నిర్ణయించుకొన్నాడని, తప్పించుకొని వచ్చేశామని చెప్పాను. మన బాస్ సంగతి రంగరాజుకి బాగా తెలుసు. అతనూ ఒకప్పుడు స్మగ్లరే! అందులో డబ్బు సంపాదించే ఈ లాడ్జి కట్టాడు."

ఆశ్చర్యపోయాను నాగు చెప్పింది విని. వెంటనే నాలో మరో అనుమానం ప్రవేశించింది. "అతడింకా అలాంటి పనులు చేస్తున్నాడా?" అడిగాను.

"చేస్తూనే వుండవచ్చు. ఈ మధ్యకాలంలో చాలా డబ్బు సంపాదించాడు. కేవలం లాడ్జిమీదే అంత డబ్బు సంపాదించాడంటే నమ్మలేం! అన్నట్టు మరో విషయం, మన మారువేషాలకు తగిన సహాయం కూడా చేస్తానన్నాడు" చెప్పాడు నాగు.

ఉలిక్కిపడ్డాను. "వేషాలు మార్చుకోవాలా?"

"తప్పదు. మనం ఈ లాడ్జికి రావడం బాస్‌కి సులభంగానే తెలిసిపోతుంది. మనకు రక్షణ యిచ్చేవి మారువేషాలే."

"అలాగయితే మనం యే గదిలో ఉన్నామో కూడా హోటల్ బోయిస్ ద్వారా బాస్ మనుష్యులు కనుక్కొంటారేమో!" అన్నాను.

నవ్వాడు నాగు. "నీకో విషయం తెలియాలి. ఇంత పెద్ద లాడ్జిలో పనిచేసేవాళ్ళంతా ఇంచుమించు మన

లాంటివాళ్ళు, స్మగ్లర్‌లు, సీక్రెట్ ఏజెంట్‌లు ఎంతో మంది నిత్యం ఈ లాడ్జికి వస్తూంటారు. అందుకే ఇక్కడ ఎవరెవరు బసచేశారు; అన్న విషయం చాలా గుప్తంగా వుంచబడుతుంది. చీప్ క్వాలిటీ లాడ్జీలలో లాగ సర్వర్‌లు, బోయ్‌లు లంచాలకు ఆశపడి లాడ్జికి సంబంధించిన వివరాలు చెప్పడం జరగదు" అన్నాడు నాగు నా అనుమానాలన్నింటికీ సమాధానంగా.

మా రూమ్‌ల దగ్గరకు వచ్చి ఆగాం. రెండూ పక్క పక్క గదులే! తన రూం తాళంతీసి లోపలికి వెళ్ళబోతూ చెప్పాడు నాగు. "కాసేపటి తర్వాత రూమ్‌బోయ్ నీ గదికి భోజనం, ఒక సూట్‌కేసు తీసుకొని వస్తాడు. అందులో బట్టలు మేకప్ సామాను వుంటుంది జాగ్రత్తగా మేకప్ చేసుకో."

నాగు చెప్పింది విని, అన్యమనస్కంగా నా గది తాళం తీసి లోపలికి అడుగు పెట్టాను.

## 5

గదిలోనికి అడుగు పెట్టాక నా ఉదాసీనత ఎగిరి పోయింది. చాలా ఖరీదైన గది అది. ప్రతి అణువులోనూ నాగరికత ఉట్టిపడుతోంది.

ఆ గది అద్దె రోజుకు కనీసం రెండువందలయినా ఉంటుందనిపించింది.

శుభ్రంగా స్నానం చేసి, రిలాక్స్‌డ్‌గా పరుపుపై వాలాను. ఆకలి దంచేస్తోంది.

శ్రావ్యమైన సంగీతం వినిపించింది గదిలో.

ముందు అర్థంకాలేదు నాకు. తర్వాత మెల్లగా అర్థమయింది.

"కమిన్!" అన్నాను స్టైయిల్‌గా.

తలుపు తీసి ట్రాలీలో భోజనం తోసుకొంటూ వచ్చాడు రూమ్‌బోయ్. చేతిలో సూట్ కేసు టీపాయ్ మీద పెట్టి నమ్రతగా నిలబడ్డాడు.

"యు కెన్ గో" అన్నాను మళ్ళీ స్టైయిల్‌గా.

ఓ ప్రక్క భయంగా వున్నా, మంచి భోజనం, తగినంత విశ్రాంతి దొరకడంతో ఎక్కడలేని హుషారు పుట్టుకొచ్చింది నాకు.

భోజనం అయిన తర్వాత కాసేపు పడుకొన్నాను.

నిద్ర లేచేసరికి ఆరున్నర దాటింది.

అద్దం ముందు కూర్చుని బోయ్ తీసుకొచ్చిన సూట్ కేసు తెర్చాను. రెండు జతల బట్టలున్నాయి లోపల. వాటిపైన తెల్లటి పోలిథిన్ కవర్ వుంది. సంచి లోపల యేవో గడ్డాలు, మీసాలు కన్పిస్తున్నాయి అస్పష్టంగా. అది సిక్కు వేషమని గ్రహించాను, కవర్ మీద అంటించి వున్న వాక్యాలు చదివి.

జిప్ లాగి కవరు తెరిచాను. లోపల ఇన్‌స్ట్రక్షన్ కార్డ్ చదివాను. ఆ మేకప్ ఎలా చేసుకోవాలో అంతా వివరంగా వుంది అందులో.

మేకప్ చేసుకొన్నాను. ఎప్పుడూ ఇలాంటి పరిస్థితిని ఎదుర్కొనవలసిన అవసరం లేకపోవడంతో, వింతగా అన్పిస్తోంది నాకు మేకప్ చేసుకొంటుంటే!

మేకప్ పూర్తయ్యేసరికి అద్దంలో కన్పిస్తున్న నా ముఖాన్ని ఒక్క నిమిషం కళ్ళప్పగించి ఆశ్చర్యంగా చూస్తూండిపోయాను.

అది నా ముఖం కాదు. ఎవరో సిక్కు వ్యక్తి ముఖం!??

తర్వాత సూట్ కేసులో ఉన్న బట్టలు కూడా తీసి తొడుక్కొన్నాను. గోధుమరంగు సూట్ అది. అద్దంలో

కనిపిస్తున్న నా ముఖానికి అతికినట్టు సరిపోయింది ఆ సూట్.

సరిగ్గా అప్పుడే వినిపించింది బయటి నుంచి పెద్ద శబ్దం.

రెండు వాహనాలు గుద్దుకొన్న శబ్దం అది. దానికి తోడు యెవరివో కేకలు, అరుపులు, జనాల గోల సన్నగా వినిపించాయి, గదిలో ఏసీ ఆఫ్‌లో ఉండడం వల్ల కాబోలు!

ఏదో యాక్సిడెంట్!? ఎవరో పోయుంటారు.

నా మనసంతా చేదు తిన్నట్టయ్యింది. యాక్సిడెంట్‌కి గురయిన మనుషుల్ని దగ్గర్నుండి చూసే ధైర్యం లేదు నాకు. అందుకే క్రిందకు వెళ్ళే ప్రసక్తి మానుకొని, అలాగే కూర్చున్నాను.

శ్రావ్యమైన సంగీతం వినిపించింది మళ్ళీ. బోయ్ వచ్చే టైమ్ కాదిది. ఎవరో వచ్చుంటారు. నాగు అయినా కావచ్చు.

తలుపు ఓరగా తీసి చూశాను. బయట యెవరో ఆంగ్లేయుడు నిలబడి వున్నాడు ఫుల్ సూట్‌లో. కాస్త నల్లగా వున్నాడు. ఇండో ఆంగ్లేయుడు కావచ్చు.

తలుపు పూర్తిగా తీశాను. "ఏం కావాలి?" అడిగాను విసుగ్గా.

అతను నా వంక ఆశ్చర్యంగా చూసి "చక్రధర్! నేనూ. నాగును" అన్నాడు.

తెల్లబోయాను.

"తలుపు లాక్ చేయి. క్రిందకు వెళ్ళాలి" కంగారుగా చెప్పాడు నాగు.

తప్పేదిలేక తలుపు లాక్ చేసి, నాగూతోపాటు

క్రిందికి వచ్చాను. నాతో పాటు చాలామంది కష్టమర్స్ తలుపులు తోసుకొని, హడావిడిగా క్రిందకు పరిగెట్టడం చూశాను.

నాగు అస్వస్థంగా వుండడం గమనించాను. కేవలం యాక్సిడెంట్ కు అంతగా యెందుకు ఆదుర్దాపడుతున్నాడో అర్థం కాలేదు నాకు.

లాడ్జి ఎదురుగానే జరిగింది యాక్సిడెంట్.

చాలామంది జనం గుమిగూడి వున్నారక్కడ. నాగు జనంలోనికి వెళ్ళాడు. నేను ఆవరణలో నిలబడ్డాను. కష్టమర్స్, లాడ్జి స్టాఫ్ చాలామంది గోలగా మాట్లాడుకొంటూ చూస్తున్నారు.

ఎడంవయిపు నుండి వస్తూన్న వేన్ను, కుడివయిపు నుండి వస్తూన్న లారీ గుద్దుకొంది. రెండు వాహనాలు కొద్దిగా దెబ్బతిన్నాయి. ఇంతలో పోలీస్ జీపు వచ్చి ఆగింది.

రెండు వాహనాలకు మధ్య ప్రదేశాన్ని కప్పివేస్తూ వున్నారు జనం. పోలీసులు జనాన్ని చెదరగొడుతున్నారు. అప్పుడు చూశాను నేను; లారీకి వేన్ కు మధ్య టాక్సీ ఒకటి నుగ్గు నుగ్గయిపోయి వుంది. అంబులెన్స్ వచ్చింది ఇంతలో.

కాస్త ముందుకు వెళ్ళి టాక్సీలోనికి చూశాను. టాక్సీ డ్రైవర్ స్టీరింగ్ దగ్గరే వున్నాడు తల చితికిపోయి. వెనుక సీటులో ఓ వ్యక్తి మూలుగుతున్నాడు కళ్ళు మూసుకొని.

నా నరనాడులు స్తంభించిపోయాయి ఆ వ్యక్తిని చూడగానే!?

'బాస్ నరరూప రాక్షసుడు!' అనిపించింది యేదో

అర్థమయి.

మూలుగుతున్న ఆ వ్యక్తిని అంబులెన్స్‌లోనికి మారు స్తున్నారు జాగ్రత్తగా.

అతను?—

దీపక్!

దీపక్ ప్రక్కనే మరో భయంకర దృశ్యం నాకంట పడింది.

అది ఖాశిం శవం!? మామూలుగా లేదది, నుజ్జునుజ్జయి పోయి వుండచుట్టుకొని పోయిన మాంసం ముద్దలా వుంది.

వాంతి అయినట్టయింది నాకు. కళ్ళు తిరుగుతున్నాయి. తల్ళు తూలుతుంది. కళ్ళనీళ్ళు తిరుగుతుండగా నిస్సహా యంగా నిలబడి, కళ్లు మూసుకొన్నాను.

కళ్ళు తెరిచాను. ఎదురుగా నాగు నిలబడి వున్నాడు. అతని కళ్ళలో మృత్యు భయం.

మెల్లగా గొంతువిప్పి, నాకు మాత్రమే వినిపించేలా చెప్పాడు నాగు. "ఆ లారీ, వాన్ మన గ్యాంగ్ కు సంబం ధించినవే. సాధారణంగా రోడ్డు హత్యలకు వాటిని ఉపయోగిస్తూ టాడు బాస్" అంతకుమించి మాట్లాడలేక పోయాడు.

అస్పష్టంగా తలూపాను నేను—అర్థమయింది అన్న ట్లుగా.

"రైమండ్స్ పోలీసులు స్వాధీనం చేసుకొంటూరా?"

మాట్లాడలేదు నాగు. ఆలోచిస్తున్నాడు.

"దీపక్. బ్రతుకుంటాడంటావా?"

"బ్రతికే అవకాశం ఉందిలే!" అన్యమనస్కంగా అన్నాడు నాగు.

"మన పరిస్థితి అంతేనా!?" అలా అంటుంటే నా

కాళ్ళు సన్నగా వణకడం స్పష్టంగా తెలిసింది నాకు.

“మనశా గతి యెప్పటికీ పట్టదు” దృఢంగా చెప్పాను నాకు.

రూమ్‌లకు చేరుకొనేవరకూ ఏం మాట్లాడుకోలేదు.

“రేపు ఉదయాన్నే రంగరాజుతో మాట్లాడి శ్రీలంక పాస్‌పోర్టుల సంగతి చూస్తాను” అన్నాడు నాగు, తన గదిలోనికి వెళ్ళి తలుపు మూస్తూ.

రూమ్ లాక్ చేసి, వేషం విప్పేసి, తిరిగి నా దుస్తులు వేసుకొని మంచంమీద వాలిపోయాను.

ఇంతకు ముందులా ఆ గది నాకు హాయిగా, స్వేచ్ఛగా అనిపించడంలేదు.

అంతా నిశ్శబ్దంగా వుంది! నా గుండె నాకే భయం వేసేటట్టు చప్పుడు చేస్తుంది.

గదిలో అణువణువు నుండీ బాస్ కళ్ళు, నా ప్రతి కదలికను గమనిస్తున్న భ్రాంతి. కళ్ళు మూసినా తెరిచినా వికృతమైన దీపక్ శవమే ప్రత్యక్షమవుతుంది నా కళ్ళ ముందు.

అంతులేని పీడకలలతో యెప్పటికో నిద్రపట్టింది.

## 6

ఉదయం ఏడింటికి లేచాను. క్షేమంగా వున్నందుకు సంతోషించాను. టిఫిన్ కాఫీ తీసుకొన్న తర్వాత బోయ్ తీసుకొచ్చిన పేపర్ విప్పాను ఆత్రంగా.

మూడవ పేజీలో ఓ మూలపడింది ఆ వార్త.

ఆశ్చర్యపోయాను?! వజ్రాలు పోలీసులకు చిక్కలేదన్న మాట.

హత్యా! యాక్సిడెంటా? అని వుంది హెడ్డింగ్. మేటర్ చదివాను. పోలీసులు దాన్ని యాక్సిడెంట్ అని

గుడ్డిగా నమ్మకుండా, హత్య అన్న అనుమానాన్ని వెలి బుచ్చినందుకు సంతోషించాను.

వాన్ డ్రైవర్ లారీ డ్రైవర్ ఇద్దరూ పారిపోవడం, పైగా వాటి నెంబర్లు స్పష్టంగా లేకపోవడం, యాక్సిడెంట్ స్థలంలోనికి లారీ హఠాత్తుగా రాంగ్ రూట్‌లో రావడం పోలీసులకు అనుమానాన్ని కలిగించిందని వ్రాశారు.

దీపక్ హాస్పిటల్‌లో కోలుకుంటున్నాడని, ఎంత అడిగినా తన వివరాలు చెప్పడంలేదని, అతడిని అనుమానించాల్సింది యేమీ లేదని పోలీసులు నిర్ధారించారని, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ కేస్ దర్యాప్తు చేస్తున్నాడని వుంది చివరగా.

వజ్రాల విషయం మాత్రం అయోమయంగా వుంది నాకు. పోలీసుల స్వాధీనం అవుతాయనుకున్న కోట్ల విలువగల వజ్రాలు ఏమయ్యాయో?! ఎంత ఆలోచించినా అర్థం కావడంలేదు నాకు.

ఎవరో తలుపు తట్టారు. వెంటనే శ్రావ్యమైన సంగీతంకూడా వినిపించింది.

తలుపు తెరిచాను. నాగు నిలబడి వున్నాడు బయట. మారువేషంలోనే వున్నాడు. చేతిలో పేపర్ వుంది. "పేపర్ చదివావా?" అడిగాడు.

"చదివాను. ఆ వజ్రాలు..."

"ష్‌ష్‌ష్" అన్నాడు నాగు కళ్లు పెద్దవిచేసి.

అటూ ఇటూ చూశాను. వడివయిపు యెవరో ఇద్దరు వస్తున్నారు మాట్లాడుకొంటూ.

ఇద్దరం నా రూమ్‌లో కూర్చున్నాం.

నాగు చెప్పాడు "మారువేషం వేసుకోకుండా నువ్వు

యెప్పుడూ బయటికి రావద్దు. ఉన్న ఈ కాస్త రక్షణ కూడా పోతుంది_తెలివితక్కువగా ప్రవర్తిస్తే"

మౌనంగా ఊరుకొన్నాను. నాగు చెప్పింది నిజమే మరి!

"రాత్రి నేను అనుకున్నట్టే జరిగింది. వజ్రాలు వాళ్ళ దగ్గరనుండి ముందే చేజిక్కించుకున్నాడు బాస్. తర్వాతే వాళ్ళను చంపాలని వెంటాడాడు. ఆ వేటలో ఖాసిం ఒక్కడే చనిపోయాడు...." అంటూ ఆగాడు.

"ప్రస్తుతం, హాస్పిటల్ లో కోలుకుంటున్న దీపక్ ను కూడా చంపాలని ప్రయత్నిస్తాడంటావా?" అడిగాను.

"అలాంటి పొరపాటు పని బాస్ ఎప్పటికీ చేయడు" మౌనంగా చెప్పాడు నాగు.

తెల్లబోయాను అది విని "నువ్వు చెప్పేది నాకర్థం కాలేదు. బాస్ దీపక్ ను వదిలేస్తాడంటావా?"

"చచ్చినా వదలడు."

"మరి?"

"దీపక్ ను ఒక అస్త్రంలా మనమీద ప్రయోగిస్తాడు."

నాగు చెప్పింది పూర్తిగా కాకపోయినా, ఏదో అవగాహన అయి సన్నగా వణుకు వచ్చింది నాకు.

"అంటే?" అన్నాను.

"అర్థం కాలేదా! దీపక్ హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యాక, బాస్ దీపక్ ను మళ్ళీ చేరదీస్తాడు; మనల్ని చంపడానికి ప్రత్యేకంగా నియమిస్తాడు..."

నాగు చెబుతుంటే భయంతో బిగుసుకొనిపోయి చూస్తుండిపోయాను. బాస్ ఎప్పుడేం చేస్తాడో ఊహించడమే కష్టంగా వుంది. గొంతు పెగల్చుకొని అడిగాను. "మనల్ని చంపడానికి దీపక్ నే యెందుకు నియమించడం,

తన మనుషుల్ని పంపవచ్చుగా?"

"అందుకు సరైన కారణం వుంది. బాస్ ముఠాలో నేను ఐదేళ్ళు పనిచేశాను. దీపక్ ఆ ఐదేళ్ళు నాతో నే తిరిగాడు. నేనెక్కడున్నా, ఏ వేషంలో వున్నా నా రూపం ప్రతీ కోణంనుండి గుర్తుపట్టగలిగినవాడు దీపక్ ఒక్కడే! నా కంఠంకూడా దీపక్ గుర్తించగలడు" చెప్పాడు నాగు.

అర్థమయింది నాకు. "దీపక్ బాస్‌తో మళ్ళీ కలవడానికి ఒప్పుకుంటాడా? చివరికి యెలాగూ బాస్ తనను చంపుతాడని తెలిసికూడా?" అడిగాను.

"చచ్చినట్టు ఒప్పుకొంటాడు. అతని స్వభావం నీ కంతగా తెలీకపోవచ్చు. మహా పిరికివాడు. మనల్ని చంపకపోతే అతని ప్రాణం తీస్తానని బాస్ భయపెడతాడు. అది చాలు దీపక్‌కు. వజ్రం ఎలాగూ పోయింది. ఇక తాత్కాలికంగా తన ప్రాణాలు నిలుపుకోవడానికి మన ప్రాణాలు తీయడానికి వెనుకాడడు."

"అయితే ఇప్పుడేం చేయాలి?!" అడిగాను యేమీ పాలుపోక. ఇదంతా పెద్ద తలనొప్పి వ్యవహారంలా వుంది నాకు.

జేబులో చెయ్యి పెట్టాడు నాగు రివాల్వర్ బయటికి తీశాడు.

అయోమయంగా చూశాను.

"బాస్ నుండి కనీస రక్షణకన్నా ఉపయోగపడుతుందని తెచ్చాను దీన్ని. ఇందులో కేవలం ఒక్క బుల్లెట్ మాత్రమే దీపక్‌కోసం వేస్తు చేయాలి" కఠినంగా పలికింది నాగు కంఠం.

కరెంట్ షాక్ తిన్నట్టు అయ్యాను నాగు చెప్పింది

విని.

"హత్యా!?!" అన్నాను.

"అవును, చేయాలి. తప్పదు. మన వజ్రాలు, మన ప్రాణాలు కాపాడుకోవడానికి — పైగా దీపక్ వల్ల మనం చనిపోతే ఆ తర్వాత యెలాగూ అతని చావు బాస్ చేతిలో తప్పదు. అందుకే ముందుగా దీపక్‌ని మనమే చంపితే మన ప్రాణాలనయినా రక్షించుకోగలుగుతాం. అయినా చేసేవాడిని నేనయితే నీకేమిటి భయం?"

నాగు చెప్పిన మాటలు సమంజసంగానే వున్నా దీపక్‌ను చంపడానికి మనస్కరించడంలేదు నాకు. భారం అంతా నాగు తనమీదే వేసుకోవడం మాత్రం కాస్త ప్రశాంతంగా వుంది నాకు.

"సరే" అన్నాను నాగు చెప్పిన నిర్ణయంతో ఏకీభవించినట్టు.

"రేపు ఉదయమే దీపక్‌ను డిశ్చార్జ్ చేస్తారు. ఇవాళ నేను రంగరాజుతో కలిసి మన పాస్‌పోర్టులకోసం ప్రయత్నిస్తాను. సాయంత్రం వరకూ నువ్వు రెస్టు తీసుకో వచ్చు" అంటూ నాగు తన గదిలోనికి వెళ్ళి, బ్లాక్ సూట్‌కేస్ ఒకటి తెచ్చి నాకందించాడు 'ఇది నీ దగ్గరే వుంచు' అంటూ.

ఎర్ర రంగు సూట్‌కేస్ మార్చి, ఈ నలుపు రంగు సూట్‌కేస్‌లోనికి వజ్రాలు మార్చాడని గ్రహించాను.

నాగు వెళ్ళిపోయాడు.

చీకటి పడుతూండగా వచ్చాడు. దురదృష్టవశాత్తు మాకు పాస్‌పోర్టులు దొరకలేదు.

ఎక్కడలేని నిరుత్సాహం ఆవహించింది నన్ను. నాగు

ధైర్యం చెప్పాడు. రేపు మళ్ళీ ప్రయత్నిస్తానన్నాడు.

మర్నాడు పదింటికి రెడీ అయ్యాం నాగూ, నేనూ మారు వేషాలలో.

## 7

ప్రభుత్వ ఆసుపత్రి అది—

కారు ఆపాడు నాగు. ఇద్దరం క్రిందకు దిగాం. ఒక గ్లాత్ షాప్ ముందు ఆగి వున్న కారు అది. తాళం వేసి లేకపోవడంవల్ల, నాగు ఎత్తుకొచ్చాడు దాన్ని. ఇలాంటి పనులు నాగుకు వెన్నతో పెట్టిన విద్య.

కారు తాళంవేసి, హాస్పిటల్ లోనికి నడిచాం. బ్లాక్ సూట్ కేస్ తన వెంటే తెస్తున్నాడు నాగు.

ఎంక్వాయిరీలో అడిగివచ్చాడు నాగు. తిరిగి క్రిందికి దిగిపోయాం. అరగంట వెయిట్ చేశాక డిశ్చార్జ్ చేశారు దీపక్ ని. ప్రస్తుత పరిస్థితిలో దీపక్ అనుమానితుడిగానే వున్నా తగిన ఆధారాలు లేకపోవడంవల్ల పోలీసులు దీపక్ ను వదిలి పెట్టేశారని గ్రహించాం.

ఇద్దరు కానిస్టేబుల్స్ దీపక్ ను మెల్లగా నడిపించు కొంటూ తీసుకొని వచ్చారు.

ఇద్దరం చాటుగా గమనిస్తున్నాం. దీపక్ ను హాస్పిటల్ ఆవరణలో వదిలేసి వెళ్ళిపోయారు కానిస్టేబుల్స్. రోడ్ మీదకు వచ్చిన టాక్సీ ఆపాడు దీపక్. ఎక్కి కూర్చుని టాక్సీవాడికి యేదో చెప్పాడు. రివ్వున దూసుకు పోయింది టాక్సీ.

గబగబా కారు యెక్కాం. నాగు స్టార్టుచేసి టాక్సీ వెళ్లినవైపు పోనిచ్చాడు వేగంగా.

ఒక పక్కనుంచి చెప్పలేనంత ఖంగారుగా వుంది నాకు. ఈపాటికి పోలీసులు మేమెక్కిన కారుకోసం

వేట ప్రారంభించే వుంటారు. దురదృష్టవశాత్తు వారు గుర్తుపట్టారంటే మొదటికే మోసం వస్తుంది.

“దీపక్ ఎక్కడికి వెళుతున్నాడో అర్థం అయిందా నీకు!” టాక్సీని ఫాలో చేస్తూనే అడిగాడు నాగు.

“ఎక్కడికి?”

“నా ఊహ ప్రకారం హాస్పిటల్‌లో వున్నప్పుడే, దీపక్‌కు సీక్రెట్ మెస్సేజ్ పంపివుంటాడు బాస్. ఖచ్చితంగా బాస్‌తో మళ్ళీ చేయి కలపడానికి ఒప్పుకునే వుంటాడు దీపక్. బాస్ సర్వసాధారణంగా ఇలా యెవరినయినా పట్టపగలు రిసీవ్ చేసుకోవాలనుకుంటే ఊరవతల నిర్జన ప్రదేశాల్లోనే రిసీవ్ చేసుకుంటాడు....

“ఇలాంటి ఎన్నో వ్యవహారాలకు బాస్ నన్ను పంపించాడు. నాకు బాగా గుర్తు. నా ఐడియా కరెక్టే అయితే ప్రస్తుతం ఈ టాక్సీ ఊరవతల ఆగుతుంది” అన్నాడు నాగు సాలోచనగా.

ఏం జరుగుతుందో అన్న టెన్షన్‌తో నా తల వేడెక్కిపోతూంది. సుమారు ఇరవై నిమిషాలు టాక్సీని జాగ్రత్తగా వెంబడించాడు నాగు.

టాక్సీ ఊరు దాటిపోయింది.

నాగు నా వంక చూశాడు సన్నగా నవ్వుతూ.

ఊరవతల నిర్జన ప్రదేశానికి కాస్త దూరంలో ఆగింది టాక్సీ. అది కనుచూపు మేరలో కనిపిస్తుండగా మా కారు ఆపాడు నాగు.

ఐదు నిమిషాలు గడిచాయి.

దీపక్ వచ్చిన టాక్సీ వెనుతిరిగి వెళ్ళిపోయింది, మా ముందు నుండే.

నిర్మానుష్యంగా వుంది ఆ ప్రదేశమంతా.

కారు స్టార్టు చేశాడు నాగు.

చెమటలు పట్టాయి నాకు. గుండె వేగం హెచ్చింది.

మా కారు వేగం అందుకొంది. రివాల్వర్ బయటకు తీశాడు నాగు. మారంగా తెల్లటి కట్లలో కు టుకొంటూ అటువయిపు తిరిగి నడుస్తున్నాడు దీపక్.

అతనికి ఎదురుగా కాస్త మారంలో మరో నల్లటి కారు అతడి దగ్గరకు వస్తూంది.

మా కారు దీపక్‌ను సమీపిస్తుంది. నడుస్తున్న దీపక్ కుడి చేతివయిపు చిన్న కంకరరోడ్డు స్పష్టంగా కనిపిస్తూంది మాకు.

అవతల కారు వేగం హెచ్చింది. అందులో వాళ్ళు దీపక్‌కు చేయి ఊపుతున్నారు. దీపక్ కూడా మెల్లగా చేయి ఊపుతున్నాడు వాళ్ళకు. వాళ్ళు మా కారును చూసి అనుకుంటూ దీపక్‌కు సైగ చేస్తున్నారు. అది దీపక్‌కు సరిగా అర్థంకావడం లేదు.

మా కారు దీపక్‌కు దగ్గరగా వచ్చేసింది. శబ్దానికి హఠాత్తుగా వెనక్కి తిరిగాడు దీపక్.

అతని కళ్ళల్లో మమ్మల్ని గుర్తించిన భావం. తర్వాత భయం.

నాగు రివాల్వర్ గురిపెట్టాడు. అతని గురి తప్పదని నాకు తెలుసు. కళ్ళు మూసుకొన్నాను ఇబ్బందిగా.

రివాల్వర్ పేలింది. వెంటనే వినిపించింది దీపక్, కేక ....

నేను కళ్ళు తెరవలేను. మా కారు స్పీడ్ పెరిగి మలుపు తిరగడం తెలుస్తూంది. కంకరరోడ్డుమీద నుండి మా కారు చాలా వేగంగా పోతోందని గ్రహించాను

కుదుపులను బట్టి.

అప్పుడు వినిపించసాగాయి రివాల్వర్ చప్పుళ్ళు. మా కారుకు తగులుతున్నాయి బుల్లెట్లు ఖంగుమంటూ. బాస్ మనుషులు పేలుస్తున్నారని అర్థమయింది. మా కారు మరింత వేగం అందుకొంది.

# 8

సాయంత్రం ఆరున్నరయింది.

ఇవ్వాళ తేదీ పదిహేను. 'బాస్ ప్రసాదించిన ఆయుస్సు యింకా పదహారు గంటలు వుందన్నమాట!' మనసులో నే అనుకొన్నాను. ఉస్సురని నిట్టూర్చాను.

ఆ గదిలో నే నొక్కడినే వున్నాను. ఆ రోజు టేప్ రికార్డర్‌లో వినిపించిన బాస్ మాటలు ఆ గదిలో ప్రతిధ్వనిస్తున్నట్లనిపిస్తోంది. కళ్ళు మూసుకొని మంచంపై పడుకొన్నాను మౌనంగా.

లాడ్జి ఓనర్ రంగరాజు ఇంట్లో గది అది. ప్రక్క గది నాగుకి కేటాయించబడింది. నాగు అభ్యర్థనమీద తన యింట్లో స్థానమిచ్చాడు రంగరాజు మాకు.

నాగు ప్రస్తుతం తన గదిలో లేడు. రంగరాజుతో కలిసి పాస్‌పోర్టుల కోసం వెళ్ళాడు. కానీ ఇండో ఆంగ్లేయుడి వేషంలో కాదు. పిల్లిగడ్డం, రిమ్‌లెస్ కళ్ళద్దాలతో కూడిన మరో వింత వేషంలో. దీపక్‌ను కాల్చినప్పుడు మా మారువేషాలను బాస్ మనుషులు చూశారు. అందుకే మళ్ళీ వేషాలు మార్చక తప్పలేదు మాకు.

మంచం మీద నుండి లేచి తలుపు గడియ పెట్టాను. పరుపు పైకెత్తి నల్లటి సూట్‌కేసు పైకి లాగాను. తెరిచాను.

తెల్లటి వజ్రాలను ముఖమల్ సంచులలో నుండి బయ

టికి తీశాను.

కోట్లు విలువ చేసే ఆ వజ్రాల కాంతి నా కళ్ళల్లో పడ గానే అర్థమయింది నాకు; నాగు, ఖాసిం, దీపక్ లు ఎందుకు ప్రాణాలకు తెగించారో!

ఇంకా కాసేపు ఆ కాంతి నా కళ్ళల్లో వుంటే నా మెదడులో యే దుర్బుద్ధి పుడుతుందోనని భయం వేసింది.

వజ్రాలు యథావిధిగా సర్ది సూట్ కేసు మూసేశాను. యథాస్థానంలో వుంచాను దాన్ని.

తలుపు తడుతున్నారు ఎవరో.

వెళ్ళి తలుపు తీశాను. నాగు నిలబడి వున్నాడు బయట. అతని మొహంలో యెక్కడలేని ఆనందం కనిపిస్తుంది.

"పాస్ పోర్ట్లు దొరికాయి కదూ!" అన్నాను నవ్వుతూ.

"అవును! ఇక నూటికి నూరుపాళ్ళు మన కష్టాలు తీరిపోయినట్టే" అన్నాడు నాగు లోనికి వస్తూ.

"ఫ్లయిట్ ఎప్పుడూ?"

"రేపు ఉదయం ఆరింటికి. బాస్ వేట నుండి మనకు విముక్తి రేపు ఉదయమే" రిలీఫ్ గా చెప్పాడు నాగు.

నేను మాత్రం నాగు వున్నంత ఆనందంగా వుండలేక పోతున్నాను. నా మనసులో యేదో మూల భయం నన్ను హెచ్చరిస్తోంది.

"సూట్ కేసు భద్రంగా వుందా?...." అడిగాడు నాగు.

సూట్ కేసు తీసి అందించాను నాగుకు. మొహమాటం లేకుండా దానిని తెరిచాడు నాగు. ముఖమల్ సంచులలో నుండి వజ్రాలు బయటకు లాగి చూస్తున్నాడు.

సరిగ్గా అప్పుడే తలుపు దగ్గర శబ్దమయింది. తలుపు వేయడం మర్చిపోయాం ఇద్దరూ

నాగు టక్కున మూసేశాడు సూట్ కేసు.

తలుపు దగ్గర రంగరాజా నిలబడి వున్నాడు. "ఏడున్నరకే భోజనాలకు డైనింగ్ హాలులోనికి వచ్చేయండి. అంతవరకు విశ్రాంతి తీసుకోండి" నవ్వుతూ చెబుతున్నాడు రంగరాజా.

ఇద్దరం బొమ్మలకు వలె తల లూపాం. తాపీగా నిష్క్రమించాడు రంగరాజా.

నాగూ, నేనూ మొహా మొహాలు చూసుకొన్నాం.

రంగరాజా నవ్వులో సహజత్వం వున్నట్టు కనిపించలేదు నాకు. నాగు యేదో ఆలోచిస్తూ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఇబ్బందిగా కూర్చున్నాను నేను కుర్చీలో.

భోజనాలు పూర్తయిన తర్వాత—నాగు ఒక సూట్ కేసు అందించి చెప్పాడు నాకు.

నా గదిలోనికి వెళ్ళి తెరిచాను దాన్ని. పార్శీ బాబా వేషం అది. పెద్ద బవిరి గడ్డం, తాషాయి దుస్తులు వున్నాయందులో. చటుక్కున ముద్దు పెట్టుకొన్నాను వాటిని. ప్రస్తుతం నా ప్రాణాలు రక్షించే కవచాలు అవి.

ఆ వేషం ఒకసారి వేసుకొని చూడాలనిపించింది.

అద్దం ముందు కూర్చుని, జాగ్రత్తగా మేకప్ చేసుకొన్నాను. చాలా తమాషాగా వున్నాను నేను ఆ వేషంలో. ఇలాంటి వేషాలు గట్టా సమయానికి సప్లయ్ చేసిన రంగరాజాకి మనసులోనే అభినందనలు తెల్పాను.

ఇలాంటి సప్లయ్ చేయగలుగుతున్నాడంటే రంగరాజా ఇంకా చట్టవ్యతిరేక చర్యలు చేస్తున్నాడన్న విషయం

ఎవరూ చెప్పకనే అర్థం అయింది నాకు.

నిద్ర ముంచుకొని వస్తూంది. టైమ్ చూశాను. పదవు తోంది. వేషం విప్పే ఓపిక లేక అలాగే పడుకొన్నాను. గాఢంగా నిద్రపట్టింది.

## 9

ఉలిక్కిపడి లేచాను!?

రివాల్వర్ పేలిన శబ్దంతోనే నాకు నిద్రాభంగ మయిందని గ్రహించాను. తలుపు తీసికొని బయటకు వచ్చాను బంగారుగా. నాగు గది తలుపు వారగా తీసి వుండడం చూసి లోపలికి వెళ్ళాను.

నిలువెల్లా వణికిపోయాను లోపలి దృశ్యం చూసి.

రక్తపు మడుగులో పడివున్నాడు రంగరాజు.

తొందర తొందరగా క్రిందపడిపోయిన రిమ్‌లెస్ కళ్ళద్దాలను తీసి పెట్టుకొని, సూట్ కేస్ అందుకొంటు న్నాడు నాగు

ఏమీ అర్థంకావడంలేదు నాకు.

"త్వరగా పద" అంటూ నన్ను హెచ్చరించి వేగంగా కదిలాడు నాగు. నాగును ఫాలో అయ్యాను నేను.

ఆ యింట్లో కుటుంబ సభ్యులు, నౌఖర్లు నిద్ర లేచి, హడావిడిగా పరిగెట్టుకొంటూ రాసాగారు.

అప్పటికే వాళ్ళ కంటపడకుండా యిద్దరం తప్పించు కొన్నాం.

చాలా దూరం పరిగెట్టాం ఇద్దరం. టైమ్ చూశాను— ఐదు అవుతోంది.

కాసేపటికి యిద్దరం పరుగు మాని నడవసాగాము.

"అసలేమయింది?" అడిగాను ఆయాసపడుతూ.

"దొంగ రాస్కెల్ మన దగ్గర వజ్రాలున్న సంగతి గ్రహించేశాడు. బహుశా, నిన్న రాత్రి చూసివుంటాడు. పిల్లిలా వచ్చి సూట్ కేసు తీసుకొన్నాడు. పైగా నన్ను చంపాలని రివాల్వర్ తీశాడు. అదృష్టం బావుండి నేనే వాడిని హతమార్చగలిగాను; మనం సమయానికి వేషాలతో వుండటం మంచిదయింది" వగురుస్తూ చెప్పాడు నాగు.

సందులా ఉన్న ఆ చిన్న వీధిలో, కుడివయిపు ప్లాట్ ఫాం మీద పది పదిహేనుమంది అడుక్కొనేవాళ్ళు, సాధువులు గాఢనిద్రలో వున్నారు.

నాగు ఆగిపోయి తన సూట్ కేసు తెరిచాడు. ఎందుకో అర్థంకాలేదు నాకు.

ఒక ముఖుమల్ సంచి నాకు అందించాడు.

తెల్లబోయాను. "ఏ క్షణాన యేం జరిగేది చెప్పలేం. ఎవరి వజ్రం వాళ్ళ దగ్గరుంటే మంచిది" చెప్పాడు నాగు, పాస్ పోర్ట్, రెండొందలు క్యాష్ కూడా నా కందిస్తూ.

మాట్లాడకుండా వాటన్నింటినీ జేబులో పెట్టుకొన్నాను.

ఆ వీధి చాలా పొడుగుంది. ముందుకి చూస్తూ నడుస్తున్న నాకు యేదో అనుమానం వేసింది.

దూరంగా కనుచూపు మేరలో నల్లటి కారు మెల్లిగా వస్తూంది. దూరం నుండి అయినా గుర్తుపట్టాను ఆ కారును. వెంటనే చెప్పాను నాగుతో.

గజ గజ లాడిపోయాడు నాగు దాన్ని చూసి. "అది .... అదే కారు ...." నాగు మాటలు తడబడుతున్నాయి.

రెండుక్షణాలాగి చెప్పాడు—"మనం మారువేషాల్లోనే వున్నప్పటికీ, మనిద్దరం కలిసి రావడం వాళ్ళకొక క్లూ అవుతుంది. దాన్ని వాళ్ళకు లేకుండా చేయాలి. మనిద్దరం విడి విడిగా వెళదాం. నువ్విక్కడే ఆగిపో...."

నాగు చెప్పింది నిజమే! చక చకా పనిచేసింది నా బుర్ర. క్షణం కూడా ఆలస్యం చేయకుండా కదిలాను, నిద్రిస్తున్న వాళ్ళవయిపు. వాళ్ళకు నిద్రాభంగం కలిగించకుండా నిశ్శబ్దంగా వాళ్ళ మధ్యన చేరాను. నా గడ్డం, కాషాయివస్త్రాలు వాళ్ళల్లో కలసిపోయాయి.

నాగు సూట్ కేసు పట్టుకొని నడుస్తున్నాడు నిర్భయంగా. కారు నాగును సమీపించింది. ఊపిరి బిగబట్టాను. నాగును దాటిపోయింది కారు.

అంతలోనే అది నా ముందు ఆగింది. గుండెల్లోంచి తన్నుకొచ్చింది నాకు వణుకు.

కారులో వాళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నారు నాకు. పక్కలో పిడుగు పడ్డట్టు అదిరిపడ్డాను కారులో దీపక్ ను చూసి?! ఇంకా కట్లున్నాయి అతడికి. అంటే!? ఆ రోజు దీపక్ చావలేదన్న మాట!

కారు నిండా యింకా యెవరెవరో వున్నారు దీపక్ వాళ్ళతో యేదో చెబుతున్నాడు. కారు వెనక్కి తిరిగింది. దీపక్ వాళ్ళతో ఏం చెప్పివుంటాడో ఊహించుకోగలను. నాగును గుర్తించాడు దీపక్.

కారులో దీపక్ వుండడం, కారు తిరిగి వెనక్కి రావడం గమనించినట్టున్నాడు నాగు. నడక వేగం పెంచాడు. కారు నాగు దగ్గరికి వెళ్ళింది. నాగు తటాలున రివాల్వర్ తీశాడు. కానీ అప్పటికే ఆలస్యం జరిగిపోయింది.

కారు విండోలో నుండి బయటకు వచ్చిన రివాల్వర్ మూడుసార్లు మెరిసింది నిశ్శబ్దంగా. రివాల్వర్ సైలెన్సర్ అమర్చబడిందని గ్రహించాను.

నేల కొరిగిపోయాడు నాగు.

దృశ్యాన్ని అప్పుకొని మూగగా చూస్తుండిపోయాను.

నాగు క్రింద పడగానే అతని సూట్‌కేసు కారు లోనికి చేరింది. ఆ తర్వాత నే నూహించిన సంఘటనే జరిగింది.

దీపక్ కారు నుండి క్రిందకు త్రోయబడ్డాడు. మరో సారి నిప్పులు కక్కింది రివాల్వర్. పెద్దగా మూలిగి నిస్ప్రాణంగా వాలిపోయాడు దీపక్. కారు వేగంగా వెళ్ళిపోయింది.

ఒక్క నిమిషం అలాగే వుండిపోయాను.

మెల్లగా లేచి నడిచాను. దీపక్ పడి వున్నాడు ముందు. అతడి దేహంలో ప్రాణం లేదని గ్రహించాను. నాగును సమీపించాను. కదులుతున్నాడు. జేబులో నుండి యేదో తీయాలని ప్రయత్నిస్తున్నాడు. అతడికి సహాయం చేశాను.

తాళంచెవి తీసి అందించాడు నాకు. తెల్లగా మెరుస్తున్న ఆ తాళంచెవి యేదో బాంక్ లాకర్‌దని గ్రహించాను.

దాన్ని అందుకొని నాగువైపు ప్రసరించాను చూపులు. నాగు కళ్ళు కొద్దిగా తెరుచుకొని వున్నాయి. మొహంలో జీవకళ లేదు. ఒక్క నిమిషం మౌనంగా వున్నాను నాగు మరణానికి.

బాస్ ఉచ్చు పిడికిలిలో తర్వాత వలిగే జీవిని నేనేగా!?

నా చావు ఇంతేనా!???

అంతుచిక్కని ఆలోచనలు నన్ను వేధిస్తున్నాయి.

హఠాత్తుగా తల తిప్పాను యేదో శబ్దం వినిపించడంతో. ఇందాకటి కారే! పోయినట్టే పోయి మళ్ళీ వస్తున్నారు. వేగంగా వస్తోంది కారు నా వైపు.

చటుక్కున లేచి పరిగెట్టాను ఎదురుగా వున్న చిన్న సందులోనికి. పిచ్చివాడిలా కనిపించిన ప్రతి గల్లీలోనికి పరిగెట్టసాగాను.

చివరిగా ఓ ఇరుకు సందులో ఆగాను. ఎవరూ లేరక్కడ. నా వంటిమీద వున్న వేషం యిక నాకు రక్షణ యివ్వలేదనిపించింది. అక్కడే విప్పేశాను వేషాన్ని. వేషం అడుగున నా దుస్తులు నలిగిపోయి వున్నాయి.

ప్రస్తుత కర్తవ్యం యేమిటా అని ఆలోచించాను నిమిత్తంగా. నాకు యిచ్చిన తాళం గుర్తొచ్చింది. పాస్‌పోర్టు కూడా గుర్తొచ్చింది.

ఒక నిర్ణయానికి వచ్చాను.

# 10

నేను హైదరాబాద్ చేరేసరికి నాకు కావలసిన బాంక్ తెరిచేవుంది. బ్యాంక్‌లో నా మీద ఎలాంటి దాడి జరగకపోవడం వింతే!

అదృష్టవశాత్తు నాకు బాగా పరిచయం వున్న మిత్రుడు ఒకడు పనిచేస్తున్నాడు అందులో. ముందు నా అవతారం చూసి ఆశ్చర్యపోయాడు వాడు. తలంతా రేగిపోయి, మాసిపోయిన బట్టలతో బీభత్సంగా వున్నాను.

వాడితో చిన్న కథ చెప్పి, ఎలాగయినా లాకర్ తెరవాలని బ్రతిమాలాను. లాకర్ గలవ్యక్తి చని

పోయాడని, లాకర్ నా పేర్న తెరిచినా వాడికి ఏం ప్రమాదం లేదని డూప్లికేట్ తాళం కూడా నా దగ్గరే వుందని—

చెప్పి తాళం చూపించిన తర్వాతి, లాకర్ తెరవ డానికి ఒప్పుకొన్నాడు వాడు.

టెన్షన్ భరించలేక పోతున్నాను. ఆ లాకర్‌లో నాగు ఏం దాచాడో అన్న ఆసక్తి నన్ను కుదిపేస్తుంది?

లాకర్ తెరిచాడు. ఆసక్తిగా తడిమాను లోపల.

లెదర్‌తో తయారుచేసిన ఒక అట్టపెట్టె వుంది లోపల. బయటికి తీసాను. దానికి కట్టబడివున్న ఎర్రటి తాడు విప్పి పెట్టె తెరిచాను.

లోపల ఏవో కాగితాలు, ఫోటోలు జెరాక్స్ కాపీలు చాలా వున్నాయి ముందు అర్థంకాలేదు నాకు అవి యేమిటో!? కాసేపు పరిశీలించగా తెలిసాయవి. కొద్ది క్షణాలు చేష్టలుడిగి నిశ్శబ్దంగా నిలబడిపోయాను, టెన్షన్ కంట్రోల్ చేసుకోవడానికి. నాగును మనసులోనే అభి నందించాను.

అవి పోలీసులకు అందిస్తే రాష్ట్రవ్యాప్తంగా వున్న బాస్ స్మగ్లింగ్ ముఠా క్షణాల్లో కటకటాలు లెక్క పెడతారు.

సరిగ్గా అప్పుడే అవగాహన అయింది నాకో విషయం. ఉదయం ట్రైన్‌లో బాస్ మనుషులు యెవరూ నన్ను చంపడానికి ప్రయత్నించలేదు. అంటే!? నాగు నాకు యేదో యివ్వడం వాళ్ళు చూశారు. అదేమిటో తెలుసు కోవడం తమకు క్షేమం అనుకొన్నారు. అందుకే నన్ను చంపలేదు. ఈ విషయం తెలుసుకోవడానికి ట్రైన్‌లో రహస్యంగా నన్ను వెంబడించే వుంటారు.

నేను కొంత బయటికి రాగానే నన్ను చంపి, నా చేతిలో వున్న పెట్టె తీసుకొని పారడమే!

స్నేహితుడికి కృతజ్ఞతలు చెప్పి, బయటికి నడిచాను.

ఖాసిం, నాగు, దీపక్ ల హత్యలు నా కళ్ళముందు మెదిలాయి వరసగా. మొండి ధైర్యం నన్నావహించింది. కొన ప్రాణంతోనయినా పెట్టె పోలీసులకు అందజేయా అని నిర్ణయించుకున్నాను దృఢంగా.

టైమ్ చూశాను. మృత్యువు మొహంమీదికి వంగినట్టు తుళ్ళిపడ్డాను.

పది ఇరవై అయింది. బాస్ అన్నమాట నిలబెట్టుకొంటే, మరో పదినిమిషాలలో నేను ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా వదిలి వెళ్ళిపోతాను.

గుండెలనిండా ఊపిరి పీల్చుకొన్నాను.

చేతిలో పెట్టె బలంగా పట్టుకొని, వేగంగా రోడ్డు మీదికి అడుగుపెట్టాను.

కనిపించిన టాక్సీలో చటుక్కున ఎక్కి కూర్చున్నాను.

"దగ్గరలో వున్న పోలీస్ స్టేషన్ కు పోనీ. వేగంగా పోనీ" చెప్పాను.

టాక్సీవాడు నా వంక ఒకసారి వింతగా చూసి పోనిచ్చాడు.

టాక్సీ వేగంగా పోతూంది.

చెమట్లు పడుతూండగా టాక్సీవాడిని వత్తిడి చేయసాగాను మరింత వేగంగా పోనిమ్మని.

గడిచే ప్రతీ క్షణం నన్ను మృత్యువుకి దగ్గరచేస్తున్న భావన. గుండె తెగిపోతుందేమో అన్నంత వేగంగ కొట్టుకొంటూంది.

అప్పుడు చూశాను యెడం పక్కగా కనిపిస్తున్న పోలీస్ స్టేషన్ను. పోయిన ధైర్యం తిరిగివస్తున్నట్లనిపించింది. సరిగ్గా అప్పుడే చూశాను యెదురుగా వస్తూన్న పెద్ద లారీని. రంగులు వెలిసిపోయి, అక్కడక్కడా తుప్పుపట్టి అసహ్యంగా కర్కశంగా వుందా లారీ.

హఠాత్తుగా రాంగ్ రూట్లోనికి మారి టాక్సీ వయిపు దూసుకొని రాసాగింది అది.

డ్రైవర్ ఖంగారుపడుతున్నాడు. పరిస్థితి అర్థమయింది నాకు స్టీరింగ్ వీల్ను అటూ ఇటూ తిప్పుతున్నాడు డ్రైవర్ బేజారెత్తిపోయి.

తన ప్రాణాన్ని రక్షించుకోడానికి పిరికివారే ఎక్కువ తాపత్రయ పడతారేమో!

టాక్సీ ఎడంవయిపు డోర్ తెర్చి, కళ్ళు మూసుకొని క్రిందకు దూకేశాను.

రెండు క్షణాలు నా శరీరాన్ని గాలి తప్ప మరేమీ స్పృశించలేదు. తర్వాత నేలను తాకింది శరీరం. ముందు తలకు తగిలింది బలమయిన దెబ్బ తర్వాత ఒళ్ళంతా నేలను దేకొనిపోయి, చర్మం పెచ్చులూడి పోయింది. బట్టలు రక్తసిక్తమైపోయాయి.

చేతిలో పెట్టె అల్లంత దూరంలో పడింది.

లారీ టాక్సీకి బలంగా గుద్దుకొన్నట్టు భళ్ళున శబ్దం అయింది. జనం కేకలు, పోలీసుల విజిల్స్ అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

ప్రాణాలు ఉగ్గ పట్టుకొని శరీరాన్ని పైకి లేపాను. పెట్టె దగ్గరకు నడిచాను. నిస్సత్తువగా జారిపోతూను క్రిందకు. నేను క్రిందకు జారగానే నా తలపై పెద్ద శబ్దం వినిపించింది, రివాల్వర్ పేల్చిన శబ్దం అది.

కొంద్రుక వాసిలో తప్పుకొని పోయిందని గ్రహించాను.

ఎదురుగా పోలీస్ స్టేషన్ బయట వున్న కాన్‌స్టేబుల్ చూశాడది. తటాలున కదిలి పరిగెట్టుకొంటూ వచ్చాడు నా వైపు. పైకి లేవనెత్తాడు నన్ను.

అతనితో చెప్పాను విషయం క్లుప్తంగా, చేతిలో పెట్టి చూపించి.

తలనుండి రక్తం కారుతున్నా, ఒళ్ళు నిస్సత్తువగా తూలిపోతున్నా కాన్‌స్టేబుల్ ఆసరాతో స్టేషన్ లోపలికి నడిచాను.

తలకు తగిలిన దెబ్బవల్ల మెల్లగా స్పృహ తప్పుతోంది నాకు మగతగా కళ్ళు తెర్చి టైమ్ చూశాను.

పదిన్నర దాటింది.

మృత్యుగండం దాటిపోవడంతో నిశ్చింతగా కళ్ళు మూసుకుని క్రిందకు జారిపోయాను.

—:అయిపోయింది:—

# రేపటి ప్రమాదం

కె. వి. యస్. ప్రకాశరావు

బంతిలా దొర్లుకుంటూ నల్లటి ముసుగు ధరించిన వ్యక్తి పాదాల ముందు ఆగాడతను. ముసుగు వ్యక్తి బిగ్గరగా నవ్వుతూ కాళ్ళ ముందున్న వ్యక్తిని ఫుట్ బాల్ లా తన్నాడు. ఆ వ్యక్తి మరలా దొర్లుకుంటూ వెళ్లాడు మరో వైపు.

ఆ వ్యక్తి నిస్సహాయుడు!

రెండు కాళ్లు చేతులు కలిపి ముందుకు కట్టారు. వీపు మీద అడ్డంగా ఎర్రటి రక్తపు చారలున్నాయ్! తల అటు యిటూ తిప్పడానికవకాశం లేదు.

ఆ గదిలో మరో పదిమంది వ్యక్తులున్నారు. వారంతా అతన్ని చూసి బిగ్గరగా నవ్వారు. వారు రూపురేఖలలో యమకింకరులవలె వున్నారు!

వారి నవ్వులు అతడికి పుండుమీద కారం జల్లినట్లుగా వుంది. తన కోపాన్ని కనులలో చూపించాడు. బిగ్గరగా అరిచాడు.

"ఒరేయ్ బేవకూఫ్! మీ కెవరికయినా దమ్ములుంటే నన్ను వదలండి. నా సత్తా చూపిస్తాను. మీ అందర్నీ మట్టి కరిపిస్తాను. నిస్సహాయుణ్ని చేసి మీ ప్రతాపం నామీద చూపించి వెర్రి వెంగళప్పలవలె నవ్వకండి.

"రేయ్ ముసుగు పీనుగా! మొహం చూపించడానికి ధైర్యం చాలక ఆడదానిలా ప్రవర్తించడానికి నీకు సిగ్గు లేదురా!

"నన్ను బంధవిముక్తుడను చేసి, మీలో నలుగురిని నాతో పోరాడమను. నా సత్తా చూపిస్తా. ఒకే ఒక మనిషిని—యింతమంది వుండగా—ధైర్యం లేక—చాలక యిలా హింసించడానికి నీకు సిగ్గులేదురా! ఛీ! మిమ్మల నందరను చీల్చి చెండాడడానికి నాకేమవకాశం లేకుండా చేసి వెర్రి నవ్వులు నవుతారురా గాడిదకొడుకల్లారా!" అన్నాడు జీకో.

అంతే!

అతని వీపుమీద 'ఛళ్ళు! ఛళ్ళు!' మంటూ కమ్చీ దెబ్బలు పడ్డాయి. ముసుగుమనిషి కోపంగా వూగిసలాడి పోసాగాడు'

"వాడి కట్లు విప్పండి" హుకుం జారీచేసాడు ముసుగు వ్యక్తి.

ఇద్దరు వ్యక్తులు నేలమీద పడున్న వ్యక్తి వద్దకు వెళ్ళి అతని కట్లు విప్పారు. కట్లు విప్పడం పూర్తికానే లేదు—

తెరచిన బోనునుండి ముందుకి వురికిన సింహంలా అతను ఆ యిరువురి వ్యక్తుల పీకలను బలంగా రెండు చేతులతో బిగించి పట్టుకున్నాడు.

కెవ్వున అరిచారిరువురూ!

"నోర్మూసుకుండిరా ఫూల్స్! యిప్పుడు_యిప్పుడు నేనేమిటో, నా ప్రతాప మేమిటో చూపిస్తాను. చూడండి" అంటూ ఓ వ్యక్తిని ఓ చేతితో బంతిలా పైకి ఎగుర వేసాడు. క్రిందికి పడబోతూంటే సాచి తన్నాడు.

"చచ్చాను బాబోయ్" అంటూ ఆ వ్యక్తి అరుస్తూ దభీమంటూ దూరంగా వెళ్ళి పడ్డాడు.

"ఊ! వాడిని పట్టుకోండి" అరిచాడు ముసుగు వ్యక్తి కోపంగా.

రెండో మనిషిని తనకడ్డుగా పెట్టుకొని "దగ్గర కెవరూ రాకండి. సాహసించి ముందుకి వస్తే వీడి ప్రాణం పోవడానికి నిమిషంకూడా పట్టదు. ఖబడ్దార్!" సింహంలా గర్జించాడతను.

ముసుగు మనిషి మరే ఆలోచన చేయలేదు. అతని చేతిలోని పిస్టల్ నిప్పులు కురిసింది. బాధగా అరుస్తూ రెండో మనిషి తలవాల్చాడు.

"చవట పీనుగా! నీ అనుచరులను నువ్వే చంపుకుంటూ నీ పిరికితనాన్ని చూపిస్తున్నావ్! యిక నన్నేం చేస్తావురా. కాచుకో" అంటూ అతను రెండో మనిషిని ముసుగు మనిషిమీదకు గిరాటు వేశాడు.

ముసుగు మనిషి చటుక్కున పక్కకు తప్పుకున్నాడు. రెండోమనిషి నేలపడ్డాడు.

"చూస్తారేం? ఆ జీరోగాడిని పట్టుకొని జీరోని చేసేయండి. వీడివలన యిద్దరి ప్రాణాలు పోయాయి. హరియప్!" అన్నాడు ముసుగు మనిషి.

ఐదుగురు వ్యక్తులు జీరోమీదకు రాసాగారు. అది గమనించాడు జీరో. ఆలోచన కవకాశం లేదు.

యిప్పుడు తన ప్రాణాలు గడ్డిపోచతో సమానం.

తనకెలాగూ వారు చంపక మానరు. యీ అవకాశాన్ని ఉపయోగించుకుని సాధ్యమయినంత యెక్కువ మనుషులను చంపితే మంచిది.

సావకాశం చిక్కితే తాను పారిపోవచ్చును. కాని అందుకావకాశం కన్పించటం లేదు. రోకలిలో తల దూర్చాడు తను. రోకటి పోటుకి వెరవటమా?

పులి గుహలో చొరబడ్డాక పులితో పోరాడి చావో బ్రతుకో తేల్చుకోవాలి. పరుగెత్తి పారిపోదామన్నా ఆకలిగొన్న — రక్తం మరిగిన పులి వదలి పెట్టదు!

జీరో ఒక్క యెగురు ఎగిరాడు. యిద్దరి వ్యక్తుల గుండెల మీద తన్నాడు. దభీమంటూ వారితో బాటు క్రిందపడ్డాడు జీరో. మరో యిరువురు జీరో మీదకు వురికారు — మేకపిల్ల మీదకు పులి దూకినట్లు!

జీరో చటుక్కున పక్కకు దొర్లి చివాలున లేచి నిలబడ్డాడు. గాండ్రిస్తూ వారియువురను బలంగా తన గుప్పెటతో గుండెలమీద గుద్దాడు.

మణుగు రాళ్ళు వాళ్ళమీద పడినట్లయింది. నోట్లోంచి రక్తం కక్కుకుంటూ — అరుస్తూ నేలకూలారు.

మరొకడు అదే సమయంలో జీరో వెనకనుండి వచ్చి అతని భుజాలపై బలంగా మోదాడు. జీరో రెండు భుజాలు విరిగినట్లు భావించాడు.

ఎదురు చూడని సంఘటన!

తనను చావుదెబ్బ తీసినందుకు జీరోలో వెర్రికోపం వుదయించింది. కనులనుండి నిప్పులు కురిపించాడు. మదించిన ఆంబోతులా రంకె వేసాడు.

అలాగే కాళ్ళతో వెనక్కి తన్నాడు జీరో! అ

తన్ను తగలకూడని చోటనే తగిలింది.

"బ్లాక్ రే మర్ గయా" కుప్పకూలాడతను.

ముసుగు మనిషికి జీరో ప్రతాపం అర్థమయింది. 'అతన్ని' బంధవిముక్తుడను చేయడం పొరపాటుగా తలంచాడు. పిస్టల్ గురిమాని జీరో కాళ్ళకు పేల్చాడు.

జీరో నేలమీద చతికిల పడ్డాడు. కాళ్ళనుండి రక్తం కారసాగింది. అయినా ఆత్మ స్థైర్యం చెందలేదు దొర్లుకుంటూ వెళ్ళి ముసుగు మనిషి కాళ్ళు పట్టుకుని బలంగా కుదపసాగాడు.

అంతలో మరో ముగ్గురు వ్యక్తులు పరుగెత్తుకుంటూ జీరో దగ్గర వెళ్ళి అతన్ని పట్టుకున్నారు.

"వాడిని దూలానికి వేలాడదీయండి" కోపంగా అన్నాడు ముసుగు మనిషి.

జీరోను తీసుకొని ఆ వ్యక్తులు కదిలారు. కొద్ది నిమిషాలలో జీరోని దూలానికి వేలాడదీసారు.

ఏసు క్రీస్తుని శిలువ కొట్టబోయే ముందు కట్టినట్లుగా జీరోని కట్టారు భుజాల దగ్గర తాడువేసి దూలానికి కట్టారు గాలిలో అటు యిటూ వూగసాగాడు జీరో. కాళ్ళ నుండి రక్తం కారుతూనే వుంది.

"జీరో! నీలో మంచి అవకాశమిస్తున్నాను. నువ్వెవరు? యీ ఇల్లు నీకెలా తెలిసింది? నువ్విక్కడ తెలుసుకొన్న రహస్యాలేమిటి? చెపితే నిన్ను వదలి పెడతాం" లాలనగా అడిగాడు ముసుగుమనిషి.

"ఒంటినిండా నల్లటి ముసుగు ధరించిన నీలో మంచి ఆలోచన వుంటుందని నమ్మమంటావా? నువ్వు నల్ల మేకవి. తెల్లని పాలు నాకిచ్చి త్రాగమంటే నేనెలా త్రాగుతానురా. ఆ పాలలో కాలకూట విషం కలిపివుండవనే

నమ్మక మేమిటి?"

"అది నీ ఖర్మ. నే నడిగినదానికి జవాబు చెప్పు? నీకు కావలసింది యిస్తాను."

"అసంభవం!" అన్నాడు జీరో.

"అసంభవాలను సంభవాలుగా మార్చే శక్తి నా కున్నదని, నీకు తెలియకపోవడం నీ ఖర్మ. కఠినశిలను కూడా మాట్లాడించే శక్తి యీ బాస్ కున్నది. నేను కొట్టే కమ్చీ దెబ్బలకు శిలలు కూడా బాధతో అరుస్తూ న్నట్లు శబ్దం చేస్తాయ్. నువ్వెంత? నీ తలలో జేజమ్మ చేత కూడా నిజం చెప్పిస్తా" అంటూ ముసుగుమనిషి జీరో దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"థూ!" గాండ్రించి వుమ్మాడు జీరో.

అది మొహంమీద పడింది బాస్ కు. జీరోను చాచి లెంపకాయ కొట్టాడు బాస్. కోపం తీరక రెండుచేతుల తోను జీరో పొట్టలో గుద్దాడు.

జీరో బాధ నోర్చుకొంటూ పళ్ళను బిగించాడు! కను లను గట్టిగా బిగించి మూసుకొన్నాడు.

"ఒరేయ్ జీరో! మొండికేసిన మొండి వెధవల్ని కూడా మాట్లాడించాను! నేను పెట్టే చిత్రహింసలు భరించలేక కాళ్ళబేరాల కొచ్చారు. నవ్వే లెక్క! కళ్ళు తెరువ్. అడిగినవాటికి జవాబు చెప్పు?" అడిగాడు బాస్.

జీరో మాట్లాడలేదు. కనులు విప్పలేదు. ఎంతటి బాధ అయినా సహించే ఓర్మి అతనికి తెల్సును. ఆ విధంగా తర్ఫీదు పొందాడు. కనులు తెరచి వాళ్ళు పెట్టే బాధలు చూడడంకన్నా కనులు మూసుకోవడమే మంచిదని ఓ నిర్ణయాని కొచ్చాడు జీరో.

"వీడి కళ్ళు తెరవండిరా!"

ఇరువురు వెళ్ళి జీరో కళ్ళు బలంగా తెరచారు. బాస్ కేసి చూశాడు. అతని చేతిలో ఓ చిన్న కత్తి వుంది.

"జీరో! యీ కత్తి యెంతోమంది ప్రాణాలను రుచి చూసింది. ఆ అవకాశం దీని కివ్వవద్దు. కమాన్, టెల్మి?...."

"ఆల్ రైట్! నీతో ఓ ఒప్పందాని కొస్తాను. నే నడిగిన విషయాలకు నువ్వు జవాబు చెప్పు? తర్వాత నీకు నేను చెప్తాను" అన్నాడు జీరో.

"ఏమిటి?" అడిగాడు బాస్.

"నువ్వెవరు? నీ పేరేమిటి? నువ్వు చేసే విద్రోహ మేమిటి??"

"స్టుపిడ్! అవి నువ్వు తెలుసుకోతగ్గ విషయాలు కావు. నన్నంతా బాస్ అనే పిలుస్తారు. నిక్ నేమ్‌గా 'ఈగిల్' అంటారు. బస్. ఇక నువ్వు చెప్పు?"

"ఇంకా పూర్తి వివరాలు కావాలి?"

"నోర్ముయ్! మంచిగా వున్న కొలది మితిమీరు తున్నావ్? నిజం చెప్తావా? చెప్పించమంటావా?" ఉద్రేకంగా అడిగాడు ఈగిల్.

"చెప్పను" దృఢంగా అన్నాడు జీరో.

ఈగిల్ చేతిలోని వాడి అయిన కత్తి వేగంగా జీరో కుడిచేతి వేళ్ళను ముద్దు పెట్టుకుంది. నాలుగు వేళ్ళు తెగి క్రిందపడ్డాయి. జీరో బాధతో చేతిని అటు యిటూ వూపసాగాడు. ప్రాణాలు పోయేంతటి బాధ.

"టెల్ ది ట్రూత్? కమాన్!" ఈగిల్ కత్తిని మరలా పైకి లేపుతూ అడిగాడు.

"నో. నో. నో!!" అరిచాడు జీరో.

"యూ...." కోపంతో ఫీత్కారం చేశాడు ఈగిల్.

కోపంతో జీరో రెండో చేతి వేళ్ళను కూడా కోశాడు ఈగిల్. వాడిలో రాక్షసుడు ప్రవేశించాడు. ఎంతో మందిచే నిజాలు వెల్లడించిన తను, ఆఫ్టరాల్ ఒకడితో పలికించలేక పోతున్నందుకు వ్యగ్రమయ్యాడు.

జీరో మరింత బాధగా రెండు చేతులు అటూ యిటూ కదపసాగాడు. తన ప్రాణం పోవడం నిశ్చయం. కనులు మూసుకుంటూ భగవంతుని ప్రార్థించసాగాడు.

"జీరో!" సింహనాదం చేశాడు ఈగిల్.

అయినా జీరో చూడలేదు.

ఈగిల్ చేతిలోని కత్తి శివతాండవం చేయసాగింది. జీరో రెండు పాదాల వేళ్ళు నరికింది.

పళ్ళు గట్టిగా బిగించాడు జీరో.

చేతులమ్మట, కాళ్ళమ్మట రక్తం బొట బొట కార సాగింది. చూసి తనేం చేయలేదనుకొన్నాడు జీరో.

"చూస్తారేం? మీ ఆయుధాలు తీయండి" బిగ్గరగా అరిచాడు ఈగిల్.

అనుచరులు తమ చేతులలో పెట్టెలు తెరచి పట్టుకున్నారు. వాటిలో కత్తులు, కత్తెరలు, ఆసిడ్, గుండు సూదులు మరెన్నో వున్నాయి.

వారంతా జీరో కేసి నడవసాగారు!

ఈగిల్ పరిహాసంగా వికృతంగా నవ్వి "ఐ పిటి యూ జీరో. నీ కంత్యదశ ప్రాప్తమయింది. గుడ్ బై!" అన్నాడు.

జీరోకి కూడా తెల్సును. తననింకా ఎటువంటి చిత్ర హింసలకు గురిచేసి ప్రాణం తీస్తారో! తను చేసేదేమీ

లేదు— భగవంతుని ప్రార్థించుట తప్ప.

“నీ చేయగలిగినది చేశాను. ఇక యీ దేశాన్ని—దేశాధిపతులను కాపాడే బాధ్యత నీదే తండ్రీ!” అంటూ వేడుకున్నాడు జీరో.

## 2

ఆ రోజు రాత్రి ఏడుగంటలయింది.

లావుగా గున్న ఏనుగులాంటి మనిషి దూకుడుగా తన ముందు నిలబడివున్న సన్నపాటి వ్యక్తిని రెండు చేతులతోను ఎత్తి పైకెగుర వేయసాగాడు.

గిరికీలు కొడుతూ సన్నపాటి వ్యక్తి నేలమీద నిలబడి విసురుగా లావుపాటి మనిషిని ఢీకొన్నాడు. తలతో పొట్టమీద పొడిచాడు. దభీమంటూ గున్నలాంటి మనిషి నేలమీద చతికిలపడ్డాడు. తిరిగి లేవబోయేటంతలో సన్నటి వ్యక్తి చేతిని చాకులా వుపయోగించాడు. అది చూసి రెండు చేతులతోను దణ్ణం పెట్టాడు లావు వ్యక్తి.

మరికొంత దూరంలో యిరువురు మనుషులు తీవ్రంగా కరాటే చేస్తున్నారు. ‘నువ్వా—నేనా!’ అన్నట్లు కాళ్ళతోను, చేతులతోను కొట్టుకుంటున్నారు.

మరోచోట మరొకతను పిస్టల్ గురిపెట్టి తన ఎదుటి మనిషిని కాల్చడానికి సిద్ధంగా వున్నాడు. భయభ్రాంతుడయిన అతను నేలమీద కూచుని దొర్లుకుంటూ వెళ్ళసాగాడు. పిస్టల్ మనిషి అతనికేసి కాల్చసాగాడు. గురి తప్పుకుంటూ వెళ్ళిపోయాడతను.

ఓ యువతిని మరొకతను బలవంతం చేస్తూన్నాడు. అయినా ఆమె బెంబేలు పడుతూ కేకలు వేయలేదు. సహాయం కోసం యెదురుచూడలేదు. ఆ యువకుడిని ధైర్యంతో ఎదుర్కొంది.

వెనకపాటుగా అతన్ని వెన్నుపోటు పొడిచింది. అతను 'కెవ్వు'మని అరిచాడు. ఆమె బిగ్గరగా నవ్వుతూ అతని జుట్టు పట్టుకొని బర బర లాగసాగింది. అతను నిస్సహాయంగా వెళ్ళసాగాడు.

అంతలో —

గణ గణ మనే ధ్వని — ఎర్రటి లైటు వెలిగాయి!?

అదో రహస్య ప్రాకారం!

రక రకాలుగా దెబ్బలాడుకుంటూన్న వ్యక్తులంతా స్పెషల్ బ్రాంచి ఏజంట్లు!!!

రణరంగంలో శత్రువుతో పోరాడేటప్పుడు యెన్నో మెలుకువ అవసరం. అలాగే ఏజంట్లు శత్రువుతో పలు విధాల పోరాటం సాగించాలి.

ఒకరి కొకరు తర్ఫీదు యిచ్చుకుంటున్నారు. కొత్త వారికి పాతవారు! వారికి మరింత అనుభవజ్ఞులు! అనుభవం గుణపాఠం నేర్పుతుందనే సామెత వారికి తెల్సును. తీరిక వేళలలో వారు పొందుతున్న శిక్షణా తరగతు లవి.

ఆ ప్రాకారం యెవరికీ పై వ్యక్తులకు తెలియదు. అచ్చటకు రావడానికి ఎన్నో కట్టుదిట్టమయిన యేర్పాట్లున్నాయి. ప్రతీ ఏజంట్ విధిగా ప్రతీరోజూ అక్కడకు హాజరవ్వాలి — అత్యవసరమైన పని లేకపోతే!

'గణ గణ' మనే గంట వింటూనే వులిక్కిపాటు చెందారు ఏజంట్స్!

ఎర్రటి లైటు ప్రమాదానికి సూచిక!

ఏజంట్స్ యెంతటి అత్యవసర కార్యంలో వున్నా యీ రెండింటిని చూస్తే విధిగా సమావేశానికి వెళ్ళాలి

అక్కడ సుమారు ఇరువదిమంది వున్నారు. గబ గబ

డ్రస్‌లు వేసుకొన్నారు. వారెక్కడికి వెళ్ళాలో తెల్సును. ఎవరు పిలుస్తున్నారో చెప్పనవసరంలేదు.

కాని—

ఈ అత్యవసరవు పిలుపు దేనికో ఎవరూ వూహించలేకపోయారు.

'ఎందుకు? ఏమిటి???' ఈ ప్రశ్నలు ఏజంట్స్ వేసుకోరు. దానివలన సమయం వృధా తప్ప మరేం లేదు. అందుకే క్రమశిక్షణతో తర్ఫీదు పొందిన ఏజంట్స్ వడివడిగా అక్కడ నుండి కదిలారు.

అదొక విశాలమయిన హాలు. అందులో ఒక వేదిక. దాని ముందు పొడవైన రోజ్‌వుడ్ బల్ల—నాలుగైదు కుర్చీలు.

వేదికకు ఎదురుగా వరుసగా ఏబది కుర్చీలున్నాయి. అక్కడ సమావేశాలు జరుగుతూంటాయని చూస్తే తెలుస్తుంది.

ఏజంట్స్ హాలులో ప్రవేశించారు. ఖాళీగా వున్న కుర్చీలలో కూచున్నారు. చీమ చిటుక్కుమంటే విన్పించేటంతటి నిశ్శబ్దం. ఒకరినొకరు చూచుకుంటూ ఏజంట్స్ మాట్లాడకుండా కూచున్నారు.

సమయం చాలా విలువైనది. క్రమశిక్షణ ఎంతలా పాటిస్తారో టైంను కూడా ఏజంట్స్ అలాగే పాటిస్తూ వుంటారు.

తెల్ల సూట్ ధరించి, కళ్ళజోడు పెట్టుకున్న వ్యక్తి హాలులోకి వచ్చాడు. చరచర నడచుకుంటూ వేదిక మీదకు వెళ్లి నిలబడ్డాడు.

ఆయనకు సుమారు ఏబది సంవత్సరాలుంటాయి. జుత్తు పండిపోయింది. లావుపాటి మీసాలు, గంభీరమైన

మొహం. ఆ మొహంలోని ఆలోచనలు పసికట్టు టెవరికీ సాధ్యంకాదు.

ఆయన చేసే నిర్ణయాలు నిక్కచ్చిగా వుంటాయని మొహంతీరు స్పష్టం చేస్తోంది. చేతిలో వాకింగ్ స్టిక్!

ఆయనే స్పెషల్ బ్రాంచి డైరక్టర్ శేషాద్రి.

ఏజంట్స్ గౌరవంగా లేచి నిలబడ్డారు. ఆయన కూర్చోగానే అంతా కూచున్నారు. ఆయన ఓ పర్యాయం అందర్నీ తేరిపార చూశారు.

"ఏజంట్స్!" గంభీరంగా కంచులా ధ్వనించింది యస్.బి.డి. శేషాద్రి కంఠం.

ఎటెన్షన్‌గా వినసాగారు ఏజంట్స్.

"దేశం యీనాడు చాలా గడ్డు పరిస్థితిలో వున్నది. అందుకు మనకొకే వుదాహరణ. మన ప్రియ నేత "ఇందిరాజీ" టెర్రరిజమ్‌కు బలయిపోయారు. ఇంటి దొంగను ఈశ్వరుడయినా పట్టలేడు. తన యింటి కాపలాదారులచే ఘోరంగా "ఇందిరాజీ" హత్య చేయబడ్డారు! యింక బయట శత్రువు లెంతమంది వున్నారో వూహాతీతం!

అందుకే దేశం—దేశాధిపతులకు భద్రతా చర్యలు కట్టుదిట్టం చేశారు.

అయినా పక్కనున్నవాడిని నమ్మలేకపోతున్నాం.

ఎవరు శత్రువో—మిత్రుడో తెలియుటలేదు!

'బోలో భారత్ మాతాకూ జయ్—అన్న వ్యక్తే భారతమాతను వెన్నుపోటు పొడవడానికి సిద్ధమవుతున్నాడు. డబ్బుకి లాలూచీ పడుతున్నాడు.

మన దేశం పేరు ప్రతిష్టలు అన్ని దేశాలలోను వ్యాపించింది. అందుకు కారకురాలు 'ఇందిరాజీ!'

సస్యశ్యామలమయిన మన దేశాన్ని చూసి కొన్ని చుప్పనాతి దేశాలకు కన్ను కుడుతోంది.

కుళ్ళు పోతుతనం——

అందుకే మన యింటివారిని లోబరచుకుంటున్నారు. డబ్బుతో — పదవుల వాళచూపించి తమవైపు తిప్పు కుంటున్నారు!

అటువంటి వారివల్లనే మనకు ముప్పు యేర్పడుతోంది- యేర్పడబోతోంది!?

అందుకు మనం ఏం చేయాలి?

యీ కార్య సాధన యే ఒకరి వల్లా సాధ్యం కాదు. నలుగురూ కలసికట్టుగా వుంటే సాధ్యం.

కొన్ని వేల చలిచీమలు బలవంతమయిన సర్పాన్ని బాధిస్తాయి.

మనం అల్పహీనులం కాదు. మన శక్తియుక్తులు దేశ దేశాలకు తెల్సును.

అహింసతో స్వాతంత్ర్యం సాధించిన దేశం మనది!

ఆ స్వాతంత్ర్యాన్ని హరిద్దామనుకున్న వారికి బుద్ధి చెప్పాలి.

యీ ఉపోద్ఘాతమంతా దేనికో మీకు కర్థమయి వుంటుంది. నాకొక వర్తమానం అందింది.

అది——

'రేపు—దేశం—దేశాధిపతులు జాగ్రత్త!!!'

"యిదెలా అందిందో కూడా మీకు చెప్తాను" అంటూ యస్.బి.డి. శేషాద్రి కొద్దిసేపు ఆగాడు.

"నాలుగు రోజులనుండి మన యేజంట్ జీరో అత్యవసరమైన పనిమీద వున్నాడు. అతనేం చేస్తున్నాడో యేమిటో కూడా నాకు వార్త రాలేదు.

కాని సుమారు మధ్యాహ్నం దాటిన తర్వాత ఒక వార్త వచ్చింది. దానిని జీజో నాశనం చేయుచున్నాడుట. అతను యెక్కడికో వెళుతూ అతడి భార్యకు చెప్పాడట. రేపు—అంటే 'ఆగస్టు 15 న—దేశం—దేశాధిపతులు జాగ్రత్త.'

యింతే!

దీనినిట్టి రేపు యేదో జరగరాని ఘోరం జరగబోతోందని స్పష్టమవుతోంది. అది మనం కలలో కూడా వూహించకూడదు! జరగకూడదు!

ఆ ఘోర క్రియ కెవరు పాల్పడ్తారో సూచనపూర్వకంగా కూడా తెలియలేదు. ఎవరు కర్తలో వూహించలేము.

ఎలా చేయబూనుకున్నారో వూహాతీతం!

ఏజంట్స్!

యిప్పుడు మనందరిపైన ప్రముఖమైన బాధ్యత నిలిచివుంది. రేపు జరగబోయే ఘటన నాపు చేయాలి?

ఎటువంటి దుస్సంఘటనా జరగకూడదు!

యిప్పటివరకూ నాకు జీజో నుండి మరలా వర్తమానం రాలేదు. అతనెక్కడున్నాడో వూహించలేం. అతని కోసం మనం చేతులు కట్టుకొని కూచోలేం.

రేపు నగరం యెంత హడావిడిగా వుంటుందో తెల్సును. ఆ హడావిడిలో తమ కార్యక్రమానికి ప్రారంభ ముహూర్తం పెట్టుకున్న వారి ఆటలు కట్టించాలి!" అన్నాడు శేషాద్రి.

"యస్ సర్! రేపు ఎటువంటి దుర్ఘటన జరగకుండా మేం చూస్తాం!"

"ఆల్ రైట్. మిగిలిన ఏజంట్స్‌కి వార్త పంపాను.

వారు కూడా త్వరలో రాత్రికి వస్తారు. మీరంతా ఈ ప్రోగ్రాం నిర్ణయించుకోండి. దుండగులను పట్టుకోండి. నేనీలోగా మరో పనిమీద వెళ్తాను. మీ మూమెంట్స్ నాకనుక్షణం తెలియాలి. మీరంతా మీ వద్ద మినీ ఫోన్స్ పెట్టుకోండి ఒకరితో మరొకరికి సంబంధం వుండాలి. మిమ్మలను తిరిగి పంద్రెండు లోపల పిలుస్తాను. మీ యేర్పాట్లు చేసుకుని తిరిగి యిక్కడకు రండి" అంటూ శేషాద్రి చకచక నడుచుకుంటూ బయటకు వెళ్ళిపోయాడు.

## 3

చిర్నవ్వుతో తన ముందు కూచున్నవారిని చూశారు ప్రదాని. హోం మంత్రి, డిఫెన్స్ మంత్రి పక్క పక్కన సోఫాలలో కూచున్నారు. మరోపక్క నున్న సోఫాలో యస్. బి. డి. శేషాద్రి, మరో యువకుడు కూచున్నారు.

"నేను నమ్మలేక పోతున్నాను!...." అన్నారు ప్రధాని.

హోం మంత్రి గొంతు సవరించుకొని యేదో చెప్పబోతూంటే ప్రధాని అడ్డు వచ్చి "మీరే చెప్పండి!" అంటూ శేషాద్రిని అడిగారు.

"నేను పూర్తి బాధ్యత వహించే ధైర్యం లేదు. రేపు ఎటువంటి సంఘటనలు జరుగుతాయో చెప్పలేను. నాకందిన వార్త మంత్రు లిరువురకు చెప్పాను. తర్వాత మిమ్మలను సంప్రదించి తగు చర్య తీసుకుందామని వచ్చాం" అన్నాడు శేషాద్రి; తనకు అందిన వివరాలన్నీ చెప్పిన తర్వాత.

"ఇప్పుడు మీరు చెప్పండి!" అడిగారు ప్రధాని మంత్రు లిరువురతోను.

"మా ఉద్దేశంలో రేపటి కార్యక్రమం రద్దుచేస్తే మంచిది. తగు కట్టుదిట్టమయిన యేర్పాట్లు చేయడానికి యెంత మాత్రం సావకాశంలేదు. మీ రక్షణే మా కర్తవ్యం" అన్నారా మంత్రులు ముక్తకంఠంతో.

ప్రధాని కోపంతో "యూ మీన్—మనం ప్రపంచంలో నగుబాటు చెందాలని మీ అభిప్రాయం. అంతేనా?" అన్నారు.

"సర్ .... మా వుద్దేశ్యం—"

"మీ వుద్దేశ్యం మా ప్రాణాలను రక్షించాలని. కాదనను. రేపు మనం స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు జరుపుకోక పోయినచో మన పరువుప్రతిష్ట లేమవుతాయి? మనల్ని పరాయి దేశస్థులు వేలెత్తి చూపిస్తే సహించగలరా?

అమెరికా, బ్రిటన్‌లలో నాపై జరుగుతూన్న కుట్రలను ఆ యా దేశాలు భగ్నం చేశాయి. మనం గుడ్లప్పగించి టెర్రరిజమ్‌ను తిలాంచాలా!

ఇట్ యీజ్ ఎ షేమ్!

మీరు చేతకాకపోతే ఆ యేర్పాట్లు నేనే చేస్తాను. మీరంతా రాజీనామాలు చేసి వెళ్ళండి" అన్నారు ప్రధాని.

"సర్!" అంటూ యువకుడు లేచాడు.

"సారీ! ఎవరితను?" శేషాద్రిని అడిగారు ప్రధాని ఆ యువకుడ్ని పరిశీలనగా చూస్తూ.

మధ్యవయస్కుడు. సన్నగా వుంటాడు. తీక్షణమైన నేత్రాలు, పొట్టి క్రాపింగ్. మీసాలు లేవు.

"ఇతని పేరు చిన్ని! మా ఏజంట్స్ అందరిలోకి చాకులాంటి యువకుడు. ఇతని కప్పగించిన కార్యాన్ని

పూర్తి చేయడంలో అఖండుడు. ఓటమి ఎరుగని వ్యక్తి. అన్నిటిలోను విజేత! అంతేకాదు ఏజంట్స్ అందరిలోను మినుకు మినుకు మనే స్టార్ — లిటిల్ స్టార్!" అన్నాడు శేషాద్రి.

"ఐ. సీ. ఇతని అభిప్రాయం?"

"నా ఉద్దేశ్యం రేపటి కార్యక్రమం యథావిధిగా జరిగితీరాలి. మార్పుండకూడదు" అన్నాడు లిటిల్ స్టార్.

"నిన్నభినందిస్తున్నాను. నీ ప్రోగ్రాం యేమిటి?"

"ఎన్ని లక్షలమంది ప్రజలున్నా — వారిలోని విద్రోహులను కాలికి పట్టుకోవడమే నా ధ్యేయం. అందుకు నా ప్రాణాలయినా ధారపోస్తాను. మా స్పెషల్ బ్రాంచిలో దేశం కోసం—ప్రాణాలు గడ్డి పోచలా ధారపోసే వ్యక్తు...."

'ధన్! ధన్!! ధన్!?!' బయట బాంబు పేలిన ట్లయింది. అక్కడ కూచున్నవారంతా ఖంగారుగా లేచి నిలబడ్డారు.

లిటిల్ స్టార్ తారాజువ్వలా బయటకు దూసుకొని వెళ్ళాడు. వెనకనే శేషాద్రి, ప్రధాని, మంత్రులు నడిచారు. ఇంటి కాంపౌండులో సైనికులు హడావిడిగా బయటకు పరుగెత్తారు.

ప్రధాని యింటి కాంపౌండుకు బయట రోడ్డుమీద మెటాడోర్ నిప్పుల్లో కాలిపోతోంది. కొంచెం దూరంలో ఓ చెక్కపెట్టె వున్నది!

లిటిల్ స్టార్ వేన్ దగ్గరకు వెళ్ళాడు. వేన్‌లో ఓ వ్యక్తి చనిపోయి వున్నాడు. రోడ్ మీదకు చూశాడు. నిర్మానుష్యంగా వున్నది. ఎవరూ లేరు.

"ఏమయింది....?" లిటిల్ స్టార్ ఓ సైనికుని అడి

గాడు.

"నేను రోడ్ని తిరుగుతున్నాను. బయట వేన్ ఆగింది. ఇక్కడాపేకూడదని, వెళ్ళిపొమ్మని చెప్పాను. ఇంజన్ ట్రబులిచ్చింది వెళ్ళిపోతానన్నాడు. ఏదో పెట్టె బయటపడింది. వేన్ కొంచెం కదిలింది. అంతే—థన్! థన్! మంటూ వేన్లో నుండి మంట లొచ్చాయి" అన్నాడా సైనికుడు.

శేషాద్రి ఫోను చేయడానికి వెళ్ళాడు. లిటిల్ స్టార్ వెంటనే నీళ్ళు తెప్పించే యేర్పాటు చేశాడు. మరో పది నిముషాలలో పోలీస్ వ్యాన్ అక్కడ ఆగింది.

ఛీఫ్స్ అంతా దిగి అక్కడున్నవారికి శాల్యూట్ చేశారు!

ఆరిపోయిన వేన్ దగ్గరకు వెళ్ళాడు లిటిల్ స్టార్. లోపల పరీక్షించాడు. ఐదే ఐదు నిముషాలలో విప్పారిన నేత్రాలతో ప్రధాని ముందు నిలబడ్డాడు.

"పెట్టె తెరవండి?" అన్నారు ప్రధాని.

"ఖంగారుపడకండి. దీనిని డిటెక్టర్తో పరీక్షించండి. తర్వాత కాంపౌండ్లోకి తీసుకొని రండి. అక్కడ చూద్దాం" అన్నాడు శేషాద్రి పోలీస్ ఆఫీసర్స్తో.

"ఈ రోడ్ను క్లోజ్ చేయండి. ఎటువంటి వాహనాలు నాలుగు గంటలవరకూ తిరగకుండా మెసేజ్ యివ్వండి. క్విక్!" అన్నాడు హోం మంత్రి.

బాంబు డిటెక్టర్ కోసం వెళ్ళిన వ్యక్తులు వచ్చారు. ఆ పెట్టెని క్షుణ్ణంగా పరీక్షించారు. పెట్టెలో ఎటువంటి బాంబు లేనట్లు నిర్ధారణ కొచ్చారు.

"దీనిని లోపలకు తీసుకురండి" రక్షణ మంత్రి ఆదే

శించాడు.

కాంపౌండ్ లాన్స్‌లో ప్రధాని, మంత్రులు కూచు న్నారు. అందరి మొహాల్లోను ఆందోళన వ్యక్తమవు తోంది. ప్రస్తుత సంఘటనలోని అంతర్యం అర్థం కాలేదు వారికి.

పెట్టెలో ఏముంది?

వేన్ యెందుకు కాలిపోయింది?? వేన్‌లోని వ్యక్తెవరు? అతనికి పెట్టెకు సంబంధ మేమిటి?

శేషాద్రి ముందు నడవగా పెట్టెను లోపలకు తెచ్చారు సైనికులు. లిటిల్ స్టార్ దగ్గరుండి పెట్టె తెరిపించాడు. లోపలకు చూశాడు.

చటుక్కున వెనక్కడుగు వేశాడు!

శేషాద్రి ఆశ్చర్యంగా లిటిల్ స్టార్‌ను చూసి తను కూడా పెట్టె లోపలకు చూసి తృళ్ళిపడుతూ వెనక్కి వెళ్ళాడు.

పోలీసాఫీసర్సుకు వారిరువురి చేష్టలు అర్థంకాక వారు కూడా పెట్టెలోపలకు చూశారు. రెండు చేతులతోను మొహాలు కప్పుకున్నారు—"హారిబుల్!" అంటూ.

"వాటీజ్ దిస్? ఏముందా పెట్టెలో?" అడిగాడు ప్రధాని.

ఆయన కూడా లేచి పెట్టె దగ్గరకు వెళ్ళారు. అందరి తృళ్ళిపాటుకి—ఆశ్చర్యానికి—ఆ పెట్టెలో యేముందో చూశారు. బాధగా కనులు మూసుకున్నారు.

"సో టెరిబుల్!?"

ఆ పెట్టెలో—

ఓ వ్యక్తి ముడుచుకొని కూచుని వున్నాడు. కాళ్ళు చేతులకు వేళ్ళు లేవు. మొహంనిండా గుండుసూదులు

గుచ్చబడి వున్నాయి. పొట్టలో కత్తులున్నాయ్! తల మీద మేకులు దిగకొట్టబడి వున్నాయ్.

నాలుక బయటకు వేలాడుతూ వుంది. నాలుక పై కూడా సూదులున్నాయి. కనురెప్పలు చెక్కబడ్డాయి.

"ఎవరితను?" అడిగారు ప్రధాని.

"చురుకైనవాడు — రేపటి గురించి వార్త పంపిన వాడు — ఏజంట్స్ అందరిలోను చిన్న తరువాత అతి వంటటివాడు — మా ఏజంట్ జీ... రో —!" రుద్ధ కంఠంతో అన్నాడు యస్. బి. ఐ. శేషాద్రి.

లిటిల్ స్టార్ పిడికిళ్ళు కోపంతో బిగుసుకున్నాయ్. కోపంతో మనిషి నిలువెల్లా వూగిపోసాగాడు. నేత్రాలు అరుణవర్ణం దాల్చి నిప్పులు కురిపించేలా వున్నాయి.

ప్రధాని కొద్దిసేపు మవునంగా నిలబడిపోయారు. ఏం మాట్లాడాలో వారికర్థంకాలేదు.

"డైరెక్టర్!" అంటూ శేషాద్రి భుజాలను తట్టారు ప్రధాని. తరువాత "దేశం కోసం, దేశ క్షేమం కోసం, ప్రధానమంత్రి కోసం యిటువంటి ఏజంట్స్‌ను తయారు చేస్తున్నందులకు మిమ్మల్ని నెంతో అభినందిస్తున్నాను. హేట్సాఫ్ టు యు.

"ఇతను యీ చిత్రహింసలు యెలా భరించాడో — ప్రాణాలను తృణప్రాయంగా భావించాడో — యితన్ని చూస్తే తెలుస్తోంది. దేశ భవితవ్యం కోసం రహస్యాలను దాచడంలో మన ఏజంట్స్ తీసిపోరని జీరో నిరూపించాడు. ఇతని శవానికి ఘనంగా అంత్యక్రియ లేర్పాటు చేయండి. కుటుంబానికి అమూల్యమైన విలువ అందించండి. మిస్టర్ శేషాద్రి! ఐయామ్ ప్రౌడ్ అఫ్ పై

ఏజంట్స్!" అన్నారు ప్రధాని.

"థాంక్స్ సర్!" అన్నాడు శేషాద్రి.

"సర్!" అన్నాడు లిటిల్ స్టార్.

అతనిని చూశారంతా 'ఏమిటన్నట్లు?'

"వేన్ను పరీక్షించాను. అందులో టైం బాంబు వున్నది."

"ఈజిట్!" ఆశ్చర్యంగా అడిగాడు హోం మంత్రి.

"యస్ సర్! వేన్ యిక్కడ పేలేటట్లు, డ్రైవర్ కూడా అందులో మరణించాలని, వేన్ పంపించిన వారి అభిప్రాయం కావచ్చును. ఓ రకం ప్రకారం విద్రోహులు యీ కుట్ర పన్నినట్లు తోస్తోంది."

"యస్ యస్!" అన్నాడు రక్షణ మంత్రి.

పోలీసు అధికారులకు అసలు విషయం అర్థంకాలేదు. నగరంలో తరచు బాంబు సంఘటనలు జరుగుతున్నాయి. కాని ఓ ఏజంట్ను చంపి ప్రధాని యింటి ముందు పడ వేసి వేన్ను కూల్చివేసిన దుండగులు సామాన్యులు కారు.

హోం మంత్రి విషయాలన్నీ పోలీసాఫీసర్లకు చెప్పి ప్రధానిని చూస్తూ "పరిస్థితులు చాలా క్లిష్టంగా వున్నాయి. తెల్లవారితే పాడావిడి" అన్నాడు.

"ఏ పరిస్థితులలోను స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఆగిపోరాదు. రేపు అనుకున్న సమయానికే ఎర్రకోట పై మన జండా ఎగరవేయాలి. తప్పదు. మీ యేర్పాట్లు మీరు కొనసాగించండి" దృఢంగా అన్నారు ప్రధాని లోపలకెళ్తూ.

హోం, రక్షణ మంత్రులు ఒకరినొకరు చూసుకున్నారు. తామేం చెప్పినా ప్రధాని వినరని తెల్సును.

"ఆర్మీ. ఫోర్స్ ఛీఫ్ లను పిలిపించండి" ఆజ్ఞాపించాడు రక్షణ మంత్రి యస్. బి. డి.తో.

## 4

ఏజెంట్ లిటిల్ స్టార్ ప్రధాని యింట్లో నుండి బయటకు వచ్చాడు. రోడ్ పై యింకా వేన్ అలాగే వున్నది. శవాన్ని పోలీసు లెప్పుడో తీసుకొని వెళ్ళారు. వేన్ సమీపంలో నిలబడి అక్కడ కొంచెం సేపు పరీక్షిస్తూ నిలబడ్డాడు.

అనుమానించవలసినదేమీ కన్పించలేదు అతనికి. వేన్ డ్రైవర్ నిస్సందేహంగా టైంబాంబు వలనే మరణించినట్లు నిర్ధారణ కొచ్చాడు లిటిల్ స్టార్. వెనక్కి తిరిగి ప్రధాని యింటి గేటువద్ద నిలబెట్టిన తన స్కూటర్ తీసు వచ్చాడు.

స్కూటర్ లిటిల్ స్టార్‌ను మోసుకుంటూ ముందుకు దూసుకొని పోయింది. ఆలోచన లెన్నో అతనిలో ముసురుకోసాగాయి. తన మిత్రుడు—అనుభవజ్ఞుడు—జీరో యొక్క మరణం అతన్నెంతో కుదిపివేసింది.

జీరో చనిపోయివున్న రూపం కనులముందు మెదిలింది లిటిల్ స్టార్ కు. ఎన్నో చిత్రహింసలు పెట్టి జీరోను చంపారు. సామాన్యు లెవరూ అంతటి బాధలు భరించలేరు.

జీరోకి రేపు దుర్ఘటన జరుగుతుందని ఎలా తెల్సును? శత్రువు కెలా దొరికాడు?

శత్రుస్థావర మెక్కడ?

ఆ శత్రువు యింటివాడా—బయటవాడా!?

స్వదేశీయుడా—విదేశీయుడా?

సందేహ నివృత్తి కావాలంటే ఎలా? జీరో తన

యింటికి యేమయినా వర్తమానం పంపాడా?

స్పెషల్ బ్రాంచ్‌కు పంపమని రహస్యం యింటికి పంపిస్తాడా జీరో! తనను వెన్నంటి వేటాడే శత్రువును తప్పించుకోలేకపోయాడు జీరో.

శత్రువులను జీరోగా చేయడంలో ప్రసిద్ధి పొందాడు జీరో. అటువంటివాడు శత్రువుకే బలయిపోయాడు. కనీసం — స్పెషల్ బ్రాంచికి తన జాడ కూడా తెలియ చేయలేకపోయాడు.

ఎక్కడో — యేదో లోపం వుంది. అందువలననే జరగ కూడని సంఘటన జరిగింది. ఆలోచనలు సాగిస్తూనే లిటిల్ స్టార్ స్కూటర్ పై ముందుకు వెళుతున్నాడు.

విశాలమైన ఢిల్లీ రోడ్ పై స్కూటర్ రాకెట్ వలె దూసుకొని పోతోంది. లిటిల్ స్టార్ గమ్యం ఒక చోటే —

జీరో యిల్లు!

ఆ యింటిని పరిశోధిస్తే కేసుకి సంబంధించిన వివరాలు లభ్యమవుతాయనే ఆశ. ప్రతి కేసులోను క్లూలు వుంటాయి. అవి కంటికి కన్పిస్తున్నా — అశ్రద్ధ చేస్తారు. కారణం అవేమీ కేసు కుపయోగించవని భావన.

గూఢచారిత్వం, నేరపరిశోధన చాలా క్లిష్టమైనవి. ఎన్నో యిబ్బందుల నెదుర్కోవాలి. సాహసకార్యాలు చేయాలి. ఒక్కో పర్యాయం ప్రాణాపాయ పరిస్థితుల నెదుర్కోవాలి.

ధైర్యం. సాహసమే పరిశోధనలకు తోడ్పాటు పడతాయంటే తప్పు. ఎన్నో మెళకువలు, సమయ స్ఫూర్తి వున్న గూఢచారి, పరిశోధకుడు విజయం సాధిస్తాడు.

ఇవన్నీ వున్న జీరో నికృష్టంగా, ఘోరంగా హత్య చేయబడడం లిటిల్ స్టార్ కు బాధ కల్గించింది. బహుశా తాను తప్పించుకోలేని పరిస్థితిలో జీరో వుండి వుంటాడు. అప్పుడే....

ఏదో వాన్ దూకుడుగా స్కూటర్ ను దాటుకుంటూ వెళ్ళడంతో లిటిల్ స్టార్ ఆలోచనల కంతరాయం కలిగింది. వేన్ ను తీక్షణంగా చూశాడు. అదే స్పీడుతో వెళ్ళిపోయింది. తన అనుమానానికి నవ్వుకున్నాడు.

విశాలమైన ఢిల్లీ రోడ్లు ట్యూబ్ లైట్ల కాంతిలో మెరిసిపోతున్నాయి. అటు యిటు వున్న యిండ్లలోని దీపాలు అస్పష్టంగా మిణుకు మిణుకు మంటున్నాయి.

రోడ్లపై సంచారం లేదు. ఎప్పుడో అడపా తడపా ఏ కారో, స్కూటరో ముందు నుండి, వెనుక నుండి వెళ్తున్నాయ్. లిటిల్ స్టార్ కు అనుమానించే సంఘటనలేమీ జరగలేదు.

అసాధారణ సంఘటనలు జరిగితే పరిశోధనలో ముందుకు వెళ్ళవచ్చునని లిటిల్ స్టార్ ఆలోచన. అయితే అనుకున్నవి జరిగితే మనిషి దేముడే!

సుమారు అరగంట తర్వాత ఢిల్లీ శివార్లలో ఓ యింటిముందు స్కూటర్ ఆగింది. అదో చిన్న పెంకుటిల్లు. ముందు గేటు, తోట వగైరా లేవు. చుట్టుపక్కల బంగళా, పెంకుటిళ్ళు—డాబాలు వున్నాయి.

చుట్టూ చూశాడు లిటిల్ స్టార్. యిండ్ల తలుపులన్నీ వేసి వున్నాయి. ఎవరయినా వ్యక్తులు కన్పిస్తారేమోనని చూశాడు. ఫలితం శూన్యం. పెంకుటిల్లుకు యెదురుగా కొంచెం దూరంలో ఓ కిళ్ళీకొట్టు కన్పించింది. అదికూడా కట్టివేసి వున్నది.

లిటిల్ స్టార్ స్కూటర్ ఆపుచేసి తాళం వేశాడు. మెట్లెక్కి తలుపు గొళ్ళెం తట్టబోతూ ఆగిపోయాడు. తలుపుకు తాళంవేసి వున్నది. అయితే — ?

జీరో భార్య యింట్లో లేదా — ?

జీరోకు వివాహమయి యేడాదయింది. ఇంకా పిల్లలు పుట్టలేదు. సాధారణంగా కేంప్ లకు వెళ్తూ జీరో తన భార్యను యింటివద్దనే వుంచి వెళ్తాడు. అటువంటిది యీనాడు జీరో భార్య యెక్కడకు వెళ్ళింది?

ఆమెను పుట్టింటికి పంపించాడా!

లేక ఆమెకుకూడా యేదయినా ప్రమాదం సంభవించిందా? తనకు ప్రమాదం ముంచుకు వస్తూన్నదని తెలిసి, జీరో తన భార్యను సురక్షిత ప్రదేశానికి వెళ్ళమని చెప్పాడా. ఛ్ఛ!

ఎటూ ఓ నిర్ణయానికి రాలేకపోయాడు లిటిల్ స్టార్. తలపంకిస్తూ తను చేయవలసిన పని పూర్తిచేయ సంకల్పించాడు. ముందుగా కర్తవ్యం. ఆ తర్వాతనే మిగిలిన విషయాలు.

జేబులోనుండి కీబంచ్ తీశాడు. రెండు మూడు పర్యాయాలు తాళం తెరవడానికి ప్రయత్నించాడు. మూడో సారి తాళం క్లిక్ మంటూ తెరచుకున్నది.

చప్పుడు లేకుండా తలుపులు తెరచి చటుక్కున లోపలకు దూరి తిరిగి తలుపులు వేశాడు. చీకటిగా వుంది. ఏమీ కన్పించలేదు లిటిల్ స్టార్ కు. ఓ పక్కన లైటు స్విచ్ వుంటుందని తెల్సును. అది వేద్దామనుకున్నాడు. కాని ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

కారణం —

లైటు వెలుతురు బయటకు వెళ్తుంది. ఎవరయినా

పక్కింటి మనుషులు వెలుతురు చూస్తే లేనిపోని అనుమానాలకు ఆస్కారమవుతుంది. సాయంత్రంవరకు యింట్లో లేని దీపాలు యిప్పుడు వెలిగితే లేనిపోని చికాకులు.

లిటిల్ స్టార్ జేబులోని పెన్ టార్చి తీశాడు. చుట్టూ వేశాడు. అది చిన్న హాలు. ఓ పక్కన గది. హాలు నానుకొని మరో గుమ్మం వుంది. హాలుని టార్చి వెలుతురులో పరిశీలనగా చూశాడు.

ఓ వైపు సోఫా సెట్. దాని యెదురుగా చిన్న బల్ల. బల్లపై నీళ్ళ జగ్. మరో వైపున డ్రాయింగ్ టేబులు, కుర్చీ వున్నాయి. టేబుల్ మీద టెలిఫోను, ఏవేవో పుస్తకాలు, యింక్ పెన్ స్టాండు గోడలపై సీనరీల ఫోటోలు.

గది వున్న వైపు నడిచాడు లిటిల్ స్టార్. చీమ చిటుక్కుమంటే విన్పించేటంతటి నిశ్శబ్దం. తన అడుగుల ధ్వని తనకే విన్పించనంతగా నడిచాడతను.

గది గుమ్మం తలుపు వేసి వున్నది. గొళ్ళెం వున్నదేమోనని చూశాడు. లేదు. తలుపులు త్రోశాడు. టార్చి వేసి లోపలకు చూసి నిర్ఘాంతపోయాడు!

చేతిలోని టార్చి నేలమీద పడిపోయింది. వంగుని తిరిగి దానిని తీసి వెలిగించి మరలా ముందుకి చూశాడు తానేమయినా పొరబాటుగా చూశానని!

సందేహం లేదు!

పొరబాటు పడలేదు!!

గదిలో డబుల్ కాట్ మంచం. తెల్లటి దుప్పటి నిండుగా పరచి వుంది. దుప్పటంతా నెత్తురుమయం. ఆ దుప్పటిమీద నెత్తురు మధ్యలో —?

పూర్తి నగ్నంగా ఓ యువతి!

గుండెల్లో పొడవైన కత్తి!?

రెండు చేతులు అటు ఇటూ చాపి వున్నాయి. కాళ్ళు కూడా అదే రీతిలో వున్నాయి. మొహంలో భయ చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తున్నాయ్!

లిటిల్ స్టార్ గోడనున్న స్విచ్ నొక్కాడు. గదంతా వెలుతురు నింపింది. గదిలో మరోపక్కనున్న చీర తీసుకొని ఆమె వంటిపై కప్పాడు. ఆమెను చూశాడు.

ఆమె బలంగా కనురెప్పలు పైకెత్తి లిటిల్ స్టార్‌ను చూసి యేదో చెప్పబోయింది. ఆమె నాడిని చూశాడు లిటిల్ స్టార్. బలహీనంగా కొట్టుకుంటోంది. యింక మరికొద్ది నిమిషాలే ఆమె జీవిస్తుందనుకున్నాడతను.

"సిస్టర్ యేమయింది?" ఆతృతగా అడిగాడతను.

నోరు విప్పలేకపోయిందామె. ఓ చేతిని పైకెత్తబోయి నిస్సహాయంగా క్రిందికి వాల్చేసింది. తలను అటు ఇటూ కదిపింది. తలక్రిందనున్న జుట్టు సిగ ఆటంకంగా వున్నట్లు తలాడించింది లిటిల్ స్టార్‌ను చూస్తూ.

"నీకేం పర్వాలేదమ్మా. చెప్పు? నిన్ను హత్య చేసిం దెవరు?" అంటూ ఆమె తలను పైకెత్తి జుట్టు సిగ ముడి విప్పాడు లిటిల్ స్టార్.

ఏదో కాగితం సిగలో నుండి మంచంపై పడింది. అది లిటిల్ స్టార్, ఆమె కూడా చూశారు. ఆమె మొహంలో చిన్న నవ్వు, కాంతి కన్పించాయప్పుడు లిటిల్ స్టార్‌కు. తలపంకించాడతను.

వెనువెంటనే ఆమె తల వాల్చేసింది!

ఆమె మరణించింది??

ఆమె—శీలా భార్య.

దేశ రక్షణ కోసం భార్యాభర్త లిరువురు ప్రాణా

లొంగాడు. వారిరువురూ త్యాగధనులు. ఈమెనింత దారుణంగా హత్యచేసిన హంతకుడిని వేటాడి పట్టి బంధించాలి. తగిన శిక్ష వేయాలి. అప్పుడే యీమె ఆత్మకు శాంతి కలుగుతుంది.

## 5

ఉలిక్కిపాటు చెందాడు లిటిల్ స్టార్. కారణం—

జీకో భార్య మరణించి కొద్ది నిమిషాలే అయింది. అంటే—ఆమెను చంపిన హంతకుడు పారిపోయో, లేక యీ యింట్లోనే ఉండివుండవచ్చును.

ఆ ఆలోచన రాకడం తరువాయి చెవులు నిక్కరించాడు లిటిల్ స్టార్. అతనివి పాము చెవులు! ఇంట్లో ఎక్కడా ఎటువంటి చప్పుడూ విన్పించలేదు. అయితే పారిపోయాడా?

లేక తనను చావు దెబ్బ తీయడానికి దాగివున్నాడా! అయితే ఎక్కడ? యీ గదిలో ఎక్కడా లేదు. మరో గదిలో వున్నాడా? వీధి గుమ్మం తలుపు తాళం వేసి వున్నది. అటు పారిపోవడానికవకాశం లేదు. ఇంట్లో లేడు?

మరేమయ్యాడు? గాలిలో మాయమయ్యాడా?

జేబులోని పిస్టల్ తీసి చేతిలో కండిషన్ లో వుంచుకున్నాడు. ఆ గదిలోనుండి బయటకు కదిలాడు. హాలులో తేరిపార చూశాడు. దాక్కోడానికక్కడ ఎటువంటి అలమర వగైరా లేవు.

హాలునానుకొని వున్న మరో గదివైపు వెళ్ళాడు లిటిల్ స్టార్. తలుపులు త్రోసి లోపలకు చూశాడు. రెండో చేతితో పెన్ టార్చి వెలిగించి.

అది వంటగది. దానిని చేర్చి మరో గుమ్మం వుంది. బహుశా అది వీధివైపు రెండో మార్గం కావచ్చును.

అదికూడా గడియవేసే వున్నది.

లిటిల్ స్టార్ రోమాలు నిక్కబొడిచాయి. త్రాచు పాములా బుసకొట్టాడు. వాసన చూస్తూన్నట్లు చూస్తూ తిరిగి హాలులోకి వచ్చాడు.

ఎవరూ కన్పించలేదు!?

వండర్!

వేసిన తలుపులు వేసినట్లున్నాయి. జీరో భార్యను చంపిన వ్యక్తి మాయమయ్యాడు.

యిదెలా సాధ్యం?

బహుశా పడక గదిలో మంచంక్రింద—

చటుక్కున అటు కదిలాడు లిటిల్ స్టార్ పిస్టల్ గురిపెట్టి వుంచి. గుమ్మం వద్ద నిలబడి లోపలకు మంచం క్రిందకు చూశాడు లిటిల్ స్టార్.

అంతే!—

లిటిల్ స్టార్ ముందుకి బోర్లా పడబోయాడు. నిల దొక్కుకుంటూ ముందుకి వెళ్ళి చటుక్కున వెనక్కి తిరిగాడు.

ఎదురుగా ఓ మనిషి నిలబడి వున్నాడు. చేతిలో పిస్టల్. సన్నగా పొడుగ్గా వున్నాడు. చింపిరి జుత్తు. మొహంమీద కత్తిగాటు. నెత్తుటి నేత్రాలు! మనిషి సన్నగా వున్నా బలం నరాల్లో వున్నట్లున్నది.

"చేతులెత్తి నిలబడు. పిచ్చిపిచ్చి వేషాలువేస్తే పిచ్చి కుక్కను కాల్చినట్లు కాల్చిపారేస్తా" అన్నాడతను.

ఆ వ్యక్తి పిస్టల్ పట్టుకున్న తీరు గమనించాడు లిటిల్ స్టార్. గురితప్పకుండా పిస్టల్ పేల్చడంలో అఖండుడిగా తోచాడు లిటిల్ స్టార్ కు.

తన అనుమానం నిర్ధారణయింది. రక్తం రుచి చూచిన

పులి గుహ వదలి పోలేదు. గుహలో నే దాని చావు రాసి పెట్టి వుంటే ఎలా పోతుంది. గురిచూసి వాడియైన దెబ్బ కొట్టాలా వ్యక్తిని. ఎలా? ఎటు కదిలినా పిస్టల్ పేలేలా వుంది. యే విధంగా ఆ వ్యక్తిని బోల్తాకొట్టించాలి? లిటిల్ స్టార్‌లో ఆ సమయంలో యే పథకం వేసుకో డాని కవకాశం చిక్కలేదు.

"ఎవరున్నవ్? నన్ను చంపితే నీకు లాభం?" చిన్నగా అడిగాడు లిటిల్ స్టార్. మాటల్తో అతన్ని బురిడీ కొట్టించాలి.

బిగ్గరగా నవ్వాడా వ్యక్తి.

"నేనెవర్నా? ఫాక్స్‌ను! జిత్తులమారి నక్కను. యిక నిన్ను చంపితే లాభమా—? ఫూల్‌లాగ మాట్లాడకు. నువ్వెవరో నాకు తెల్సును. నిన్ను చంపినట్లు మా బాస్‌కు చెపితే—ఓహ్! నాకు విలువైన బహుమానం. యింకా అర్థం కాలేదా?" అన్నాడు ఫాక్స్.

"నన్ను చంపితే లాభమా?" ఆశ్చర్యంగా అడిగాడు లిటిల్ స్టార్. తనెవరో అతనికి తెలుసా?

"అవును. నువ్వో స్పెషల్ బ్రాంచ్ యేజంటువి. నీ పేరు నాకు తెలియకపోయినా — నువ్వు స్పెషల్ బ్రాంచ్‌లో ఎటువంటి స్థానంలో వున్నావో విన్నాను. నువు కన్పిస్తే కాల్చి చంపమని మా బాస్ ఆర్డర్. షూట్ ఎట్ సైట్!" వికటంగా నవ్వుతూ చెప్పాడు ఫాక్స్.

బలంగా ఊపిరి పీల్చాడు లిటిల్ స్టార్.

"షూట్ ఎట్ సైట్!" రెండు మూడు పర్యాయాలు అదే మాట తనలో గొణుక్కున్నాడు. తనను కాల్చి చంపమని ఉత్తర్వులిచ్చిన దేశమేమిటో తనకు తెల్సును. అందుకు నియమించబడ్డ విదేశీ గూఢచారి పేరు కూడా

తెలుసును.

అతను—ఈగిల్!

అతన్ని పట్టుకోవడానికే చాలా పర్యాయాలు ప్రయత్నాలు చేశాడు. తనను చంపడానికికూడా ఈగిల్ ప్రయత్నలోపం లేకుండా కృషిచేశాడు. అప్పుడు తన పేరు చిన్ని! లిటిల్ స్టార్ గా ఆ తర్వాత యస్. బి. డి. శేషాద్రి మార్చారు.

ఈ కథలో ఈగిల్ ప్రవేశించాడన్నమాట! తన సహచరుడయిన జీరో, అతని భార్యను చంపించింది ఈగిల్! రేపటి దుష్కృత్యాలకు కారకుడు ఈగిల్! తన దేశం తరఫున భారతదేశానికి అపకారం తలబూనిన చీడ పురుగు. చంద్రుణ్ణి మింగిన రాహువు!

"పొరబడుతున్నావు. నేను...."

లిటిల్ స్టార్ మాటలకడ్డు వచ్చి "పొరబడడం మా బాస్ జాతకంలో లేదు. జాతకం చూడకుండా భవిష్యత్ చెప్పడంలో మా బాస్ అగ్రగణ్యుడు. నీకు నూరేళ్ళు నిండాయి. నీ యిష్టదైవాన్ని ప్రార్థించుకో" అన్నాడు ఫాక్స్.

తన మాట ఫాక్స్ వినడనుకొన్నాడు లిటిల్ స్టార్. తన చేతిలో కూడా పిస్టల్ వుంది. కాని చేతిని దింపి పేల్చడానికి వీలులేదు. ఈలోగా ఫాక్స్ పేల్చవచ్చు.

"నన్ను నమ్మకపోవడం నా దురదృష్టం. నీ యిష్టం" అంటూ కనులు మూసుకొని ఓరగా చూశాడు లిటిల్ స్టార్.

గర్వంగా నవ్వుతున్నాడు ఫాక్స్. యీరోజు బయల్దేరిన వేళ మంచిది. జీరో భార్యను చంపాడు లిటిల్ స్టార్ను చంపబోతున్నాడు. తన బాస్ తనను అమితంగా

మెచ్చుకుంటాడు.

"మిస్టర్ నువు ఈమె దగ్గరనుండి తెల్సుకున్న రహస్య మేమిటి? చావబోతూ నీకేం చెప్పింది?" అడిగాడు ఫాక్స్.

లిటిల్ స్టార్ లోలోన నవ్వుకున్నాడు. తన ఊహ కరెక్టు! ప్రతిగూఢచారి ఈగిల్! సందేహంలేదు.

"నథింగ్. నేను లోపలకు వచ్చేసరికి చనిపోయి వున్నది. నాకేం చెప్పలేదు" అన్నాడు లిటిల్ స్టార్.

"షట్!" గాండ్రించాడు ఫాక్స్. కోపంగా పిస్టల్‌ను గాలిలోకి పేల్చి "టెల్ ది ట్రూత్" అన్నాడు.

"నిజమే."

"సో — గెట్ రడి ఫర్ డెత్" అంటూ పిస్టల్ ట్రిగర్ నొక్కాడు లిటిల్ స్టార్ గుండెలకు గురిచూసి.

కెవ్వున అరుస్తూ నేలకూలాడు లిటిల్ స్టార్. బిగ్గరగా అరుపు! నేలకూలుతూనే లిటిల్ స్టార్ తన చేతిలోని పిస్టల్‌కు పని కల్పించాడు. కాని — అది గురి తప్పి 'టప్'మంటూ బల్బు పేలిపోయింది.

చీకటి!

వేగంగా దొర్లుకుంటూ లిటిల్ స్టార్ గది గుమ్మంవద్ద నిలబడివున్న ఫాక్స్ కాళ్ళను గట్టిగా గుంజాడు. అది ఉడుం పట్టు. దానిని తప్పించుకోవడానికెవరికీ సాధ్యం కాదు.

ఎదురుచూడని సంఘటన! ఫాక్స్ నిలదొక్కుకోలేక పోయాడు. దభీమంటూ చతికిల పడ్డాడు. ఆ పడడంలో ఫాక్స్ చేతిలోని పిస్టల్ జారిపోయింది.

లిటిల్ స్టార్‌వి గుడ్లగూబ కళ్ళు. చీకటిలో నల్ల

పూసను వెదకి తీయడంలో నేర్పరి. హుషారుగా లేచాడు లిటిల్ స్టార్. కాలితో ఫాక్స్ గుండెల్ని తొక్కి పెట్టాడు. పెన్ టార్చి ఫాక్స్ మొహంమీదకు వేశాడు.

"ఏరా! నువ్వు జిత్తులమారి నక్కవా!" అంటూ రెండో కాలితో ఫాక్స్ మొహాన్ని బలంగా తన్నాడు.

బాధగా అరిచాడు ఫాక్స్.

"నన్ను చంపితే నీకు అమూల్యమైన బహుమతి అభిస్తుందా! రేయ్! నేనిచ్చే బహుమతులు ముందుగా తీసుకోరా. ఆ తర్వాత నువ్వు నీ బాస్‌ను చూడగలిగితే బహుమతులు తీసుకోవచ్చును" అంటూ గుండెలమీది కాలు తీసి ఫాక్స్ తొడలను గట్టిగా నొక్కాడు.

భరించలేని బాధ! ప్రాణాలు తోడుకుపోయేలా వుంది.

"ప్లీజ్ నన్ను వదులు" వేడుకొన్నాడు ఫాక్స్.

లిటిల్ స్టార్ అతన్ని నిలబెట్టి "ఊ చెప్పు? నీ బాస్ సాకర మెక్కడ? యింకా అనుచరులెంతమంది? అతనికెవరయినా సహాయం చేస్తున్నారా?" అడిగాడు.

"నన్నా విషయాలు తప్ప మరేమయినా అడుగు. నేను చెప్పినట్లు తెలిస్తే చంపేస్తారు."

"చెప్పకపోతే నేను చంపుతాను. క్విక్. టకటక జవాబులు చెప్పు?" అంటూ పిస్టల్ ఫాక్స్ నుదుటికి గురిపెట్టాడు లిటిల్ స్టార్.

ముందు నుయ్యి—వెనుక గొయ్యి పరిస్థితి అయింది ఫాక్స్‌కు. తప్పించుకోడానికి మార్గంలేదు. జవాబు చెప్పలేని పరిస్థితి!

"ప్లీజ్—"

"నో ప్లీజ్. నువ్వు జవాబు చెప్పితీరాలి. లేనిచో

నీతో యెలా నిజాలు పలికించాలో నాకు తెల్సును. అప్పుడు నువ్వు కుక్క కన్నా హీనంగా చస్తావ్!"

"అయితే నాకు ప్రమాదం రాకుండా కాపాడ గలవా?" అడిగాడు ఫాక్స్.

"ష్యూర్" లిటిల్ స్టార్ మాటలు పూర్తికానే లేదు. 'టప్ _టప్!' మనే పేలుడు విన్పించింది.

ఫాక్స్ అరుస్తూ కూలిపోయాడు!

లిటిల్ స్టార్ అప్పుడు చూశాడు గదిలోని కిటికీ వైపు. అక్కడనుండే పిస్టల్ పేలుడు విన్పించింది. చీకట్లో పేల్చిన గుండు తాము కువురలో యెవరికి తగిలినా అతనికి లాభమే!

మరింక ఆలోచించలేదు లిటిల్ స్టార్. పరుగున వెళ్ళి వీధి గుమ్మంవద్ద నిలబడ్డాడు. తలుపు తెరవబోయాడు. కాని తెరచుకోలేదు.

శత్రువు తమను లోపల బంధించాడు. అప్పుడు వేశాడు హాలులో దీపం. టెలిఫోను చూశాడు.

వైర్ కట్ చేయబడి వున్నది. ఐదు నిమిషాలలో తిరిగి ఆ వైర్లను కలిపి రింగ్ చేశాడు లిటిల్ స్టార్.

"హాలో .... యస్ .... స్పీకింగ్!" అంటూ అవతల వైపునుండి మాట్లాడే వ్యక్తితో యస్.బి.డి.ని పిలవ మన్నాడు. లైన్లో అలాగే ఉన్నాడతను.

"యస్ సర్. నేనే సర్" అంటూ జీరో యింట్లో సంఘటనలు చెప్పి "వెంటనే యిక్కడకు రండి" అన్నాడు లిటిల్ స్టార్.

ఈగిల్ చాలా పెద్ద ఎత్తులో తన కార్యక్రమాలు కొనసాగిస్తున్నాడు. వ్యవధి తక్కువ. లిటిల్ స్టార్కు యేదో గుర్తుకు వచ్చింది. జీరో భార్యనుండి సంపాదించిన

కాగితం—?

వెలుతురులో ఆ కాగితాన్ని విప్పాడు. అదో ఉత్తరం. లిటిల్ స్టార్ దానిని చదివాడు. అందులో—

"డియర్—

నీకీ మధ్య రెండు విషయాలు గురించి ఆందోళన యెక్కువవుతూన్నట్లు స్పష్టమవుతోంది. వాటికి నేను ఒక పరిష్కార మార్గాన్ని సూచిస్తున్నాను.

ఒకటి—

విజయదశమి తర్వాత, నాగమ్మ అత్తయ్య గారి ట్లో, యమునను కలశమును, కరణంను పిలుచు కొచ్చి, రాజీ బేరం కొనసాగించు. ఉత్తరం వెంటనే రాయించు.

రెండు—

ఇంట్లో చేరిన నవగ్రహాలకు తోడు దశమ గ్రహాన్ని కూడా పిలిచి పంచపాండవుల ఐదుగుర సోదరిలకు త్రిమూర్తి తమ్ముల నిచ్చి వివాహం చెయ్.

వుంటాను—

మిత్రుడు

—జీరో."

నాలుగైదు పర్యాయాలు ఉత్తరాన్ని చదివాడు దీక్షగా లిటిల్ స్టార్. అంత భద్రంగా జీరో భార్య దాచిందంటే దానిలో యేదో రహస్యం యిమిడి వుంటుంది.

ఏమిటది?

ఎలా తెలుసుకోవడం!

ఆలోచనలో వున్న లిటిల్ స్టార్‌కు గుమ్మం బయట అడుగుల చప్పుడు వినిపించింది.

"తలుపులు తెరచి లోపలకు రండి సార్!"

యస్ బి. డి. శేషాద్రి లోపలకు వచ్చి "వాట్ హేపెండ్?" అని అడిగాడు.

లిటిల్ స్టార్ వివరాలన్నీ చెప్పి "ఈ లెటర్ డీకోడ్ చేయించండి. రేపటి కార్యక్రమంలో మనం చేయవలసినది...." అంటూ కొన్ని విషయాలు చెప్పాడు.

"నాకు కొన్ని అనుమానాలున్నాయ్. అవి ఈలోగా నివృత్తి చేసుకుంటాను. ఎట్టి పరిస్థితులలోనయినా మిమ్ములను తెల్లవారుజాము లోపు కలుస్తా."

"విష్ యు గుడ్ లక్" అన్నాడు శేషాద్రి.

"నా కోడ్ నేమ్ ...మీ పేర్లు ఉపయోగిద్దాం. శత్రునాయకుడు దేవాంతకుడు. జై-జై లెటర్ డీకోడ్ చేయించటంలో జాప్యం చేయించవద్దు" అంటూ లిటిల్ స్టార్ శేషాద్రి వద్ద సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

స్పెషల్ బ్రాంచ్ డైరక్టర్ ఫోనందుకొన్నాడు పోలీసులను పిలవడానికై.

## 6

స్కూటర్ రాకెట్ లా దూసుకొని పోతోంది.

లిటిల్ స్టార్ లో ఆలోచనలు ముమ్మరంగా వున్నాయి. పదే పదే జీరో యింట్లో చూసిన లేఖ మదిలో మెదలుతోంది.

సందేహం లేదు. లేఖలో రహస్యంగా యేదో వార్త జీరో యిమిడ్చాడు. ఏమిటది? అది తెలుసుకుంటే రహస్యం బయటపడుతుంది.

ఏదో లారీ తన వెనుక వస్తున్నట్లు గమనించాడు లిటిల్ స్టార్. చాలా స్పీడుగా వస్తోంది. ముందుకు

చూశాడు లిటిల్ స్టార్. మరో లారీ గడ్డితో వెళ్తోంది.

ముందు వెనకలు లారీలు!

మధ్యలో లిటిల్ స్టార్ స్కూటర్‌లో వెళుతున్నాడు. వెనుక లారీ తనను తప్పించుకొని వెళ్ళకపోవడంతో లిటిల్ స్టార్‌లో అనుమానం మొలకెత్తింది.

ముందు లారీని పాస్ చేసుకొని పోదామనుకున్నాడు లిటిల్ స్టార్. అయితే ఆ లారీ కూడా దుండగుల దని వచ్చింది.

నో డౌట్! వెనక లారీ శత్రువులది. అతని వూహను ధృవపరుస్తూన్నట్లు 'టప్, టప్' మంటూ పిస్తోలు గుళ్ళు లిటిల్ స్టార్ వెనుకపడ్డాయి.

లారీ మరింత స్పీడుగా వస్తోంది. రోడ్ పై మరే యితర వాహనాలు రావటం లేదు. ఏం చేయాలి? లారీలో యెంతమంది వున్నారో! తను స్కూటర్ ఆపి లారీలోని వ్యక్తుల్ని యెదుర్కోడానికి సమయంలేదు.

లారీ వేగంగా వచ్చి స్కూటర్‌ను గుద్దుకొన్నది.

అది వూహించిన లిటిల్ స్టార్ స్కూటర్‌ను వేగంగా పోనిస్తూ ఒక్క హైజంప్ చేస్తూ ముందు లారీ లోని గడ్డిలోపడ్డాడు. నెమ్మదిగా ఊపిరి పీల్చుకున్నాడు. వెనుక లారీని చూశాడు.

అదే వేగంతో లారీ వస్తోంది!

తనను అంతం చేయడం లారీలోనివారి ధ్యేయం. వారిని తప్పించుకోవాలి. గడ్డిలో దొర్లుతూ బయటకు చూశాడు. ఏవేవో బిల్డింగులు కన్పించాయి. లారీ పక్కగా వెళ్తోంది.

లారీలో లేచి నిల్చున్నాడు లిటిల్ స్టార్. ముందు వెనుక లాలోచించలేదు. ఓ గేటులోకి దూకాడు. దొర్లు

ఉంటూ పక్కకు వెళ్ళి పడ్డాడు.

తనో హోటల్ కాంపౌండ్‌లో వున్నట్టు గ్రహించాడు లిటిల్ స్టార్. నెమ్మదిగా లేచి అడుగులు వేసుకుంటూ హోటల్ పేరు చూశాడు.

"హోటల్ స్టెయిల్!"

హోటల్ లోపలికి నడిచాడు లిటిల్ స్టార్. డే అండ్ నైట్ హోటల్ అది. అన్నిరకాల సౌకర్యాలూ అందులో వున్నాయి. ఆ హోటల్ గురించి లిటిల్ స్టార్ ఇదివరలో విన్నాడు.

దాని ప్రొప్రయిటర్ వినాయకరావు. ఢిల్లీలో పరపతి కలిగిన వ్యక్తి. రాజకీయ నాయకులతోను, పుర ప్రముఖులతోను సంబంధ బాంధవ్యాలు వున్నాయతనికి.

లిటిల్ స్టార్ చుట్టూ చూశాడు, తనను వెంబడించి హోటల్లో కెవరయినా వచ్చారేమో ననే అనుమానం. టేబుల్స్ ముందు రకరకాల మనుషులు కూచునున్నారు. ఎవరూ తనను గమనించలేదని నిర్ణయించుకున్నాడు లిటిల్ స్టార్.

తన కార్యక్రమానికి అంతరాయం కలిగినందుకు చింతించాడు లిటిల్ స్టార్. ఎస్. టి. డి.కి ఫోను చేద్దామనే ఉద్దేశంతో మేనేజరు దగ్గరకు వెళ్ళి, ఫోను అడిగాడు.

ఫోను డయల్ చేస్తూ ఆగిపోయాడు లిటిల్ స్టార్. ఎందుకో? తెలివితక్కువగా యిక్కడ నుండి ఫోనులో మాట్లాడటం తన గుట్టును బయట పెట్టుకోవడమే. అక్కడ మరింక వుండలేదు.

ఏవో ఆలోచనలు 'మినుకు మినుకు' మంటున్నాయ్!

# 7

రాత్రి ఒంటిగంట దాటింది!

విజంటీ లిటిల్ స్టార్ పెద్ద భవంతి ముందు ఆగాడు. అది రెండంతస్తుల భవంతి. గేటు ముందెవ్వరూ లేరు. గేటు గెంతి లోపలకు దూకాడు లిటిల్ స్టార్.

భవనం వెనుకకు వెళ్ళాడు. ఓ పక్కన నీటిగొట్టం వుంది. దానిని పట్టుకొని పై అంతస్తు కెళ్ళాడు. పొడుగ్గా నడవా! చప్పుడు చేయకుండా నడవసాగాడు. ఏదో అనుమానం అతన్ని పీడిస్తోంది. తన అనుమానం నిజమవుతుందని నమ్మకం.

ఎక్కడా అలికిడి విన్పించటంలేదు. ఓ గదిలోకి వెళ్ళాడు. ఎందుకో ఆ గది విచిత్రంగా కన్పించింది. ఓ బల్లమీద టి.వి. తప్ప గదిలో మరేం లేవు.

టి.వి. చూడడానికి ఆ గది వుపయోగిస్తున్నట్లు కన్పిస్తోంది. గోడలకు పెయింట్స్. చెవులు గోడల కాన్చాడు లిటిల్ స్టార్. ఎక్కడో మాటలు విన్పించాయి.

అప్పుడు కనిపెట్టాడు నేలభాగం నుండి వస్తున్నాయి మాటలు. చేతులతో తడమసాగాడు లిటిల్ స్టార్. ఓ చోట చిన్న పలకలాంటిది కన్పించింది. పక్కకు కొద్దిగా తొలగించాడు. లోపలకు తొంగిచూశాడు.

ఎవరో వ్యక్తి నిలబడ్డాడు లోపల. మాటలు ఈ సారి స్పష్టంగా విన్నాడు లిటిల్ స్టార్.

"మన పథకం తెల్లవారేసరికి ప్రారంభమవుతుంది. మిస్టర్ ఈగిల్! నీవు కోరినట్లు ప్రధాని ప్రోగ్రాం యిచ్చాను. ఆయన ఏ యే మార్గంలో ఎర్రకోటకు వెళ్ళి తిరిగివస్తారో చెప్పాను. కాబట్టి ఆయన ఎర్రకోట నుండి వెనక్కి వచ్చేటప్పుడు వారిపై బాంబింగ్ చేయించు

కనాట్ ప్లేస్ అన్ని విధాలా అనుకూలం. అక్కడ నీ అనుచరులు ఇరవైమందిని బాంబులతో సిద్ధంగా వుండ మను. ప్రధాని ఆ ప్రదేశానికి రాగానే బాంబులు వేయించు. ఆ విధంగా ఆయన అంతమవుతారు.

"ఆయన మరణానికి కూడా కారకులు టెర్రరిస్టులని ప్రభుత్వం భావిస్తుంది. మీ దేశాన్నెవరూ అనుమానించరు. విచారసాగరంలో వున్న భారతదేశంమీద అదే సమయంలో మీ దేశాన్ని దండయాత్ర చేయించు. వెన్నుపోటు పొడిపించు. భారత్‌ను పోక చెక్కలా చేసెయ్."

"థాంక్స్! నువు మాకిచ్చిన సహకారాన్ని నేను, మా దేశం మరచిపోం. భారతదేశం మా వశమవగానే నీకో ఉన్నత పదవి యిస్తాం" అన్నాడు ఈగిల్.

"గుడ్! తెల్లవారేవరకు నువ్వు, నీ అనుచరులూ యిక్కడే వుండండి. బయట యిప్పటి నుండి తిరిగితే ప్రమాదం రావచ్చును. ఈ లోగా నేనో పర్యాయం బయటకు వెళ్ళి ఓ గంటలో వస్తాను...." అన్నాడా వ్యక్తి.

లిటిల్‌స్టార్ చటుక్కున అక్కడ నుండి లేచి పలక మూసివేసి గబగబ ఆ గదిలో నుండి బయటకు వెళ్ళిపోయాడు. ఏం చేయవలసినది నిర్ణయానికొచ్చాడు. రెండవ వ్యక్తికూడా లిటిల్‌స్టార్ వూహించాడు.

తెల్లవారుజామున నాలుగు గంటల ప్రాంతంలో ఆ భవనం ముందు రెండు పోలీసు వేన్లు, జీపులు ఆగాయి. అందులో నుండి బిలబిల మంటూ పోలీసులు దిగి భవనాన్ని చుట్టుముట్టారు—చీమనయినా బయటకు పోనీయకుండా.

జీపుల నుండి దిగిన యస్. బి. డి. శేషాద్రి, ఏజంట్ లిటిల్ స్టార్ పోలీస్ ఇన్ స్పెక్టర్లూ భవనం తలుపులు బ్రద్దలుకొట్టి లోపలకు దూరారు. ముందు లిటిల్ స్టార్ దారితీయగా వెనుక పోలీసులు బయలుదేరారు.

గదిలో ప్రవేశించి పలక తొలగించి, అంతా లోపలకు వురికారు. గదిలో వున్న ఈగిల్, అతని అనుచరులు ఖంగారుగా దిక్కులు చూడసాగారు. మరో మూల నిలబడి వున్నాడు భవనం యజమాని తలొంచుకొని.

"సరెండర్!" అరిచాడు ఇన్ స్పెక్టర్ గాలిలోకి పిస్టల్ పేల్చి.

నిందితులను బంధించి బయలుదేరారు శేషాద్రి, లిటిల్ స్టార్ వగైరా. నిందితులతో జీపు ఎక్కాడు ఈగిల్ తో పాటు అతనికి తోడ్పడిన భారతదేశపు దేశద్రోహి—స్టెయిల్ హోటల్ యజమాని—వినాయకరావు!?!

• • •

ఐదు గంటలు అయింది.

ప్రధాని తన యెదురుగా నిలబడి వున్న శేషాద్రి, లిటిల్ స్టార్ లను ప్రశంసాపూర్వకంగా చూశారు.

"గుడ్ వర్క్. అతి స్వల్ప వ్యవధిలో, కొన్ని గంటల్లో దేశద్రోహులను ప్రభుత్వానికి అప్పగించినందుకు మీ స్పెషల్ బ్రాంచిని అభినందిస్తున్నా. ప్రత్యేకంగా లిటిల్ స్టార్ ను అభినందిస్తున్నా. వినాయకరావునెలా అనుమానించారు?"

"జీరో రాసిన లేఖలో వినాయకరావు పేరుని, అతని టెలిఫోను నెంబరును వుదహరించాడు. ఆ లేఖలో—మొదటి అక్షరం తర్వాత ప్రతీ తొమ్మిదవ అక్షరం—అంటే కామా తర్వాత అక్షరం కలిపి చదివితే మనకు

వినాయకరావు పేరు వస్తుంది. అలాగే రెండో పేరాలో వుదహరించిన పురాణ పురుషులకు నెంబర్లు వేసుకోవాలి. అంటే—

నవగ్రహం—9

దశమగ్రహం—10

పంచపాండవులు—5

ఇరువురు సోదరిలు—2

త్రిమూర్తి—3

ఫోన్ నెంబరు 910523!

"లారీలో వెళ్తూ నేను స్టెయిల్ హోటల్‌కు వెళ్లాను. ఫోను చేయబోతూ దానిమీద నున్న ఫోను నెంబరు చూశా. అప్పుడు జీగోలోని వుత్తరంలోని అంతరార్థం బోధపడింది. వినాయకరావు యింటికి వెళ్ళి పరిశోధించాను. నేరస్తుల జాడ దొరకింది. వారిని బంధించాం" అన్నాడు లిటిల్ స్టార్.

"ఫైన్ జాబ్!" అంటూ ప్రధాని లిటిల్ స్టార్‌కు షేక్‌హాండు యిచ్చాడు.

తర్వాత స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలకు వెళ్ళే సన్నాహంలో అంతా నిమగ్నులయ్యారు.

—: అయిపోయింది :—

# అగ్నిలహరి

## సుంకరి రాంప్రసాద్

"ట్వెన్ మిలియన్ ఎన్స్."

"ఇట్స్ టూ మచ్ హోచిమిన్. ఇంకో మాట చెప్పు."

"అబ్దుల్లా! ఈ హోచిమిన్ ఎప్పుడూ రెండు మాటలు చెప్పడు. నీకు కష్టంగావుంటే చెప్పు. అవే రేటుకు కళ్ళకు అద్దుకుని మరీ తీసుకోడానికి మరో పార్టీ సిద్ధంగా వుంది."

అది టోక్యోలో షెరటాన్ హోటల్ పన్నెండవ అంతస్తులోని లగ్జరీ సూట్. ఆ గదిలోని మెత్తని సోఫాలలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు అబ్దుల్లా, హోచిమిన్ అనబడే ఇద్దరు వ్యక్తులు.

అబ్దుల్లా సౌదీ అరేబియాకు చెందిన పెద్ద స్మగ్లర్. వివిధ దేశాలలోని ప్రాచీన శిల్పాలను, కళాఖండాలను సేకరించి, గల్ఫ్ కంట్రీస్‌లోని అరబ్ షేకులకు అమ్మటం అతడు చేసే ప్రధానమైన వ్యాపారం.

ఈ రొమాంటిక్స్ కోసం అరబ్ షేక్‌లు ఎందుకు ఇలా మిలియన్ల కొద్దీ పెట్రో డాలర్లను వృథాగా తగలేస్తారో నని అప్పుడప్పుడు ఆశ్చర్యపోతూంటాడు అతడు.

ఆఫ్టరాల్ ఇట్స్ ఎ క్రేజ్. వారి క్రేజ్‌ను అతను కేష్ చేసుకోగలుగుతున్నాడు.

ఇక రెండవ వ్యక్తి హోచిమిన్.

ఇతడి గూర్చి చెప్పేముందు 'యాకుజా' అంటే యేమిటో చెప్పాల్సి వుంటుంది. ఇరవై ఒకటవ శతాబ్దంలో చీకటి ప్రపంచాన్ని పరిపాలిస్తున్న నేరస్థుల రాజ్యాన్ని మాఫియా అని పిలుస్తారు. ది మోడరన్ క్రిమినల్ గాంగ్ ఇన్ ద అండర్ వరల్డ్ సొసైటీ.

ప్రపంచంలోని ఒక్కొక్క దేశంలో ఈ మాఫియా రింగ్ ఒక్కొక్క పేరుతో పిలవబడుతూంది. జపాన్‌లోని ఈ మాఫియా సామ్రాజ్యాన్ని యకుజా అంటారు. అలాంటి యకుజాకు మకుటం లేని మహారాజు హోచిమిన్.

అబ్దుల్లాను పది మిలియన్ల ఎన్‌లు యివ్వమని (జపాన్ కరెన్సీని 'ఎన్' లని వ్యవహరిస్తారు.) హోచిమిన్ డిమాండ్ చేస్తున్నాడంటే దానికి అబ్దుల్లా కోరుతున్న ప్రతిఫలం సామాన్యమైనదేమీ కాదు.

అతడు కోరుతున్నది....

మౌంట్ ఫ్యూజీ మీదనున్న పురాతన దేవాలయంలోని పంచలోహ విగ్రహం, గౌతమబుద్ధుడు ధ్యానముద్రలో కూర్చుని ఉన్నట్లుగా మలచబడ్డ ఆ విగ్రహం ప్రపంచంలో అత్యంత సుందరమైన బుద్ధప్రతిమగా పేరు గాంచింది.

"మీకు ఆ విగ్రహాన్ని యెక్కడ అందించాల్సి

ఉంటుంది అబ్దుల్లా?"

"టోక్యోకు సుమారు నూట అరవై కిలోమీటర్ల దూరంలో పసిఫిక్ మహాసముద్రంలో ఉన్న మియాకి దీవికి మీరా విగ్రహాన్ని చేర్చాల్సి వుంటుంది. మీరు ముందుగా ఇన్‌ఫార్మ్ చేస్తే ఆ సమయానికి అక్కడ మా స్టీమ్‌బోటు ఒకటి సిద్ధంగా ఉంటుంది. అక్కడ నుండి దానిని షిఫ్ట్ చేసే బాధ్యత మాది."

"ఇట్స్ డన్ అబ్దుల్లా."

హోచిమిన్ వైపు మెచ్చుకోలుగా చూశాడు అబ్దుల్లా. అంతవరకు తన వడిలో పెట్టుకున్న చిన్న బ్రీఫ్ కేసును నవ్వు మొహంతో హోచిమిన్‌కు అందించాడు. బ్రీఫ్ తెరచి చూసిన హోచిమిన్ మొహం.... అందులో నీట్‌గా పేర్చబడ్డ తళ, తళ లాడుతున్న సరికొత్త జపాన్ కరెన్సీని చూసేసరికి ఒక్కసారిగా వెలిగిపోయింది.

"టూ మిలియన్ ఎన్స్ హోచిమిన్. మిగిలింది ....పని పూర్తయ్యాక .... మియాకి దీవిలో" అన్నాడు అబ్దుల్లా.

సరే నన్నట్లు మెల్లగా తలాడించాడు హోచిమిన్. కాని తాను ఒప్పుకున్న ఈ ఎసైన్‌మెంట్ ఎంత ప్రమాద భరితమైనదో అతడికి ఆ క్షణంలో తెలియదు.

## 2

అది ఒక విశాలమైన గది. అందులో అర్ధచంద్రాకారంలో వేయబడ్డ కుషన్ చైర్స్‌లో కూర్చుని వున్నారు పదిమంది వృద్ధ కాయులు.

టోక్యోలోని 'యకుజా' గాంగ్ అత్యవసర సమావేశానికి పిలవబడ్డారు ఆ పదిమంది వృద్ధ కాయులు. వారి ఎదురుగా మూడడుగుల దూరంలో చిన్న వేదికలా వుంది.

ఎర్రని వెల్వెట్ క్లాత్ పరచివున్న ఆ వేదికమీది కుర్చీ లలో కూర్చుని వున్నారు ముగ్గురు వ్యక్తులు.

వారు హోచిమిన్, చిన్ లీ, తోషిబా.

యకుజాకు రాజు హోచిమిన్ అయితే, మంత్రిలాంటి వాడు చిన్ లీ. అతడు హోచిమిన్ కు కుడిభుజం. ఇక తోషిబా జపాన్ దేశంలోనే పేరు కెక్కిన జియాల జిస్ట్ ...

అబుల్లాతో మౌంట్ ఫ్యూజీమీది పంచలోహ విగ్రహం తేవటానికి ఒప్పుకున్నాక, ఈ ఎసైన్ మెంట్ కోసమే ప్రత్యేకంగా ప్రొఫెసర్ తోషిబా రప్పించ బడ్డాడు.

జపాన్ లోని ఎందరో ప్రొఫెసర్లూ, ప్రభుత్వోద్యో గులతో పాటు, ఎందరో పోలీసు ఉన్నతాధికారులు కూడా 'యకుజా గాంగ్' సభ్యులే అన్నది నమ్మశక్యం కాని నిజం.

ఆ గది అంతా నిశ్శబ్దంగా వుంది. తమ నాయకుడు చెప్పబోయే మాటలను వినడానికి వారు చెవులను రిక్కించి మరీ కూర్చున్నారు. హోచిమిన్ కనుసైగ నందు కుని చిన్ లీ మెల్లగా కుర్చీలోంచి లేచి చెప్పడం ప్రారం భించాడు.

"డియర్ ఫ్రెండ్స్! మన ఎసైన్ మెంట్ ....మౌంట్ ఫ్యూజీ అని మీ కందరకూ తెలుసు. టోక్యోకు నైఋతి దిక్కున సుమారు 300 కిలోమీటర్ల దూరంలో వుంది ఫ్యూజీ పర్వతం. మనం 250 కిలోమీటర్ల వరకూ ట్రైన్ లో, ఆ తరువాత ట్రక్ లో ప్రయాణించాల్సి వుంటుంది.

"మీరంతా ఇద్దరేసి చొప్పున ఐదు జట్లుగా విడి

పొండి. రేపు ఉదయం ఆరు గంటలకు టోక్యో నుండి నగోయాకు వెళ్ళే ట్రైన్ ఎక్కండి. సరిగ్గా ఎనిమిదిన్నరకు మిమ్మల్ని నగోయా స్టేషన్‌లో దింపుతుంది ఆ ట్రైన్. స్టేషన్‌లో దిగాక మీరు విడివిడిగా ప్రయాణించాల్సి వుంటుంది.

నగోయా సిటీలోని హోటల్ 'సాకీ'లో మీ పేర రూమ్స్ రిజర్వ్ చేయబడ్డాయి. మళ్ళీ ఫర్దర్ ఇన్‌స్ట్రక్షన్స్ యిచ్చేటంతవరకూ హాయిగా మీకు కేటాయించబడ్డ గదుల్లో విశ్రాంతి తీసుకోండి. ముఖ్యంగా గుర్తుంచుకోవాల్సిన విషయం... మీరు ఒకరినొకరు ఎట్టి పరిస్థితులలోనూ పలుకరించుకోకూడదు. బీ కేర్‌ఫుల్."

అంతటితో ఆ సమావేశం పూర్తయింది అన్నట్లు హోచిమిన్ లేచి నిలబడ్డాడు. తమ నాయకుడికి వినయంగా లేచి నిలబడి జై చేస్తూ ఆ గదిలో నుండి నిష్క్రమించారు ఆ యకుజా సభ్యులు.

# 3

నగోయా రైల్వే స్టేషన్.

వచ్చేపోయే ప్యాసెంజర్లతో హడావుడిగా వుంది. స్టేషన్ యెదురుగా ఉన్న రెస్టారెంట్‌లో కూర్చొని తీరిగ్గా ఫ్రాగ్స్ కబాబ్ తింటున్నాడు ఒహీరా. తన స్నేహితుడికి సెండాఫ్ చెప్పడం కోసం వచ్చాడతడు. స్నేహితుడిని ట్రైన్ యెక్కించేసి రెస్టారెంట్‌లో కూర్చున్నాడు.

ఒహీరా జపాన్ సీక్రెట్ సర్వీస్‌లో జూనియర్ ఆఫీసరుగా యీ మధ్యనే రిక్రూట్ అయ్యాడు. నగోయా సిటీలో పోస్టింగ్ వేశారతడికి. శాంతి భద్రతల దృష్ట్యా ప్రతి సిటీలో ఒక సీక్రెట్ సర్వీసు ఆఫీసరు వుంచబడ

తాడు జపాన్‌లో.

ఫ్రాగ్స్ కబాబ్ తింటూ సేవక్ వైపే చూస్తూన్న ఒహీరా ఆశ్చర్యంతో సదురు చేట్లి చాడు. రైల్వే స్టేషన్ నుండి ఒక్కొక్కరుగా బయటకు వచ్చారు పదిమంది దృఢకాయులు. విడి విడిగా కాబ్స్ (అద్దె టాక్సీలు) ఎక్కి వెళ్ళిపోయారు వారి ఆకారాలు, చూపులు, ఆ నడకలోని రఫ్‌నెస్ అన్నీ వారు యకుజా గాంగ్ సభ్యులని స్పష్టంగా చెబుతున్నాయి.

'ఇంతమంది యకుజా గాంగ్ మనుషులు, ద మోస్ట్ రఫ్ కారెక్టర్స్ ఆఫ్ జపాన్....ఒక్కసారిగా నగోయా సిటీలోనికి యెందుకు దిగినట్లు? అని కాదు ఒహీరా ఆశ్చర్యపోతున్నది. కనిపించగానే ఆప్యాయంగా చేతులు కలుపుకునే యజూజా సభ్యులు కనీసం ఒకరి నొకరు చూసుకోకుండా అంత సీరియస్‌గా ఎక్కడికి వెళుతున్నట్లు?' అని.

బిల్ పే చేసి రెస్టారెంట్ బయట పార్కు చేసివున్న తన 'హోండా'ను స్టార్టు చేశాడు ఒహీరా. ఒకవేళ వాళ్ళు యకుజా ముఠా మనుషులు కారేమోనన్న అనుమానం వచ్చింది అతడికి. చివరి దృఢకాయుడు ఎక్కిన కాబ్ అతడికి స్పష్టంగా కనిపిస్తూంది. పదిగజాల దూరం నుండి దానిని వెంబడించసాగాడతడు.

తిన్నగా వెళ్ళి హోటల్ సాకే ఆవరణలో ఆగింది ఆ కాబ్. అదే సమయంలో అంతకు ముందే తమ ప్యాసంజర్లను దింపేసి వెనుకకు మరలుతున్నాయి ఆ మిగిలిన దృఢకాయులెక్కిన కాబ్‌లు.

హోటల్ రిసెప్షన్‌లో తన ఐడెంటిటీని చూపించి వారి గూర్చి ఎంక్వయిరీ చేశాడతడు. రెండు రోజుల

క్రితమే ఆ పదిమంది పేరా రూమ్స్ రిజర్వ్ చేయబడ్డాయని తెలిసింది.

'తను అనవసరంగా వారిని అనుమానిస్తున్నాడా' అన్న సందేహమేమైనా అతడి మనసులో ఉంటే అది ఆ క్షణంలో పటాపంచలయిపోయింది. 'సంథింగ్ ఈజ్ రాంగ్' అనుకున్నాడతడు. ఆ వృద్ధశాయులకు రూమ్స్ కేటాయించబడ్డ ఫ్లోర్ లోనే తనకు కూడా ఒక రూమ్ తీసుకున్నాడతడు.

రాత్రి ఎనిమిది దాటింది.

అతడిలో అసహనం చచ్చిపోతూంది. ఉదయం నుండీ అతను యెంతో జాగ్రత్తగా వారిని గమనిస్తున్నాడు. ఆ పదిమందిలో యే ఒక్కరూ రూమ్స్ నుండి కదలలేదు. ఆఖరికి భోజనం కూడా గదికే తెప్పించుకున్నారు. కనీసం ఎవరికీ ఫోన్ కూడా చేయలేదు.

అతడు ఉదయమే రూమ్ సర్వీసింగ్ బాయ్ వేషంలో ఆ పదిమంది వృద్ధశాయుల గదులలో ప్రవేశించి, రూమ్ క్లీన్ చేస్తున్నట్లు నటిస్తూ వారి గదులలో హియరింగ్ బగ్స్ అమర్చి వచ్చాడు. అతడి గదిలో వున్న హైపవర్ ట్రాన్స్‌మీటర్ వారి గదుల్లో చీమ చిటుక్కుమన్నా రిసీవ్ చేసుకుని అతడికి వినిపిస్తూంది.

కాని రాత్రి ఎనిమిది కావస్తున్నా.... వారు ఎవరినీ కాంటాక్ట్ చేయలేదు.

అతడు అసహనంగా సోఫాలోంచి లేచాడు. అదే సమయంలో ప్రాణం పోసుకున్నట్లు ట్రాన్స్‌మీటర్ పలకరించింది.

"టక్.... టక్.... టక్...."—ఎవరో తలుపు కొట్టిన ధ్వని.

"హూ ఈజ్ దట్?" వృద్ధకాయుని గొంతు కంచులా మ్రోగింది.

"సప్పర్ ఫర్ యూ సర్!"

'హోటల్ బాయ్ గొంతులా వుంది' అనుకున్నాడతడు శ్రద్ధగా ట్రాన్స్మిటర్ లోని మాటలు వింటూ. కాసేపు టీపాయ్ మీద యేవో ప్లేట్లు సర్దుతున్న చప్పుడు. కొన్ని సెకన్ల పాటు నిశ్శబ్దం.

ఎవరో చిన్నగా దగ్గారు.

"బుద్ధుడు ఉండాల్సింది కొండల్లో కాదు" మెల్లగా గొణుగుతున్నట్లు పలికింది హోటల్ బాయ్ గొంతు.

చిన్నగా నవ్వాడు ఆ వృద్ధకాయుడు. అతని గొంతు మెల్లగా పలికింది "సముద్రపు దీవి"లో.

"ప్రభాతాన్నే ఆ మహాశ్రమణున్ని దర్శించండి. బుద్ధా బ్లెస్ యూ" మంద్రంగా వినిపించింది వెయిటర్ గొంతు. తరువాత అతడు గదిలో నుంచి వెళ్ళిపోయినట్లు అడుగుల చప్పుడు.

సరిగ్గా పదిమంది గదులలోనూ యివే మాటలు. ఒక్క అక్షరం పొల్లుపోకుండా, అందరూ కూడబలుక్కున్నట్లుగా. అందరి గదులలోనూ రూమ్ బాయ్ యివే మాట లన్నాడు.

ఇది వాళ్ళు యేర్పరుచుకున్న కోడ్ అని స్పష్టంగా తెలుస్తోంది. కాని యేమిటా అన్నదే చాలాసేపటివరకూ అంతుపట్టలేదు ఒకీరాకు. పేపర్ తీసి వ్రాసుకొని జాగ్రత్తగా స్టడీ చేయసాగాడతడు ఆ మాటల్ని.

బుద్ధుడు వుండాల్సింది కొండల్లో కాదు,

సముద్రపు దీవిలో.

ప్రభాతాన్నే ఆ మహాశ్రమణున్ని దర్శించండి.

బుద్ధా బ్లెస్ యూ...."

చాలాసార్లు చదివాడతను.

కానీ....ఏమీ అర్థం కావటంలేదు.

ఎంత ఆలోచించినా అతనికి అర్థమవుతోంది ఒక్కటే. మొదటి రెండు లైనులూ యేదో ఎక్స్‌పెరిమెంట్‌ను సూచిస్తున్నాయి. చివరి లైను ప్రొసీడ్ కమ్మని దీవెన లేక ఆజ్ఞ అనుకొంటే ...మధ్య లైను....?

"ప్రభాతాన్ని ఆ మహాశ్రమణున్ని దర్శించండి."

మరోమారు జాగ్రత్తగా చదివాడతడు ఆ వాక్యాన్ని.

ఉదయాన్నే ఎక్కడో కలుసుకొమ్మని సూచిస్తున్నది. ఎక్కడ....? మహాశ్రమణుడంటే....బుద్ధుడు. అప్పుడతడికి సడన్‌గా గుర్తుకొచ్చింది ...నగోయా సిటీ పొలిమేరలలో వున్న బౌద్ధారామం. దట్టమైన దేవదారు తోపు మధ్యలో వుంది... ఆ పురాతనమయిన బౌద్ధారామం.

తన అంచనా తప్పుగాకుంటే ఈ దుష్టకాయులను ఎవరో తెల్లవారుఝాము సమయంలో అక్కడ కలుసుకోబోతున్నారు. ఆ కోడ్ వర్డ్స్ గురించి ఒక అభిప్రాయానికి రాగానే అతడు ఒక్క క్షణం కూడా వృధాపరచలేదు. వెంటనే నగోయా పోలీసు కమీషనర్‌ను కాంటాక్టు చేశాడు.

తను ఒంటరిగా ఆ రోజు అర్ధరాత్రి దాటాక....ఆ బౌద్ధారామంలో ధ్యానానికి వుంటానని, ఒకవేళ తన అంచనా తప్పయి వారు అక్కడికి రాకపోతే...మళ్ళీ తాను తిరిగివచ్చేంతవరకూ ఆ దుష్టకాయులమీద నిఘా

చేసి వుంచమని.... కమీషనర్ ను కోరాడతడు.

ఒహీరా జీవితంలో చేసిన మొదటి తప్పు అది. దాని అతడు చాలా పెద్ద పెనాల్టీని చెల్లించవలసి వచ్చింది. పోలీసు కమీషనర్ ను కాకుండా, తమ సీక్రెట్ సర్వీసెస్ కు అతడు రిపోర్టు చేసి వుంటే ...ఆ పరిస్థితులు మరోలాగ వుండేవి.

కాని అతడు రిపోర్టు చేసిన నగోయా పోలీసు కమీషనర్ యకుజా గాంగ్ మనిషి. అతడా వార్తను అప్పటి కప్పుడే తమ నాయకుడు హోచిమిన్ కు అందజేశాడు.

ఆ సమయంలో హోచిమిన్ నగోయా సిటీలోనే వున్నాడు. చిన్ లీ, ప్రొఫెసర్ తోషిబాలతో పాటు అతడు ప్రభుత్వ అతిథి గృహంలో విశ్రాంతి తీసుకుంటు న్నాడు. ఒక్క తోషిబా తప్ప మిగిలిన ఇద్దరూ బౌద్ధ భిక్షువుల వేషాలలో వున్నారు.

## 4

రాత్రి రెండు గంటలు దాటింది.

మబ్బులు పట్టిన ఆకాశంలో చుక్కలు మిణుక్కు మిణుక్కు మంటూ చూస్తున్నాయి. దట్టమైన ఆ దేవదారు తోపులో చీకటి చిక్కగా పరుచుకొంది.

అంతవరకూ బౌద్ధారామంలో దాక్కున్న ఒహీరా మెల్లగా నడుచుకుంటూ తోపులోనికి వచ్చాడు.

అంతలో చీకటిని చీల్చుకుంటూ కాంతివంతమైన వెలుగు అతడి మీదకు పడింది. నిలుచున్నవాడు నిలుచు న్నట్లుగానే గాలిలోకి ఎగిరి ప్రక్కనున్న పొదలలోకి జంప్ చేశాడు. వాడిగా వున్న ముళ్ళ పొదలు అతడి శరీరం నిండా కసిగా తమ ముళ్ళను దించాయి. పళ్ళ

బిగువున బాధను అణచుకున్నాడతడు.

ఏమాత్రం కూడా కదలకుండా ఆ ముళ్ళ పొదలమధ్యే మోకాళ్ళమీద కూర్చున్నాడతడు. అంతవరకూ చెవులు గింగురు పెట్టేలా గీ పెడుతున్న చిమ్మటలు తమ నెలవుల లోనికి యేదో ప్రాణి ప్రవేశించేసరికి టక్కున నోళ్లు మూసుకొన్నాయి. కాని అతడు కదలక, మెదలక శిలా విగ్రహంలా వుండేసరికి మళ్ళీ తమ సంగీతాన్ని ప్రారంభించాయి.

ఒక్కొ-క్క సెకను భారంగా గడుస్తూంది. ఎండుటాకులమీద ఎవరో నడుస్తున్న శబ్దం. చీకటిలో అస్పష్టంగా కదలాడుతున్న యేవో ఆకారాలు కనిపించాయి అతడికి. వారు పొడుగుపాటి బరిసెలను పట్టుకొని పొదలలో పొడిచి చూస్తున్నారు. వారు మెల్లగా అతడు దాక్కొన్న పొదను సమీపించసాగారు.

వారు తను దాక్కొన్న పొదను సమీపిస్తే జరిగేదేమిటో అతడికి అర్థమయ్యేసరికి అతడి శరీరం జలదరించింది.

“నో..! ఆ బరిసెలు తల శరీరాన్ని తూట్లు, తూట్లుగా పొడవకముందే తను తప్పించుకోవాలి.”

డెస్పరేట్ గా పొదలమధ్యనుండి పైకి లేచాడు ఒహీరా. మరుక్షణం నలుదిక్కులనుండి కాంతివంతమైన వెలుగు అతడిమీద ప్రసరించసాగింది. చుట్టూ చూశాడతడు. అతడికి పది అడుగుల దూరంలో బరిసెల్ని పట్టుకొని నిలబడి వున్నారు నలుగురు దృఢకాయులు. తొడ కొట్టి సింహనాదం చేస్తూ గాలిలోకి ఎగిరాడతడు.

నేలమీదకు వ్రాలిన మరుక్షణం అరచేతులను కత్తులలా బిగించి వారిని ఎదుర్కొనటానికి సిద్ధంగా నిల

బడ్డాడు. అయితే అతడు ఊహించినట్లుగా ఆ దృఢ కాయులు అతడిని ఎటాక్ చేయలేదు. మౌనంగా ప్రక్కకు తొలగిపోయారు. వారి వంక ఆశ్చర్యంగా చూశాడతడు.

ఆ దేశుణంలో దేవదారు కొమ్మలనుండి పక్షుల్లా నేల మీదకు వ్రాలారు ఆరుగురు వ్యక్తులు. వారు ఆపాద మస్తకం నల్లని దుస్తులు ధరించారు. వారి చేతులలోని తెల్లని స్టీల్ పేష్కవ్‌లు ఆ చీకటిలోకూడా తళ, తళా మెరుస్తున్నాయి.

రెండు చేతులతో కత్తులను పట్టుకొని ఇద్దరు వ్యక్తులు మోకాళ్ళపై కూర్చుని వున్నారు. వారి వెనుక పక్షి రెక్కల్లా అటు ఇద్దరు, ఇటు ఇద్దరు చొప్పున నిలబడ్డారు మిగిలిన నలుగురు వ్యక్తులూ.

వారి పొజిషన్ చూడగానే వారెవరో అతడికి అర మయిపోయింది. వారు నింజా ఫైటర్స్. మార్షల్ ఆర్ట్స్‌లో అత్యంత శక్తివంతమైన ఫైటింగ్ విధానం నింజా. ఆ యుద్ధ విధానమే ప్రత్యేకంగా వుంటుంది.

ముందు ఇద్దరు నింజా ఫైటర్స్ వుంటారు. వారి వెనుకనుండి తటాలున ఇద్దరు నింజా వీరులు వచ్చి మెరుపులా శత్రువుని ఢీకొని మాయమౌతారు. వెను వెంటనే మరో యిద్దరు ఎటేక్ చేసి ప్రక్కకు తప్పుకుంటారు. ఫైనల్‌గా మిగిలిన యిద్దరూ తటిల్లతల్లా శత్రువును తాకుతూ పోతారు.

మళ్ళీ యింకో దిశలో నుండి అలాగే శత్రువుపై దాడి ప్రారంభమవుతూంది. ఎదురుపడి ఎవరూ శత్రువుతో పోరాడరు. ఒక మెరుపుతీగెలా శత్రువును మూర్కొ నడం మరుక్షణంలో అదృశ్యమవడం. అదీ నింజా యుద్ధ వ్యూహంలోని ప్రత్యేకత.

వారు నేలమీద ఎలా యుద్ధం చేస్తారో చెట్ల కొమ్మలనుండికూడా అలాగే ఎటేక్ చేస్తారు - ఆకాశంలో చక్కర్లు కొడ్తే డేగలు సూటిగా వ్రాలి తమ ఆహారాన్ని తన్నుకుపోయినట్లు.

ఒహీరా కూడా మార్షల్ ఆర్ట్స్‌లో ప్రవీణుడే. కాని చేతిలో ఆయుధం లేకుండా నింజా ఫైటర్స్‌ను ఎదుర్కొనడం అంటే అది ఆత్మహత్యాసదృశమే అని అతడికి బాగా తెలుసు. అదీగాక చీకటి నింజా వీరులకు వరప్రసాదం లాంటిది.

ఏం చేయాలో అతడు నిర్ణయించుకోకముందే నింజా వీరులు అతడిని ఎటాక్ చేశారు.

పది నిమిషాలపాటు కరాటే అరుపులతో, కుంగ్ ఫూ సింహనాదాలతో ఆ తోటంతా మార్మోగిపోయింది.

ఎంత వీరుడైనా ఒక్కడూ అదీ నిరాయుధుడు ఆరుగురు నింజా వీరులను ఎంతసేపని ఎదుర్కొనగలడు? అతని శరీరమంతా గాయాలతో రక్తసిక్తమయింది. అతడు నిస్సాణతతో ముందుకు తూలాడు. అదే సమయంలో బలంగా అతడి మెడపై పడింది ఒక కత్తివేటు.

అంతే....కంఠనాళాలు తెగి రక్తం వరదలై కారుతుంటే అతడు నిర్జీవంగా నేలమీదకు వ్రాలిపోయాడు. తమ శాఖలోనే ఒక అత్యున్నతమైన పదవిని చేపట్టిన ఒక నమ్మకద్రోహి కారణంగా ఒక నిజాయితీగల పోలీస్ ఆఫీసరు విధి నిర్వహణలో తన ప్రాణాల్నే బలి పెట్టాల్సి వచ్చింది.

సరిగ్గా అతడు మరణించిన రెండు గంటల తరువాత ఆ తోపులోనుండి ఒక ట్రక్ బయలుదేరింది. ట్రక్ ముందు సీటులో కూర్చుని వున్నారు హోచ్ మిన్,

చిన్ లీ. తోషిబా. ట్రక్ వెనుకనున్న డాడీలో తాపీగా కబుర్లు చెప్పుకుంటున్నారు పదిమంది దృఢకాయులు—

ఆ దేవదారు తోపులో అంతకుముందే ఒహీరా శవాన్ని పాతిపెట్టిన దానికి గుర్తుగా ఆ దృఢకాయుల చేతులకు మట్టి అంటుకొని వుంది.

ఆ ట్రక్ ఫ్యూజీ పర్వతంవైపు ప్రయాణించసాగింది. వారికి దారి చూపటానికా అన్నట్లు తూర్పున అప్పుడే వేగుచుక్క పొడిచింది.

## 5

బాలభానుని బంగారు కిరణాలు వెచ్చగా సోకుతుంటే తెలిమంచు తెరలలో పచ్చగా వళ్లు విరుచుకుంటుంది ప్రకృతి కన్య. నింగి అంచులను తాకుతుందా అన్నట్లుగా వుంది ఎర్రగా మెరిసిపోతున్న ఫ్యూజీ పర్వత శిఖరం.

పర్వత సానువులను ఆనుకొని వ్యాపించిన కవగూచి సరస్సులో చిన్నగా ఎగిసి పడుతున్నాయి తెల్లని కెరటాలు. కవగూచి పేరుకు సరస్సే అయినా అనంతమైన సాగరంలా ఉంటుంది. 240 మీటర్ల లోతులో కొన్ని కిలోమీటర్ల పర్యంతం వ్యాపించిన ఆ నిర్మల నీలాల ప్రవాహం ఆ ఉదయపు లే ఎండలో తళ, తళా మెరుస్తూంది.

సరస్సు ఒడ్డున వ్యాపించిన సంకీర్ణ కాననంలో మెల్లగా నడుస్తున్నారు వారు. తూరుపు తెల్లవారే సమయంలో ఆ బృందాన్ని కవగూచి సరస్సు ఒడ్డున దింపి వెనుతిరిగింది వారు ఎక్కివచ్చిన ట్రక్. మనుషులు నడవడానికికూడా వీలులేని చిట్టడవి అది.

ముందు వరుసలో ఇద్దరు పెద్ద వేటకత్తులను పట్టుకుని,

కొమ్మలను రెమ్మలనూ, అడ్డుగా వున్న ముళ్ళ పొదలనూ కొడుతూ దారి చేస్తున్నారు. వారి వెనుక హో చిమిన్, చిన్ లీ, తోషిబా మెల్లగా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. వారిని అనుసరిస్తూ సామానులు వీపున వేసుకొని వస్తున్నారు మిగిలిన ఎనిమిదిమంది దృఢకాయులు.

ఫ్యూజీ పర్వతం గూర్చి తనకు తెలిసిన వివరాలను చెప్పటం ప్రారంభించాడు ప్రొఫెసర్ తోషిబా. వారు వింటూ నడుస్తున్నారు.

"ఈ పర్వతం పూర్తి పేరు ఫ్యూజియామా. 3776 మీటర్ల ఎత్తుగల ఈ పర్వతం నిజానికి ఒక స్లీపింగ్ వాల్కెనో. నిద్రిస్తున్న అగ్నిపర్వతం.

ఋతువులను బట్టి ఫ్యూజీ పర్వత వర్ణం, వాతావరణం అన్నీ మారిపోతుంటాయి శీతాకాలంలో దట్టంగా కురిసే మంచు పేరుకుపోయి వెండి కొండలా ధగ, ధగ మెరుస్తుంది ఆ పర్వత శిఖరం.

వేసవి వచ్చేసరికి వేడిగాడ్పులతో, భరించలేని సెగలు గ్రక్కుతూ జేగురు రంగులో కన్పిస్తుంది. శరదృతువులో పగలంతా వేడిగానూ, రాత్రులందు చల్లగానూ వుంటుంది అక్కడి వాతావరణం.

బహుశా కాలాన్ని బట్టి రూపాన్ని మార్చుకొనే పర్వతం ప్రపంచం మొత్తంమీద ఒక్క ఫ్యూజియామాయే నేమో!"

అంతలో అతడి మాటలకు అడ్డుకట్ట వేస్తూ వారి చెవులకు సోకింది ఒక ఆర్తనాదం. పది అడుగుల దూరంలో కన్పిస్తున్న ఆ దృశ్యాన్ని చూసి వారు భయంతో కంపించిపోయారు. ఇద్దరు పరుగెత్తుకొంటూ అటు వెళ్ళబోయారు. కాని తోషిబా చటుక్కున వారిని పట్టుకుని

ఆపు చేశాడు. ఎవరూ అక్కడకు వెళ్ళకద్దని శాసించాడతడు.

అలా నిశ్చేష్టులై వారా భయానక దృశ్యాన్ని చూడ సాగారు.

కత్తులతో పొదలు నరుకుతూ దారిచేస్తున్న వారి ఇద్దరు సహచరులూ రెండు పొదలమధ్య చిక్కుకొని వున్నారు. పచ్చగా అరచేతులంత వెడల్పున వున్నాయి ఆ మొక్కల ఆకులు. సన్నగా, పొడుగ్గా తీగల్లా వున్న ఆ మొక్కల పత్రపుచ్ఛాలు వారిద్దరినీ నిలువెల్లా చుట్టి వున్నాయి. సన్నని పసిరిక పాముల్లా వారి మెడలను చుట్టుకు టున్నాయి మరికొన్ని పత్రపుచ్ఛాలు.

అలా వారు చూస్తు డగానే వారి శరీరంలోని రక్తాన్నంతా పీల్చేశాయి ఆ పొదలు. భరించలేని మరణ వేదనతో వారు చేస్తున్న ఆక్రందనలతో ఆ అరణ్యాం ప్రతిధ్వనించింది.

పాలిపోయిన ముఖంతో, పెదవులు కంపిస్తుంటే మెల్లిగా గొంతు పెగల్చాడు లోషిబా.

“అవి మాంసాహార పొదలు హోచిమిన్. ఎంత బలమైన జంతువైనా, చివరికి పెద్ద పులికూడా వాటి బారినుండి తప్పించుకోలేదు. ఒక్కసారి తీగల్లా వున్న వాటి పత్రపుచ్ఛాలకు మన స్పర్శ తగిలిందంటే చాలు— కొన్ని సెకన్‌లలో మన శరీరం అంతటా అల్లుకుపోతాయి అవి.

ఇక అలాంటివారిని విడిపించడానికి ప్రయత్నించడం మన చావును మనమే కోరి తెచ్చుకోవడం వంటిది.

తమ సహచరుల్లో ఇద్దరు ఆ రాక్షస పొదలకు బలై పోవడం కళ్ళారా చూసిన వారి హృదయాలు బాధతో,

భయంతో బరువెక్కాయి. ఏం చేద్దామన్నట్లు వారు తమ నాయకుని వంక చూశారు.

యింకొక యిద్దరిని దారిని చేస్తూ ముందుకు నడవమని ఆజ్ఞాపించాడు హూచిమిన్. వారు ఆ పొదలకు దూరంగా యింకో దిశలో తమ ప్రయాణం కొనసాగించారు. అలాంటి రాక్షస పొదలు మళ్ళీ ఎక్కడయినా తారస పడతాయేమోనని చాలా జాగ్రత్తగా చుట్టూ పరిశీలిస్తూ నడుస్తున్నారు వారు.

"అత్యంత ప్రాచీనమైన దుర్గమారణ్యం యిది. ఈ రాక్షస పొదలను చూస్తుంటే యింకా ఎలాంటి విచిత్ర జీవులను ఎదుర్కోవాలో అనిపిస్తూంది."

పాలోచనగా అన్నాడు తోషిబా. అతడి వంక ప్రశ్నార్థకంగా చూశాడు హూచిమిన్.

"మీ సందేహం ఏమిటి తోషిబా?"

అతడి కళ్ళల్లోకే సూటిగా చూస్తూ అడిగాడు చిన్ లీ.

ఒక్కసారి చిన్నగా తల పంకించి చెప్పడం ప్రారంభించాడు తోషిబా.

"ఎప్పుడో ఆఫ్రికా అడవులలో వున్నాయని చదివాను. ఆ రాక్షస పొదల గురించి. సరిగ్గా కంగా ఆఫ్రికా ఖండంలోని వాతావరణమే ఈ పొదలు యిక్కడకూడా వుండటానికి కారణం అయితే ఆ చీకటి ఖండంలో వున్నాయని కల్పించబడ్డ ఎన్నో భయంకర జీవులుకూడా ఈ అరణ్యంలో కూడా వుండాలి. చాలా ప్రాచీనమైన అరణ్యం యిది."

"మరి యింత దుర్గమారణ్యంలో ఆ పర్వతశిఖరం మీద ఆ బౌద్ధాలయం ఎలా నిర్మించారు?" సందేహంగా

అడిగాడు చిన్ లీ.

"అప్పటికి ఇది అరణ్యం కాదేమో!"

తోషిబా మాటలు అర్థంకాలేదు చిన్ లీకి. ఓ ప్రక్క ప్రాచీన అరణ్యమంటాడు. బౌద్ధాలయం కట్టించే నాటికి ఆ అరణ్యం లేకపోయి వుండవచ్చు అంటున్నాడు. చిన్ లీ ముఖంలోని భావాలను చదివి చిన్నగా నవ్వాడు తోషిబా

"బుద్ధుని నిర్యాణానంతరం బౌద్ధమతం రెండుగా చీలి పోయింది. బుద్ధుని విగ్రహాన్ని పూజించేది హీనయాన మతం. త్రిరత్నాలను ఆదర్శంగా నిర్వికారుడైన భగవానుని ప్రార్థించమని బోధించేది మహాయానమతం.

జపాను ప్రజలను ఆకర్షించినదీ, వారి చక్రవర్తుల ఆదరణకు నోచుకున్నదీ హీనయాన మతమే. ఆ కాలంలో అంటే క్రీస్తు పూర్వం సుమారు మూడవ శతాబ్దిలో.... అంటే యిప్పటికి 2,200 సంవత్సరాల పూర్వం బహుశా ఈ బౌద్ధాలయం నిర్మింపబడింది.

కాలక్రమేణా యిక్కడి జనవాసాలు నశించి అరణ్యం చోటు చేసుకుంది."

వాంగ్ చిమిన్ తోషిబా వంక మెచ్చుకోలుగా చూశాడు. "యూ ఆర్ రియల్లీ ఇంటలిజెంట్" అంటూ ప్రశంసాపూర్వకంగా అతడి భుజం తట్టాడు.

అప్పటికి సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చాడు ఎండ తగలకుండా చెట్ల కొమ్మలు గొడుగులా నీడ పట్టుతున్నా, యేదో భరించలేని వేడిమి వారి శరీరాలను తాకుతోంది. అలసటగా ఆ చెట్లనీడన కూర్చున్నారు వారు.

పాకెట్ విప్పి ఎవరికి ఏం కావాలో అవి అందించ సాగారు ఇద్దరు వ్యక్తులు. ఒక టిన్ బీరు తీసుకొని కాస్త

దూరంగా వున్న ఒక చెట్టు మొదలులో విశ్రాంతిగా కూర్చుని.... తీరిగ్గా సిప్ చేయసాగాడు తోషిబా. చిన్న కాగితపు ప్లేటులో కాసిన్ని మటన్ టిక్కాలు, రెండు, మూడు కేక్ పీసస్ పెట్టి అతడికి వినయంగా అందించాడు ఒక అనుచరుడు.

అంతా తమ లంచ్ తీసుకోవడంలో నిమగ్నమయి వున్నారు.

అంతలో వారికి ఏడెనిమిది అడుగుల దూరంలో వున్న పొద చిన్నగా కదలడం గమనించాడు వారిలో ఒకడు. మెల్లగా ఆ పొదవైపు నడిచాడు అతడు.

ఆ పొదలోనుండి ప్రాకుతుంటూ వస్తూంది ఐదడుగుల పొడవున్న పాము గోధుమ వర్ణంలో వున్న దాని శరీరంపై నల్లని పెద్ద, పెద్ద మచ్చలున్నాయి. ఆ పామువైపు ఆకలిగా చూశాడతడు. జపాన్ దేశస్థులకు పాము మాంసమంటే మహా ప్రీతి.

అతడు చప్పుడు చేయకుండా మెల్లగా వంగి తన బెల్టుకున్న చిన్న బాకును తీశాడు. ఆ పాము మరింత దగ్గరికి వచ్చింది. వారిద్దరి మధ్య దూరం యిప్పుడు ఐద డుగులకన్నా ఎక్కువ వుండదు. అతడు బాకును విసర డానికి తన చేయి పైకెత్తాడు. తన శత్రువును పసిగట్టినట్లు ఆ పాముకూడా చివాలున పడగవిప్పి తోకమీదంచి లేచింది.

ఒక్కసారి పూత్కారం చేసింది. అంతే!

పిచికారీతో యేదో మందు తన ముఖంమీద కొట్టినట్ల యింది అతడికి. కనుగ్రుడ్లు పెకలివేసినంత బాధ. శ్వాస రంధ్రాలలో ఏదో ఘాటైన వాయువు ప్రవేశించినట్లు ... ఊపిరి ఆడక గిల, గిలలాడాడు. బాధలో కూడిన అరుపు

ఒకటి అతడి గొంతులోనుండి రాకముందే ఆ పాము జర, జరా వచ్చి అతడి కంఠంమీద కసిగా కాటువేసింది.

అంతే! కొన్ని సెకన్లలో అతడి శరీరం నల్లగా మాడిపోయింది.

'దబ్' మని అతడి శరీరం నేలమీద పడిన శబ్దం వినిపించేసరికి పరుగెత్తుకు వచ్చారు అతిడి సహచరులు. వేగంగా పొదల్లోకి ప్రాకుతుంటూ పోతున్న ఆ నల్లని మచ్చల పామును, విగతజీవుడై పడి వున్న తమ సహచరుడ్ని చూసేసరికి వారికి జరిగిందేమిటో అర్థమయింది.

'స్ప్రేయింగ్ స్నేక్' అనుకున్నాడు తోషిబా ఆ పాము వంటిమీద నల్లని మచ్చలను చూసి.

భూమధ్యరేఖా ప్రాంతాల్లో వుండే అరుదైన పాము అది. తన శత్రువును పసిగట్టిన మరుక్షణం విషాన్ని స్ప్రే చేస్తుంది. ఆ విషప్రభావం వలన అవతల జీవి గ్రుడ్డిదవుతుంది. ఆ విషపు గాలికి ఉక్కిరి, బిక్కిరయి అచేతనంగా వున్న సమయంలో తన శత్రువును కాటేసి చంపుతుంది ఆ స్ప్రేయింగ్ స్నేక్.

తమ సహచరుడి శవం చూడటంతోనే వారికి కడుపులో దేవినట్లయింది. జీవితంలో మొదటిసారిగా వారి మనసులలో యేదో తెలియని భయం ప్రవేశించింది.

## 6

చీకటి పడేంతవరకూ ఎక్కడా ఆగకుండా వారు ప్రయాణం సాగించారు. ఎవ్వరూ క్రింద వుండకూడదనీ, అందరూ చెట్లమీదకు ఎక్కి ఆ రాత్రికి విశ్రాంతి తీసుకొమ్మని చెప్పాడు తోషిబా.

అందరూ తలా కాస్త కాల్చిన ఎండు మాంసం, ఇంత శ్రద్ధా తిని చెట్లమీదకు ఎగబ్రాకారు. నిద్ర

మట్టిలో క్రిందకు జారిపడకుండా పొడుగాటి గడ్డితో తమ శరీరాలను కొమ్మలకు గట్టిగా బిగించి కట్టుకొని ఆ తరువాత నిద్రకు ఉపక్రమించారు వారు. శారీరకంగా, మానసికంగా బాగా అలసిపోయి వున్నారేమో వారిని నిద్రాదేవత తొందరగానే కరుణించింది.

చీకటి అడవిని ఆవహించిన వేళ, శుక్లపక్ష చంద్రుని గుడ్డి వెలుగు ఆకుల సందులగుండా ప్రసరిస్తుంటే, తెలుపు, నలుపు దారాలు కలనేసి నేసిన తివాచీలా వుంది నేల. వేటకు బయలుదేరిన క్రూరమృగాలూ, ప్రాణభీతితో పరుగులుతీసే మూగజీవులూ....

అడవి అంతా అప్పుడే నిద్ర లేచిందా అన్నట్లు అత్యంత కోలాహలంగా వుంది.

అడవి దద్దరిల్లి పోయేటట్లు వినిపించిన గర్జనలకు వారు ఉలిక్కిపడి లేచారు. ఆ దృశ్యాన్ని చూసేసరికి వారి అరచేతులకు చమటలు పట్టాయి. భయంతో వారి శరీరాలు కంపించసాగాయి. తమ శరీరాలు ఆ కొమ్మలకు కట్టబడి ఉండకపోతే వారు పట్టు జారి క్రిందపడి వుండేవారేమో!

నల్లగా మదించిన గున్న ఏనుగులా వుంది ఆ అడవిదున్న. గిట్టలతో మట్టిని పెళ్ళగిస్తూ....తన వాడి కొమ్ములను విసురుతూ హుంకరిస్తుంది. పాము బుసలా వుంది దాని నిశ్వాసం. దాని చుట్టూ ఆరడుగుల దూరంలో ఒక వలయంలా నిలబడి వున్నాయి యేదెనిమిది సింహాలు.

వెనుక కాళ్ళను చాచి, ముందు కాళ్ళను వంచి యే క్షణంలోనైనా దానిమీదకు దుముకడానికి సిద్ధంగా వున్నాయి. పొడుగాటి తమ జూలును విదలిస్తూ, మోరలెత్తి భయంకరంగా గర్జిస్తున్నాయవి.

సింహం అడవికి రాజని, ఒంటరిగా వేటాడుతుందని కథలుగా చెబుతారు. కాని వాస్తవానికి ఒంటరిగా వేటాడేది పెద్దపులి. సింహాలు యెప్పుడూ గుంపుగా వేటాడతాయి.

వారు కళ్ళు విప్పార్చుకుని ఆ సింహాల వంక చూడ సాగారు.

ఇంతలో ఛటాలున ఒక సింహం ఎగిరి అడవిదున్న మీద పడింది. కాని అడవిదున్న తెలివిగా ప్రక్కకు తప్పుకోవడంతో దబ్బుమని నేలమీద పడిందది. నేల మీద పడిన సింహాన్ని తన కాలి గిట్టలతో గట్టిగా త్రొక్కింది ఆ దున్న. అది లేచేలోగా తన వాడి కొమ్ములను దాని పొట్టలో గ్రుచ్చింది. రక్తంతో తడిసిన దాని కొమ్ములు ఎర్రని మోదుగుపూల కొమ్మల్లా వున్నాయి.

అయితే అదే సమయంలో మరో రెండు సింహాలు ఆ దున్నపై దాడిచేశాయి. ఒకటి దాని మూపుపై దూకి ఆ దున్న మెడపై తనవాడి కోరలను దించింది. యింకొకటి దాని పొట్టను తన పంజాతో చీల్చసాగింది. బాధగా హుంకారావం చేస్తూ వాటిని విదల్చింది ఆ అడవిదున్న. ఆ విసురుకు అల్లంత దూరంలో పడ్డాయి ఆ సింహాలు.

క్రిందపడ్డ ఒక సింహాన్ని తన తలతో గట్టిగా మోదింది. ఆ దెబ్బకు ప్రక్కటెముకలు ఫెళ, ఫెళమని విరిగి, చారెడు రక్తం క్రక్కింది ఆ సింహం. ఇంతలో ఒకేసారి మూడు సింహాలు ఆ దున్నమీదకు లంఘించి.... తమ వాడి పంజాలతో దాని శరీరాన్ని చీల్చసాగాయి.

రక్తసిక్తమయిన దేహంతో, కండలు ఊడిపోతుంటే ప్రాణభీతితో పరుగులంకించుకుంది ఆ అడవిదున్న. కాని అది కొన్ని గజాలు పోకముందే దాన్ని మరోమూం

ఎటాక్ చేశాయి ఆ సింహాలు. అంతే! తన కంఠనాళాలను కొరుకుతున్న ఒక సింహాం వంక నిస్సహాయంగా చూస్తూ నేలకు వాగిపోయింది ఆ అడవిదున్న.

కండలు, కండలుగా దాని మాంసాన్ని పీక్కు తింటున్న సింహాలను చూసేసరికి వారి ముఖాలు తెల్లగా పాలిపోయాయి. 'తాము ఆ రాత్రి చెట్టుక్రిందే వుండి నట్లయితే ఆ అడవిదున్న స్థానంలో తాముండేవారు' అనుకున్నారు వారు గొంతుకల్లో తడి ఆరిపోతూ వుంటే.

ఆ భయానక దృశ్యాన్ని చూశాక మరా రాత్రి వారు నిద్రపోలేదు.

# 7

అడవి పల్చబడింది.

కూతవేటు దూరంలో ప్యూజీ పర్వత పాదం కనిపి స్తూంది.

చిన్న. చిన్న, దుబ్బలూ, పొదలూ తప్ప పెద్ద వృక్షాలేమీ లేవు. మృత్యులోయలాంటి అరణ్యాన్ని దాటి నందుకు వారు తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

"ఇంకో నాలుగు గంటలు నడిచాక మన అసలు గమ్యం ప్రారంభమవుతుంది హోచిమిన్" — ప్యూజీ పర్వతం వంక చూస్తూ అన్నాడు తోషిబా.

వెచ్చని సూర్యకిరణాలు వంటికి తగులుతుంటే వారికి ఎంతో హాయిగా వుంది. పచ్చని పాదపాలను దాటు కుంటూ వారు విశాలమైన పచ్చిక మైదానంలో అడుగు పెట్టారు. పచ్చగా, వత్తుగా పెరిగిన పచ్చికలో అక్క డక్కడ మొలిచిన ఊదారంగు గడ్డిపూలు తృణాంబరాన మొలిచిన తారకల్లా వున్నాయి.

వారు నడుస్తున్న దారిలో, వారికి కొన్ని గజాల

దూరంలో కన్పించిన ఒక మనోజ్ఞమైన దృశ్యం వారిని ఆనందపరవశులను చేసింది. ఆ పచ్చిక బయలు మధ్య కొన్ని గజాల మేర అంతా ఎర్రగా వుంది. కుంకుమ పూలు వత్తుగా జల్లినట్లు ఎర్రని తివాచీ ఏదో పరచినట్లు సింధూర వర్ణంలో మిల, మిలా మెరుస్తూంది అది. ఏవో గడ్డిపూలు అనుకున్నారు వారు.

"బ్యూటిఫుల్.... ఫెంటాస్టిక్...." అంటూ ముగ్గురు ఆ పూల తివాచి వంక పరుగెత్తుకుంటూ వెళ్లారు.

అప్పుడే తివాచీల వున్న ఆ ఎర్రని భాగం మెల్లగా కదలడం గమనించాడు తోషిబా. పరుగెత్తుతున్న వారిని ఆగమని గట్టిగా అరిచాడు అతడు. కాని, వారు అప్పటికే ఆ ఎర్రని పూలమధ్యకు చేరుకున్నారు.

దోసిళ్ళతో ఆ ఎర్రని పూలను కోద్దామని వంగారు వారు. కాని అవి పూలు కాదని ఎర్రచీమలని గ్రహించే సరికి వెర్రిగా కేకలు పెట్టారు. అప్పటికే వారి శరీరం నిండా క్రమ్ముకున్నాయి ఆ ఎర్రచీమలు. పిచ్చిపట్టిన వారిలా పరుగులుతీశారు వారు.

కాని, కొన్ని గజాల మేర వ్యాపించి వున్న ఆ చీమల వ్యూహంనుండి తప్పించుకోవటం వారికి సాధ్యపడలేదు. వారి కనుగ్రుడ్లను, పెదవులను ఆ చీమలు కొరికి తినేశాయి. భరించలేని బాధతో వారు చేస్తున్న ఆక్రందనలు ప్యూజీ పర్వత సానువుల్లో ప్రతిధ్వనించాయి.

ఆ చీమలబారును చూసేసరికి తోషిబా వెన్నులో చలిపుట్టుకు వచ్చింది.

ఆఫ్రికా ఖండంలో కూడా చాలా అరుదుగా కనిపించే "కానిబల్ యాంట్స్" అవి. సుమారు రెండం గుళాల పొడవు వుండే ఆ చీమలు ఎప్పుడూ గుంపుగా నే

సంచరిస్తాయి. ఎర్రని తివాచీలా కన్పించే వాటివైపు ఆకర్షింపబడి యేదైనా జంతువు వస్తే.... దాన్ని చుట్టు ముట్టి కొన్ని క్షణాలలో దానిని పూర్తిగా తినేస్తాయి.

ఒక్కసారి వాటి పాలబడితే ఏనుగులాంటి అతి పెద్ద జంతువుకూడా తప్పించుకోలేదు.

కొన్ని నిముషాలలో ఎముకల ప్రోగులుగా మారిన తమ సహచరులను చూసేసరికి భయంతో వారి ప్రాణాలు కడగట్టిపోయాయి.

"ఈ ఎక్స్‌పెరిమెంట్‌ను తప్పుడని తాను తప్పుచేశానా" అని మొదటిసారిగా బాధపడ్డాడు హోచిమిన్.

"కమాన్ ....రన్ ఎవ్విబడీ"

ఆ కానిబల్ యాంట్స్ కళ్ళబడకముందే అక్కడి నుండి దూరంగా పారిపోవాలి అనుకుంటూ తోషిబా.... ఆ చీమల బారుకు దూరంగా వేరే దిక్కులో పరుగెత్తడం ప్రారంభించాడు. భయంతో వణికిపోతూ మిగిలినవారు కూడా అతడిని అనుసరించారు.

సుమారు రెండు ఫర్లాంగుల దూరం ఆగకుండా పరుగెత్తారు వారు. ఆయాసంతో వారి గుండెలు ఎగిసి, ఎగిసి పడుతున్నాయి. ఒళ్ళంతా చెమటలుపట్టి ధారలుగా కారసాగింది.

అడవి దిశగా నెమ్మదిగా సాగిపోతున్న ఆ ఎర్ర చీమల సమూహాన్ని చూసి వారి గుండెలు తేలికపడ్డాయి. కాసేపు అలసట తీర్చుకొని తిరిగి తమ ప్రయాణాన్ని కొనసాగించారు.

సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చే సమయానికి వారు ప్యూజీ పర్వతం దగ్గరకు చేరుకున్నారు. నున్నగా, కాలు వేస్తే జారిపోయేలా వుంది ఆ సమున్నతమైన పర్వతం.

అగ్నిపర్వతాల ఆకారాలే విచిత్రంగా వుంటాయి. చిన్న, చిన్న బండలుగా గాక అంతా ఒకే పెద్ద శిలలా, నున్నగా, గుండ్రంగా పోతపోసిన శివలింగంలా వుంటుంది. వేడి సెగలూ పొగలూ గ్రక్కుతూ మండుతున్న అగ్నిగోళంలా వుంటుంది. అయితే కొన్ని డెడ్ వాల్కెనోస్ లేక స్లీపింగ్ వాల్కెనోస్....అంటే సెగలూ పొగలూ లేని అగ్నిపర్వతాలూ వుంటాయి. వాటిని నిద్రిస్తున్న అగ్నిపర్వతాలు అంటారు.

ఫ్యూజీకూడా అలాంటి నిద్రిస్తున్న అగ్నిపర్వతమే.

వారంతా లఘువుగా కాస్త ఆహారాన్ని తీసుకొని ఆ పర్వతాన్ని అధిరోహించడం ప్రారంభించారు. ముందుగా ఒకడు మెల్లగా పైకి ఎగబ్రాకి .... అక్కడక్కడ శిలా ఫలకాలలో ఏర్పడిన చీలికలలో పెద్ద ఇనుప మేకులను దిగగొట్టి దానికి బలమైన త్రాడును చుట్టి క్రిందకు జారవిడుస్తున్నాడు. ఆ త్రాడు సాయంతో మిగిలినవారు మెల్లగా పైకి ఎగబ్రాకసాగారు.

కొంతదూరం నిట్టనిలువుగా, ఆ తరువాత సమతలంగా మళ్ళీ ఏటవాలుగా....ఇలా విభిన్నమైన రీతులలో వున్న ఆ పర్వతాన్ని అధిరోహించడమంటే మాటలతో పని కాదు. త్రాడు పట్టుకొని ఎక్కటంలో వారి అరచేతులు ఎర్రగా కందిపోయి మంటలు పెడుతున్నాయి. రాళ్ళకు తగలడంతో వారి మోచేతులు, మోకాళ్ళు పూర్తిగా కొట్టుకుపోయాయి.

3,776 మీటర్లు అంటే సుమారు 12,389 అడుగుల ఎత్తున్న ఆ ఫ్యూజీ పర్వతాన్ని అధిరోహించడమంటే నిజంగా గొప్ప సాహసకృత్యమే.

మసక చీకట్లు ముసిరే సమయానికి ఒక సమతల ప్రదేశాన్ని చేరుకున్నారు వారు. కొండవాలులో ఏర్పడ్డ చీలికలో మొలిచి వుంది ఏదో పెద్ద వృక్షం. ఆ చెట్టు క్రింద ఆ రాత్రికి మజిలీ వేద్దామనుకున్నారు వారు.

సన్నగా కురుస్తున్న మంచుతో పాటు గుండెలను వణికించేటంత చలికూడా ప్రారంభమయింది. అది వేసవి కాబట్టి వారు ఎలాగో ఆ చలిని తట్టుకోగలిగారు. అదే శీతాకాలం అయితే....అక్కడి చలికి వారు గడ్డకట్టుకు పోవాల్సిందే. నవంబరు, డిసెంబరు మాసాలలో మౌంట్ ఫ్యూజీ శిఖరం మీద ఉష్ణోగ్రత — 38 డిగ్రీల సెంటీగ్రేడ్‌లు వుంటుంది.

బ్యాగ్స్ తెరిచి విస్కీ బాటిల్స్ పైకితీశారు. రా విస్కీ గొంతులో దిగేసరికి... ఒక్కసారిగా గొంతు మండింది. విస్కీ మత్తు మెల్లగా నరాలకు ఎక్కేసరికి గుండెల్లోకి వెచ్చదనం వచ్చింది. వంటినిండా ఉన్ని కంబళ్ళు కప్పుకొని ముడుచుకుంటూ కూర్చున్నారు వారు. నిద్ర లేమితో కళ్ళు మూసుకుపోతుంటే ఆ రాతి నేలమీద అలానే వ్రాలిపోయారు వారు.

# 8

నిశి రాత్రి కౌఅజాణ బిగికౌగిట సొక్కి సోలిన అరుణ భానుడు బద్ధకంగా లేచాడు. నింగీ నేలా కలిసేచోట కడలి అంచులమీద కెంజాయి సోనలు విచ్చుకుంటున్నాయి. ఫ్యూజీ పర్వత శిఖరాన్ని చుట్టుముట్టి వున్న మేఘాలు పర్వతరాజు ధరించిన పూల కిరీటంలా ఉన్నాయి.

వారు మెల్లగా తమ ప్రయాణం కొనసాగించారు.

మంచు కురియడంచేత అసలే సన్నగా ఉన్న శిలా

తలం మరింత జారుతూంది. ఇనుప మేకులకు బిగించిన ప్రొకుల సాయంతో మెల్లిగా యెగ్రాకుతున్నారు వారు.

అదే సమయంలో చెవులు చిల్లులుపడేలా వినిపించిన శబ్దానికి ఉలిక్కిపడి వారు చుట్టూ చూశారు.

ఫ్యూజీ పర్వతాన్ని దాటుకుంటూ వస్తూంది ఒక సీ హంటర్ విమానం. జపాన్ ప్రభుత్వపు డిఫెన్స్ ఎంబ్లమ్ దానిపై కొట్టవచ్చినట్లు కన్పిస్తూంది. ఆ సీ హంటర్‌ను చూసిన మరుక్షణం వారు బల్లుల్లా ఆ రాతి బండలకు కరుచుకుపోయారు. వారు ధరించిన మట్టి రంగు దుస్తులు ఫ్యూజీ పర్వత వర్ణంలో కలిసిపోయాయి.

ఆ విమానం తమ దృష్టిపథాన్నుంచి దాటాక మెల్లగా తలలెత్తారు వారు. కనుమరుగవుతున్న ఆ సీ హంటర్ వంక సాలోచనగా చూస్తూ అన్నాడు చిన్‌లీ.

"మనం యింత రిస్క్ తీసుకొని యిలా పర్వతాన్ని ఎక్కేబదులు హాయిగా ఒక హెలికాప్టర్‌లో వచ్చేయ వలసింది బాస్.'

చిన్‌లీ వంక చిరునవ్వు నవ్వుతూ చూశాడు హోచి మిన్. ఆమాత్రం ఆలోచన నాకు తట్టలేదంటావా పిచ్చివాడా అన్నట్లుగా ఉంది ఆ చూపు.

"ఫ్యూజీ పర్వతానికి పశ్చిమానున్న పర్వత శిఖరాల మీద యేముందో చిన్‌లీకి కాస్త అర్థమయ్యేటట్లు చెప్పు తోషిబా" అన్నాడు హోచిమిన్.

"జపాన్ కోస్టల్ గార్డ్స్ కోసం ఆ పర్వత శిఖరాలపై ప్రత్యేకంగా నిర్మింపబడింది ఒక రక్షణ ప్రాకారం. సీ హంటర్స్‌లాంటి అత్యంత ఆధునిక విమానాలతో పాటు యుద్ధ సమయంలో శత్రు విమానాలను కూల్చేందుకు

అనువుగా విమాన విధ్వంసక శతఘ్నులు సైతం ఆ పర్వత శిఖరంమీద అమర్చబడ్డాయి.

"హై పవర్ టెలిస్కోప్‌తో గగన భూ తలాలను ఎల్లవేళలా పర్యవేక్షిస్తుంటారు ఆ స్థావరంలోని గార్డ్స్. తమ సంకేతం చెప్పకుండా, యితర విమానాలు గాని, హెలికాప్టర్లు గాని ఆ స్థావరానికి నూరు కిలోమీటర్ల పరిధిలో గగన తలాన్ని అతిక్రమించిన మరుక్షణం.... రాడార్స్ వాటి ఉనికిని రికార్డు చేస్తాయి. ఏ కమ్యూనికేషన్ లేకుండా....కనీసం వార్నింగ్ కూడా యివ్వకుండా వాటిని ఆకాశంలోనే స్మాష్ చేసేస్తారు వారు." చెప్పాడు తోషిబా.

తోషిబా చెప్పినదంతా వినేసరికి....వారికి ముచ్చెమటలు పట్టాయి. విధి వక్రించి ఆ సీ హంటర్ కళ్లలో తాము పడి వుంటే జరిగేదేమిటో ఊహించుకొనేసరికి వారికి భయంతో ఒళ్ళు జలదరించింది.

అంత సీక్రెట్ స్థావరం గురించి కూడా తెలుసుకోగలిగాడు కాబట్టే హోచిమిన్ 'యకుజా' గ్యాంగ్ లీడర్ కాగలిగాడు—అనుకున్నాడు చిన్ లీ.

మేకులకు చుట్టి త్రాడును పట్టుకొని మెల్లగా పైకి ఎగబ్రాకుతున్న వారు ఒక్కసారిగా పెనుగాలికి ఊగే చివురు కొమ్మలా ఊగిపోయారు. ఆ మోకును గట్టిగా పట్టుకొని వుండకపోతే వారు పట్టు తప్పి జారిపోయి వుండేవారే.

అయితే అందరికంటే ముందుగా పర్వతాన్ని ఎక్కుతూ బండల చీలికల్లో ఇనుప మేకులను దిగగొట్టుతున్న అనుచరుడు మాత్రం ఆ అదటుకు తుళ్ళిపోయాడు. ఏదో రాక్షస హస్తం పట్టుకొని విసిరేసినట్లు ఆ పర్వత శిఖరం

నుండి దొర్లుకుంటూ నేలమీదకు జారిపోయాడు. మరణ భీతితో అతడు వేసిన చావుకేక వారిని నిశ్చేష్టులను చేసింది.

ఆ అదురుకు కారణం యేమిటా అని వారు ఆశ్చర్య పోతున్న సమయంలో వారు పట్టుకున్న క్రోబతోసహా ఎవరో బలంగా ఊపినట్లు గాలిలో మరొక్కసారి కెలుగా ఊగారు. ఆ ఊపుకు వేగంగా వచ్చి ఆ బండ లకు తాకటంతో ఇద్దరి నుదురులు చిట్లి ముఖాలు రక్త సిక్తాలయ్యాయి.

అప్పుడు గమనించారు వారు ఆ అదురుకు కారణం. ఆ రెండుసార్లూ కంపించింది ఫ్యూజీ పర్వతం. అదీ కేవలం ఒకటి రెండు సెకన్లు. అంతే!

కంపించినది ఫ్యూజీ పర్వతమని గ్రహించిన మరుక్షణం ప్రొఫెసర్ తోషిబా నోసలు ముడిపడింది. అతని ముఖంలో 'ఇదెలా సంభవమైంది' అన్న ఆశ్చర్యం కొట్ట వచ్చినట్లు కన్పిస్తూంది.

అగ్నిపర్వతాలు కంపించడం ప్రకృతి సహజం. కాని ఫ్యూజీలాంటి స్లీపింగ్ వాల్కెనోస్ కంపించడమంటే చిత్రమే మరి.

అగ్నిపర్వతంలో అడుగున భూగర్భంలోని రాతి పలుకలు కరిగి ద్రవం అవుతాయి. దాని పేరు మాగ్మా. సుమారు 1300 నుండి 1500 సెంటీగ్రేడ్ల ఉష్ణోగ్రత వద్ద ఈ రాతి పలుకలు కరిగి ద్రవంగా మారుతాయి.

ఈ మాగ్మా దారిలో రాళ్ళనీ రాళ్ళలో వుండే లోహాలనూ కరిగించుకుంటూ పర్వత శిఖరాన్ని చీల్చుకొని పైకి ఎగిసేసరికి దీని వేడి తగ్గుతుంది. అప్పుడు ఆ మాగ్మానే 'లావా' అని పిలువబడుతూంది.

ఎగిసివచ్చే మాగ్మా ఉధృతానికి అప్పుడప్పుడు అగ్ని పర్వతాలు కంపిస్తూ వుంటాయి. అలా యేర్పడిన ప్రకంపనాలు నేలలో కొన్ని మైళ్ళదూరం వ్యాపించి ఒక్కొక్కసారి పెద్ద, పెద్ద పట్టణాలనే భూమట్టం చేసేస్తూ ఉంటాయి.

"అయితే ఫ్యూజీ స్టార్కింగ్ వాల్కెనోయా....?" అన్న సందేహం తోషిబా మనసును పట్టి పీడించసాగింది. అతడు తన అనుమానాన్ని మనసులోనే దాచుకున్నాడు.

తమతోటి సహచరులు ఒక్కొక్కరుగా ఈ ఎసైన్ మెంట్ కు బలై పోతుంటే ఒక ప్రక్క బాధ గుండెను పిండేస్తున్నా.... మొండిగా తమ ప్రయాణం కొనసాగిస్తున్నారంటే అది యకుజా గాంగ్ సభ్యులలాంటి రాతి గుండెల మనుషులకే చెల్లుతుంది.

మ్లానమైన ముఖాలతో వారు ఆ పర్వతాన్ని అధిరోహించసాగారు.

# 9

సంధ్య చీకట్లు ముసురుకొనే సమయంలో వారు ఆ పర్వతాన్ని చేరుకున్నారు.

విశాలంగా సమతల మైదానంలా వున్న ఆ పర్వత శిఖరంపైన .... ఆ శిధిల బౌద్ధారామాన్ని చూసేసరికి వారిలో నూతనోత్సాహం పొంగిపొరలింది. ఇంతవరకూ అనుభవించిన క్లేశాన్నంతా వారు ఆ క్షణంలో మరిచిపోయారు.

కొండలనూ, కోనలనూ ముంచెత్తుతూ చీకటి చిక్కబడసాగింది. నింగిలో మిణుకు, మిణుకుమంటూ మెరుస్తున్న చుక్కల గ్రుడ్డి వెలుగులో ఆ శిధిలారామం భూతాల గృహంలా వుంది.

సమున్నతమైన ఆ పర్వత శిఖరంమీద నిలుచుంటే ఆ నిర్మానుష్య [illegible] గ్రహంమీద కాలు మోపామా అనిపించసాగింది వారికి.

వారు మెల్లగా నడుచుకుంటూ ఆ శిథిలారామంలో ప్రవేశించారు. శక్తివంతమైన టార్చ్ లైట్ల వెలుగులో వారు ఆ శిథిల శకలాన్ని పరీక్షగా చూడసాగారు.

ముందుగా ప్రాకారకుడ్యం దాటి లోపలకు అడుగు పెట్టారు వారు. విరిగి నేలమీద పడివున్న రాతి స్తంభాలపై చెక్కి వున్న బుద్ధుని జాతక కథా శిల్పాలు చీకటిలో ఉట్టిపడుతున్నాయి. వారికి మరింతగా సహకరించడానికా అన్నట్లు వెన్నెలలు విరజిమ్ముతూ చంద్రుడు పైకి వచ్చాడు.

ఆరామ ప్రధాన ద్వారంపై శిలా తోరణం చెక్కి వుంది. బోలుగా వున్న ఆరామకుడ్యం నుండి చంద్ర కాంతి సన్నని కిరణంలా లోపలికి ప్రసరిస్తూంది. ఆరామమంతా కటిక చీకటిగా వున్నా ఆ సన్నని వెలుగులో బుద్ధ విగ్రహం పాదాలు మాత్రం తళ, తళ మెరుస్తున్నాయి.

లోకానికి జ్ఞాన జ్యోతి నందించిన ఆ తథాగతుని పాదాలను శశికాంతుడు తన వెన్నెల కిరణాలతో అభిషేకిస్తున్నాడా అన్నట్లు సరిగ్గా ఆ చంద్రకాంతి ఆ పాదాలమీదే పడుతూంది.

ఎక్కడో కోణార్క దేవాలయంలో సూర్యకాంతి సరిగ్గా సూర్య విగ్రహంమీద పడుతూందని యెప్పుడో చదివాడు లోషిబా. నిజానికి పూర్వీకులే నిజమైన వాస్తు కళా నిపుణులా అన్న సందేహం కలుగుతూంది ఇలాంటి అపురూపమైన దృశ్యాలను చూసేటప్పుడు.

వారు టార్చిలైట్ల వెలుగును లోపలకు ఫోకస్ చేస్తూ ఆరామంలో అడుగు పెట్టారు. ఒక్కసారిగా వెలుగుతో ఆ వద్ద అంతర్భాగం ప్రకాశవంతమైంది.

అయితే మరుక్షణం వారి కర్ణపుటాలు బద్దలయ్యేలా 'కీచు'మని వికృతంగా అరుచుకుంటూ ఒక్కసారిగా గాలిలోకి లేచాయి కొన్ని నల్లని ఆకారాలు. ఒక్కొక్కటి సుమారు రెండడుగుల పొడవు నూరేసి అడుగుల పొడవుగల రెక్కలున్న రాక్షసి గబ్బిలాలవి. రెక్కలు పూర్తిగా విప్పేసరికి అరడుగుల పైగా వున్నాయవి.

తమ చీకటి సామ్రాజ్యంలోకి యేవో వింత ప్రాణులు వచ్చి తమ మీద వెలుగులు ప్రసరించడం సహించలేకపోయాయి అవి. గాలిలో ఒక్కసారి చక్కర్లు కొట్టి రివ్వున టూ వచ్చి వారి ముఖాలపై దాడి చేశాయి అవి.

వాటి ఆకారాలను చూసిన మరుక్షణం ముందుగా రియాక్ట్ అయింది లోపిబా.

"కమ్ అవుట్ ....కమ్ అవుట్ ఎవ్రీబడీ "

అంటూ అరచేతులతో ముఖాన్ని దాచుకుని, వెర్రిగా కేకలు వేస్తూ ఆరామం బయటకు పరుగెత్తాడతడు.

తమ బుగ్గలపై, ఫాలంపై వాడి గోళ్ళతో అవి రక్కుతుంటే బాధగా అరుస్తూ మిగిలినవారూ బయటికి పరుగెత్తారు. అయితే చివరగా వస్తున్న అనుచరుడి రెండు కళ్ళను రెండు రాక్షస గబ్బిలాలు ఒకేసారి పొడిచేయడంతో ఆర్తనాదం చేస్తూ అతడు అక్కడే కూలబడి పోయాడు.

క్రిందపడిన అతడి శరీరంమీదకు వ్రాలి అతని శరీరం

లోని కండలను తమ వాడి గోళ్ళతో పీకసాగాయి ఆ రాక్షస గబ్బిలాలు.

తమకు కావల్సిన రహస్యాలు సేకరించడానికి, తాము అనుకున్నది సాధించడానికి ఎంతోమంది అమాయకులను చిత్రవధ చేసి చంపి వుంటాడు ఆ యాకుజా గాంగ్ సభ్యుడు. కాని నిజమైన చిత్రవధ అంటే యేమిటో అతడికి అప్పుడే తెలిసింది.

శరీరంలోని ఒక్కొక్క భాగాన్ని కరకు కత్తులతో కోస్తున్నట్లుగా వుంది అతని స్థితి. డెస్పరేట్ గా చేతులూ కాళ్ళూ విదిలిస్తున్నాడతను. గొంతు చించుకుంటూ అతడు చేస్తున్న ఆర్తనాదాలు వాటి వికృతమైన అరుపుల్లో కలిసిపోయాయి.

అతడి పొట్టను చీల్చి పేగులు పైకి లాగాయి. అంతే! గిజ, గిజ గింజుకుంటున్న అతడి శరీరం చలనరహితమై పోయింది.

ఆరామానికి బయట ఇరవై గజాల దూరంలో నిలుచుని తమ సహచరుడి చావుకేకలు వింటున్నారు వారు. భయంతో వారి దేహాలు వణికిపోతున్నాయి.

“ఆ రాక్షస గబ్బిలాలు ఒకవేళ పైకి వచ్చి తమను ఎటాక్ చేస్తే....!”

ఆ ఆలోచన రాగానే వారి ముఖాలు తెల్లగా పాలిపోయాయి. కాని, ‘ఆ గబ్బిలాలు తమ నెలవులు దాటి పైకి రావని’ తోషిబా చెప్పేసరికి వారి గుండెలు కుదుట పడ్డాయి.

సూర్యోదయంకోసం ఎదురుచూస్తూ.... కూర్చున్నారు వారు. వారు ఖాళీ చేసిన విస్కీ బాటిల్స్ వెన్నెలలో తళ, తళా మెరుస్తున్నాయి. నిలువెల్లా ఉన్ని కంబళ్లు

కప్పుకొని కూర్చున్నవారు చీకట్లో ఫ్యూజీ పర్వతంమీద వ్రాసిన పిశాచాల్లా వున్నారు.

# 10

సూర్యకిరణాలు వెచ్చగా తగులుతుంటే బద్ధకంగా కళ్ళు విరుచుకుంటూ లేచారు వారు. ప్లాస్టిక్ కాన్లలోని నీటితో ముఖాలు కడుక్కున్నాక తమ వద్ద మిగిలిన ఆహారాన్ని తలా కాస్తా పంచుకొని తిన్నారు.

చాలగా మిగిలిన యిద్దరు అనుచరుల వంక నిర్వికారంగా చూశాడు హోచిమిన్. తను చిన్లీ, తోషిబా కాక పదిమంది అనుచరులతో ఈ ఎసైన్మెంట్ ప్రారంభించాడు.

మాంసాహార పొడలు యిద్దరినీ, స్ప్రేయింగ్ స్నేక్ ఒకడినీ, కానిబుల్ యాంట్స్ ముగ్గురినీ, కంపించిన ఫ్యూజీ పర్వతం మరొకడినీ ఇలా పర్వతాన్ని పూర్తిగా అధిరోహించేసరికి ఏడుగురు అనుచరులను బలి తీసుకుంది ఈ ఎసైన్మెంట్.

తీరా శిఖరం పైకి చేరాక రాత్రి శిథిలారామంలో రాక్షస గబ్బిలాల వాత పడ్డాడు ఎనిమిదోవాడు. ఇక మిగిలింది కేవలం యిద్దరు అనుచరులు.

ఒక్కొక్క అనుచరుడూ మృత్యువువాత పడుతుంటే వారితో పాటే వారు మోసుకువస్తున్న ఆహారపదార్థాలు, నీరు అన్నీ కోల్పోయారు తాము. ఈ రోజు ఉదయంతో తమ దగ్గర మిగిలిన కాస్త ఆహారం అయిపోయినట్లే. మరి తిరుగు ప్రయాణం ఎలా....?

ఇది కాదు హోచిమిన్ను వేధిస్తున్న అసలు సమస్య.

"హౌ టు ఎంటర్ ఇన్ టూ దట్ ఏన్షియంట్ టెంపుల్....?"

ఆ శిధిలారామాన్ని చూస్తూ అదే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు హోచిమిన్.

హోచిమిన్ మనసులోని ఆలోచనలను పసిగట్టాడు తోషిబా.

“ఆ గబ్బిలాలకు పగలు కళ్ళు కనిపించవు హోచిమిన్. మనం ఆరామంలో ప్రవేశించకుండా ద్వారం దగ్గరే కాపువేసి వాటిని కాల్చి చంపాల్సి వుంటుంది.”

నెమ్మదిగా చెబుతున్న తోషిబా వంక మెరుస్తున్న కళ్ళతో చూశాడు హోచిమిన్. మరుక్షణం చివుక్కున లేచి ఆరామంవైపు నడవసాగాడు. మిగిలిన నలుగురూ అతడిని అనుసరించారు.

నడుముకున్న బెల్టుకు వ్రేలాడుతున్న హోలస్టర్ల నుండి రివాల్వర్స్ తీసి చేతులలో సిద్ధంగా వుంచుకున్నారు హోచిమిన్, తోషిబా, చిన్లీ. తళ, తళ మెరుస్తున్న స్టీల్ షేమ్క్వ్‌లను రెండు చేతులతో పట్టుకొని, నడుస్తున్నారు మిగిలిన యిద్దరు అనుచరులు.

ప్రాకారకుడ్యం దాటి ఆరామ ప్రధాన ద్వారంవద్ద మోకాళ్ళపై కూర్చున్నాడు హోచిమిన్. అతడికి యిరు ప్రక్కలా అతనిలాగే ఆరామానికి అభిముఖంగా మోకాళ్ళపై కూర్చున్నారు తోషిబా, చిన్లీ. ద్వారానికి అటూ, ఇటూ షేమ్క్వ్‌లను పట్టుకుని ద్వారపాలకుల్లా నిలబడ్డారు ఆ యిద్దరు అనుచరులూ.

“ఢాం....! ఢాం....! ఢాం....!”

రివాల్వర్ల మ్రోతతో ఆరామం మార్మ్రోగిపోయింది. ఆరామం చూరుకు నల్లని మూటల్లా వ్రేలాడుతున్న రాక్షస గబ్బిలాలు మూడు ఆ తూటాలకు నేలకూలాయి. ఆ శబ్దాలకు మిగిలినవి కీచుమని అరచుకుంటూ ఆరామం

లోపల డెస్పరేట్‌గా తిరగసాగాయి.

మరోసారి వారి రివాల్వర్స్ గర్జించాయి. ఈసారి మరికొన్ని నేలమీదకు రాలిపోయాయి. ఒక్కొక్కటి మరణిస్తూంటే రెట్టించిన ఉత్సాహంతో వారు కాల్పులు కొనసాగించారు.

ఈసారి రెండు గబ్బిలాలు కాల్పులు వస్తున్న దిశను శబ్దాన్నిబట్టి గ్రహించాయి కాబోలు రివ్వుమంటూ ద్వారం వైపు దూసుకువచ్చాయి.

ద్వారం దగ్గర కాచినవారు పిస్టల్స్‌లతో వాటిని ఒక్క వేటుకు నరికారు. నల్లని వాటి శరీరాలు ఎర్రని రక్తంతో తడిసి భయానకంగా వున్నాయి.

రాక్షస గబ్బిలాలను వేటాడుతున్న ఉత్సాహంతో వారు మరోవైపు నుండి వస్తున్న ప్రమాదాన్ని గుర్తించలేకపోయారు.

వ్యాలీ పర్వత శిఖరంమీదగుండా కోస్టల్ గార్డింగ్‌కు వెళుతున్న సీ హంటర్ ఆకాశంలోనే ఆ పర్వత శిఖరం చుట్టూ చక్కర్లు కొట్టసాగింది.

బైనాక్యులర్స్‌తో ఆ పర్వత శిఖరాన్ని పరిశీలించడం మొదలు పెట్టిన ఆ సైనికులకు శిథిలారామం ప్రాంగణంలో పొంచి వున్న హోచిమిన్ బృందం కనిపించింది. అంతే! వార్నింగ్ సైతం యివ్వకుండా వారు ఫైరింగ్ ఓపెన్ చేశారు.

వర్షంజల్లులా తమ చుట్టూ పడుతున్న బుల్లెట్ల శబ్దానికి వారు ప్రక్కలో బాంబు ప్రేలినట్లు అదిరిపోయారు. చటుక్కున ఆరామం ప్రాంగణంలోని రాతి స్థంభాల చాటుకు దొర్లుకుంటూ పోయాడు హోచిమిన్.

చెంగున ఆరామంలోకి దూకి నేలమీద బోర్లా పడు

ఉన్నాడు చిన్‌లీ. తోరణ ద్వారం చాటున తప్పు ఉన్నాడు తోషిబా.

మిగిలిన యిద్దరు అనుచరులుకూడా ఆ దేవాలయం లోనికి దుముకబోయారు. కాని వారు కదలడం కాస్త ఆలస్యమయింది. తోరణ ద్వారంవైపు మొదటి అడుగు వేయక ముందే వారి శరీరం బుల్లెట్ల తాకిడికి తూట్లుపడి పోయింది.

నిర్జీవంగా నేలమీదకు వ్రాలిపోయిన వారి వంక బాధగా చూశాడు తోషిబా.

ఈ మధ్యలో రాతి స్తంభాల చాటున దాక్కొన్న హోచిమిన్ భుజంమీద నున్న కిట్ తీసి. అందులోని విడి భాగాలను చక, చకా బిగించసాగాడు. కొద్ది నిమిషాలలో అతని చేతులలో అత్యంత ఆధునికమైన జర్మన్ మేడ్ మిషీన్ గన్ తయారయ్యింది. బుల్లెట్ చైన్‌ను ఇన్ సర్టు చేసి....తమ మీద గుళ్ళ వర్షాన్ని కురిపిస్తున్న సీహాంటర్ కు గురిపెట్టాడతడు.

ఇలాంటి పరిస్థితే వచ్చి, జపాన్ • రక్షణదళాలను యెదుర్కొనవలసివస్తే, దానికికూడా సిద్ధపడే వచ్చాడతను. ఒక్క మిషన్‌గన్ మాత్రమేకాకుండా యింకా హై పవర్ హాండ్ బాంబ్సుకూడా అతని కిట్‌లో వున్నాయి.

అతడు ఫైరింగ్ ఓపెన్ చేశాడు.

ఎదురుకాల్పులు ఆరంభమయ్యాయని గ్రహించినంతనే ఒక్కసారిగా పైకి ఎగిసి ఆకాశంలో రెండుసార్లు చక్కర్లు కొట్టింది ఆ సీహాంటర్. తరువాత యేటవాలుగా ఆ ఆరామంమీద నుండి మసకుటూ పోయింది.

హోచిమిన్ దాక్కున్న రాతి స్థంభాలపై బుల్లెట్లు

వర్షంలా కురిసాయి. రాతి పెచ్చులు ఊడి గాలిలోకి ఎగిరాయి. ఓ ప్రక్క బుల్లెట్లనుండి కాచుకుంటూ ఒక రాతి స్తంభం చాటునుండి తనుకూడా ఆ సీ హాంటర్ మీదకు గుళ్ళ వర్షాన్ని కురిపించాడు హోచిమిన్.

కాని వేగంగా దూసుకుపోయిన సీహాంటర్ను అతడు ఎయిమ్ చేయలేకపోయాడు.

వెళ్ళినంత వేగంగానే తిరిగివచ్చి ఫైర్ చేస్తూ దూసుకు పోయింది సీహాంటర్. డెస్పరేట్గా అది వెళ్ళిన దిశలో గాలిలోకి కాల్పులు సాగిస్తూనే ఉన్నాడు హోచిమిన్.

అలా ఆ పోరాటం కొన్ని నిమిషాలపాటు సాగింది. చిన్ లీ, తోషిబాలు భయంగా ఆ పోరాటాన్ని తిలకిస్తున్నారు.

ఉన్నట్టుండి ఆ సీహాంటర్ వేగంగా వెనుతిరిగి వెళ్ళిపోసాగింది. బహుశా అదనపు బలాలను సమకూర్చుకొని రావడానికేమో అనుకున్నాడు హోచిమిన్.

ఏది ఏమైనా కొంతసేపటివరకూ తమకు దానివలన ప్రమాదం లేనట్టే. అతడు చేతిలో మిషన్ గన్తో ఆరామం లోపలకు పరుగెత్తాడు.

"కమాన్! దేర్ ఈస్ నో టైమ్. హర్రీయప్" అంటూ ఆ విగ్రహాన్ని సమీపించాడు.

ఒక పెద్ద శిలాఫలకానికి తాపడం చేయబడి వుంది ఆ విగ్రహం.

యిప్పుడు ఆ ఫలకాన్ని జాగ్రత్తగా బద్దలుకొట్టే టైం లేదు. మళ్ళీ జపాన్ కోస్టల్ గార్డ్సు వచ్చేలోగా తాము తప్పించుకోవాలి.

ఒక్క నిమిషం సాలోచనగా ఆ విగ్రహం వంక చూశాడు. జేబులోనుండి రెగుపండు సైజులో వున్న

చిన్న మినీ బాంబ్‌ను తీశాడు. కేవలం చిన్న చిన్న రాతి పలకలను మాత్రం ముక్కలు చేయగలదు ఆ మినీ బాంబు.

వ్రేలితో దానికున్న బుడిపెను నొక్కి ఆ శిలాఫలకం వద్ద పెట్టి ఆరామం బయటకు పరుగెత్తాడు హోచిమిన్.

అతన్ని వెన్నంటారు మిగిలిన యిద్దరూ.

ఒకటి... రెండు.... మూడు....

సరిగ్గా పది అంకెలు లెక్క పెట్టేసరికి 'ధన్'మని శబ్దం చేస్తూ పేలింది ఆ బాంబు. ముక్కలు చెక్కలుగా గాలిలోకి త్రుళ్ళిపోయింది ఆ శిలా ఫలకం.

భిన్నా భిన్నమైన ఆ శిలా శకలాల మధ్య పడి వున్న బుద్ధ విగ్రహం వంక ఆనందంగా చూస్తూ ముందుకు అడుగు వేశాడు హోచిమిన్.

అప్పుడు వినవచ్చింది వారికి ఒక భయంకరమైన శబ్దం. ఆ విస్ఫోటానికి ప్యూజీ పర్వత మే మొత్తం కదిలిపోయింది. శిథిలారామం ఒక్క క్షణం గడ, గడ వణికి పేకమేడలా కూలిపోసాగింది.

కుప్ప కూలిపోతున్న ఆరామాన్ని చూస్తూనే 'కవ్వ' మని కేక వేస్తూ బయటకు పరుగెత్తారు వారు.

దోసిళ్ళతో పూలను వెదజల్లినట్లు, పెద్ద పెద్ద రాతి పలకలు ఉవ్వెత్తున గాలిలోకి ఎగిసి పడ్డాయి.

చిన్న మినీ బాంబే యింతటికీ కారణమయ్యిందంటే వారు నమ్మలేక పోతున్నారు. జరిగిందేమిటో.... అదెలా సంభవించిందో వారికేం అర్ధం కావటంలేదు.

ఇంతలో ఆ శిథిలాలనుండి బుస, బుసా పొంగుకుంటూ వస్తున్న ద్రవాన్ని చూసేసరికి వారికి ఈ ప్రళయం ఎలా సంభవించిందో అర్థమయిపోయింది.

"అగ్ని పర్వతం బ్రద్దలయ్యింది."

ముగ్గురి నోళ్ళనుంటూ ఒకేసారి వచ్చిందామాట.

'అంటే.... ప్యూజీ యాక్టింగ్ వాల్కనో యన్న' మాట ఆ ద్రవం వంకే నిశ్చేష్టులై చూస్తూ అనుకున్నాడు లోషిబా.

అయితే పొంగుకుంటూ, పొర్లుకుంటూ వస్తున్న ఆ ద్రవం లావా కాదు.... లహారి.

అగ్నిపర్వతం బ్రద్దలయి చల్లారిన మాగ్మా లేక లావాకు బదులు ఒక్కొక్కసారి బురద ప్రవహిస్తూంటూంది. ఆ బురదనే లహారి అంటారు.

1945 నవంబరు 13 న ఆర్మిరోలోని నెవడో డెల్ రూయిజ్ అగ్నిపర్వతం బ్రద్దలయి, దానినుంచి ప్రవహించిన బురద మట్టిలో 28 వేలమంది ప్రజలు కూరుకుపోయి మరణించారు.

బురదమట్టి నెమ్మదిగా పేరుకుపోవడంతో వేలాది శవాలు బురదమట్టి ముద్దల క్రింద ఉండిపోయాయి.

ఇప్పుడు ఎండిపోయిన ఆ బురదమట్టి ప్రవాహం ఏడు ఎకరాల్లో వ్యాపించి వుంది.

ఆర్మిరోలో జరిగిన ఆ దారుణ ఉదంతం గుర్తుకు వచ్చి భయంతో వణికిపోయారు వారు.

బూడిదను, రాళ్ళను ఎగజిమ్ముకుంటూ వస్తున్న ఆ లహారి ప్రవాహాన్ని చూసేసరికి వారి పై ప్రాణాలు పైనే పోయాయి.

పిచ్చిగా కేకలు వేసుకుంటూ పరుగెత్తారు వారు.

కొన్ని సెకన్లలో .... మహోద్రత జలపాతంలా, టైఫూన్లో ముంచెత్తివచ్చే ఉత్తుంగ సాగర తరంగంలా పొంగి పొర్లుతూ వస్తూంది ఆ లహారి ప్రవాహం.

హోళీ పండుగలో బుక్కా విసురుకుంటున్నట్లు ... బూడిద ఎగిసి ఆకాశాన్ని కప్పేస్తోంది. చిన్న, చిన్న రాళ్ళూ బండలూ బంతుల్లా ఎగిసి పడుతున్నాయి.

ఎర్రగా, చిక్కగా పొంగులు వారుతున్న ఆ లావా ప్రవాహాన్ని చూస్తుంటే ప్రళయమే ముంచుకువచ్చిందా అనిపిస్తోంది.

ప్రాణాలు అరచేతులలో పెట్టుకొని పరుగెత్తుతున్నారు వారు. వారిని వెన్నాడుతున్న మృత్యువులా వెనుక పరవళ్ళు త్రొక్కుతూ వస్తోంది ఆ ప్రవాహం.

ఎంత సేపని...? ఎంత దూరమని వెంటాడే మృత్యువును తప్పించుకొని వారు పారిపోగలరు?

చిన్ లీ పాదాలను తాకుతూ హోచిమిన్ ను చుట్టుముట్టింది ఆ లావా. అప్పటికి పర్వతపు అంచునున్న బండ మీద వున్నాడు తోషిబా.

చిన్ లీ, హోచిమిన్ లు కాళ్ళు విదిలించబోయారు. కాని బంకలాంటి ఆ బురద నీటిలో వారికది సాధ్యం కాలేదు.. ఒక్కొక్క సెకను గడిచేకొద్దీ ఆ మట్టం పెరగసాగింది.

పాదాలనుండి, మోకాళ్ళను దాటి. తొడలను చుట్టి యింకా....యింకా.... పైపైకి మెల్లగా పెరుగుతోంది ఆ బురద ప్రవాహం.

తాను నిలుచున్న బండనుండి వారివైపు జాలిగా చూశాడు తోషిబా. ఈ క్షణంనుండి వారు అనుభవించబోయే నరకయాతన గుర్తుకు వచ్చేసరికి అతడి ముఖంలో రక్తం యింకిపోయింది.

అప్పుడే తను నిలుచున్న బండనుకూడా చుట్టుముట్టి

పైకి పెల్లిగా పెరుగుతున్న బురద నీటి మట్టాన్ని గమనించాడతడు. ఏం చేయాలో తోచక వెర్రివాడిలా జుత్తు పీక్కుంటూ నిస్సహాయంగా కేకలు పెట్టాడు తోషిబా.

అప్పటికి చిన్ లీ, హోచిమిన్‌ల కంఠం వరకూ వచ్చింది ఆ బురద నీటిమట్టం.

'నో. పగవాడికి కూడా ఆ చావు రాకూడదు' అనుకున్నాడు తోషిబా.

పెల్లిగా బండను ముంచెత్తిన బురద ప్రవాహం అతని పాదాలను తాకింది.

అంతే! వేయి కాలనాగులు, ఒక్కసారి తనను చుట్టి ముట్టినట్లు కంపించిపోయాడతడు.

చివరిసారిగా గొంతులవరకూ మునిగిపోయిన హోచిమిన్, చిన్‌లీలను చూశాడు.

"అనుక్షణం.. వారిలా చిత్రవధ అనుభవిస్తూ చావడం కన్నా ఒకేసారి చావడం మేలు" అనుకున్నాడు.

అంతే! ఒక్క ఉదుటున ఆ పర్వత శిఖరంనుండి క్రిందకు దుమికాడు. రాతిబండలకు తగిలి అతని శరీరం ఛిన్నాభిన్నమయింది.

—: అయిపోయింది :—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

సౌమ్య గింజుకొన్నది. ఏమాత్రం అవకాశం దొరికినా వాళ్ళ దగ్గిరున్న ఈటెల్లో దేన్నయినా దొరకబుచ్చుకొని ఆత్మహత్య చేసుకోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తోంది! కాని వాళ్ళు మెరా అవకాశం యివ్వలేదు.

దూరంగా యేవో దీపాలు వెలుగుతున్నట్టు గుర్తించింది సౌమ్య. ఆటవికులు దార్లో కొన్ని మొక్కలు విరిచి, ఆకులు కోసి వాటి రసం పిండి, తమ గాయాలకి పూసుకొన్నారు. వాళ్ళకి అంత తీవ్రంగా గాయాలు తగిలినా చెక్కు చెదరకుండా యెలా పరుగెత్తగలుగుతున్నారో సౌమ్యకర్థంకాలేదు. వీళ్ళు మనుషులా రాక్షస సంతతా అని అనుమానం వచ్చింది.

మరో పదినిమిషాల్లో దీపాలు కనిపించిన చోటికి చేరారు. అది మరో కోయగూడెంగా గుర్తించింది

సౌమ్య. దీపాలుగా దూరానికి కనిపించిన వెల్తురు కాగడాలది!

అక్కడ ఆరు బయట ప్రదేశంలో ఆడ మగ అందరు చేరి ఏదో పానీయం తాగుతున్నారు. తమ జాతివాళ్లు ఎవరో నాగరిక స్త్రీని మోసుకురావటం చూసి అందరు గోలగా అరుచుకుంటూ వాళ్ళని చుట్టుముట్టారు.

సౌమ్య కాగడాల వెలుర్లో వాళ్ళు చేస్తున్న పని స్పష్టంగా గుర్తించింది. వాళ్ళందరూ సారాయిలాంటి ద్రవాన్ని తాగుతున్నారు. ఆడ, మగ మత్తుతో జోగుతున్నారు. మొగాళ్ళందరు గోచీలు మాత్రం ధరించారు. ఆడవాళ్ళు మొలచుట్టూ ఏదో ఆచ్ఛాదన కట్టుకున్నారు. శరీరమంతా దాదాపు నగ్నంగానే వున్నది.

సౌమ్య జుగుప్సతో, అసహ్యంతో కన్నులు మూసుకున్నది.

వీళ్ళిప్పుడు తనని ఏం చెయ్యబోతున్నారు? వీళ్ళు తనని యేదో చేసేలోపల తన ప్రాణంపోతే ఎంత బావుండును!

ఆటవికుల్లో, నాయకుడిలా వున్న ఓ మనిషి తనని ఎత్తుకొచ్చిన వాళ్ళని ఏదో అడుగుతున్నాడు. వాళ్ళు తమ భాషలో యేదో చెప్తున్నారు. అది పూర్తిగా తనకి తెలియని భాష. వాళ్ళ హావభావాల్ని బట్టి అర్థం చేసుకోవాలే తప్ప వాళ్ళు ఏం మాట్లాడేది ఏమాత్రం అవగాహన కావటంలేదు.

ఆ నలుగురు ఆటవికులు చెప్పిన మాటలు విని ఆనందోత్సాహాలతో పెద్దగా చప్పట్లుచరుస్తూ తక్కిన వాళ్ళంతా నృత్యం చేయటం మొదలెట్టారు.

సౌమ్యని అక్కడే వున్న సగం నరికిన చెట్టు మొద్దుకు చేతులు వెనక్కి విరిచి కట్టేశారు. ఆమె నెత్తుకొచ్చిన

అటవికుల్ని మొగాళ్ళు తమ భుజాలమీదికెత్తుకొని ఆనందంగా కేకలు పెడుతూ నృత్యం చేయసాగారు. వాళ్ళకి కూడా సారాయిలాంటి ఆ ద్రవాన్ని నోట్లో పోస్తూ ఒంటినిండా దిమ్మరిస్తున్నారు. వెకిలిగా నవ్వుతూ తుళ్ళుతూ గంతులు వేస్తున్నారు.

కొందరు ఆడవాళ్ళు సౌమ్యను కట్టేసిన చెట్టు దుంగ దగ్గరకొచ్చారు. వాళ్ళ చేతుల్లో సారాయి దొన్నె లున్నాయి. వెదురు బొంగుల్లో దాన్ని పోసి కిచకిచ లాడుతూ తాగుతూ ఆమె నోటి దగ్గరకు తెచ్చారు.

సౌమ్య అసహ్యంతో విసిరికొట్టింది. మరి కొందరు మళ్ళీ సౌమ్య నోటిదగ్గరకు ఆ పానీయాన్ని తీసుకొచ్చారు. వాళ్ళ భాషలో యేదో అడుగుతున్నారు. సౌమ్యకిదంతా చాలా వెసటగా, భరించలేనిదిగా వున్నది. కాని వాళ్ళు అనాగరికులు. రాక్షస స్వభావులు! వాళ్ళని వారించ బూనటం అవివేకం!

సౌమ్య విసిరికొట్టినా, విదిలించినా ఈగల్లా ఆడవాళ్ళు ఆమెచుట్టూ ముసురుతూనే వున్నారు. కాగడాల వెలుగులో వాళ్ళు చేస్తున్న వికట నృత్యం మృత్యు దేవత చేసే కరాళ నృత్యంలా వుంది.

దాదాపు పూర్తి నగ్నంగా ఎగురుతున్న ఆ ఆడ వాళ్ళు పిశాచాలు గాల్లో తేలివస్తున్నట్టు, తన రక్తం పీల్చటానికి కోరలు సాచుకొని మీదపడుతున్నట్టు అనిపించారామెకు.

సౌమ్యకు పరిష్కారం స్ఫురించింది. వీళ్ళు తనని అవమానించి హింసించేలోగా వీళ్ళని రెచ్చగొట్టి తన ప్రాణం తీసేలా ప్రేరేపిస్తే మంచిది! తనకి ఈ నరక యాతన తప్పుతుంది. ఒక్కసారిగా విముక్తి దొరుకుతుంది.

ఆడవాళ్ళు తాగిన మైకంలో సౌమ్య ఒంటిమీదున్న చీరను లాగేశారు. ఆమె ఒంటిమీదున్న ఆచ్ఛాదనలు వాళ్ళకు వింతగా తోచాయి. ఒకటొకటే లాగటానికి సిద్ధపడ్డారు. తన పరువు మంటగలిసిపోయే క్షణం ఆసన్నమయిందని గ్రహించింది సౌమ్య. తన ఆలోచనను ఆచరణలో పెట్టింది!

తన గుడ్డలు పూర్తిగా శరీరం మీదినుంచి లాగెయ్యటానికి మళ్ళీ తనని సమీపించిన ఆడవాళ్ళని ఎగిరి గుండెల మీద తన్నింది సౌమ్య.

వాళ్ళు ఆమెనుంచి అటువంటి ప్రతిఘటన ఎదురుచూసి వుండకపోవటంవల్ల ఎగిరి అంతదూరంలో వెల్లకిలా పడ్డారు. ఆ మరుక్షణమే మహాకోపంతో పైకిలేచారు. పక్కన వెలుగుతున్న కాగడాలను అందుకొని ఆమెను కాల్చేయాలన్నంత ఉద్రేకంతో మీదికొచ్చారు.

సౌమ్య ఈసారి ఎగిరి వాళ్ళ మొహాలమీద తన్నింది. ఆ వేగానికి ఓ స్త్రీ చేతిలోని కాగడా ఎగిరి అల్లంత దూరంలో వున్న గుడిసెపైన పడింది.

అంతే! ఒక్కసారిగా మంటలు లేచాయి. ఒకదానినానుకొని మరో గుడిసె అంటుకొన్నది. రెల్లుగడ్డితో నేసిన గుడిసెలన్నీ భగ్గున మండసాగాయి.

అంతవరకు ఆనందంలో తాగిన మైకంలో వికృతంగా నాట్యం చేస్తున్న ఆటవికుల మత్తు వదిలిపోయింది. అందరు ఒక్కసారిగ మండిపోతున్న యిళ్ళను ఆర్పటానికి, అందులో నిద్రిస్తున్న తమ పసిపాపలని, వృద్ధులని రక్షించుకోవటంకోసం పరుగులు పెట్టారు.

జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్న మంటల్లో సౌమ్య ముఖం ఎర్రగా వెలిగింది. దాదాపు అందరు ఆమె

విషయం మరిచిపోయి, ఒంటరిగా వదిలేశారు. సౌమ్య ఆ అవకాశాన్ని వదులుకోలేదు.

చేతులు రెండూ వెనక్కి విరిచి కట్టేయబడి వుండటం వల్ల నోటితో విప్పుకొనే అవకాశంలేదు. ఆమె అటు యిటు చూసింది. నేలమీద పడున్న కాగడా ఆమె సమస్యకు పరిష్కారం చూపించింది.

కాలితో కాగడానందుకొన్నది. అతికష్టంమీద, కాలిని మడచి వెనకవైపునుంచి నడుముదాకా కాగడాను పైకి లేపింది. ఒంటికాలిమీద బాలెన్సు చేసుకుంటూ కాగడాను చేతికట్లమీదకు తీసుకొచ్చింది. బంధనాలు కాలిపోయాయి. అయితే ఆ ప్రయత్నంలో ఆమె చేతులు కూడా కాలాయి.

సౌమ్య చాలా వేగంగా పనిచేసింది. దూరంగా పడి వున్న తన చీరను అందుకొని ఒంటికి చుట్టుకున్నది. తన నెవరూ గమనించటంలేదని గ్రహించింది.

ఓసారి ముందుకు దృష్టిసారించింది. అందరు తను తమ యిళ్ళని సంరక్షించుకొనే ప్రయత్నాల్లో నిమగ్నులై వున్నారు. ఇదే మంచి అదను! ఆమె వచ్చినదారి వెంబడే వెనక్కి పరుగుతీసింది.

తనని ఆటవికులు ఎత్తుకొచ్చినవైపే పరుగు పెడ్తున్నానని ఆమె అనుకొన్నది. కాని, తను పోతున్న దారి అడవిలోకి మరింత లోపలికి చొచ్చుకుపోతున్నదని ఆమె తెలుసుకు నేసరికి చాలా ఆలస్యమయ్యింది.

దాదాపు ఓ ఏభైమంది ఆటవికులు తనకే అభిముఖంగా పరుగెత్తుకొని రావటం ఆమె గుర్తించింది. వాళ్ళు చాలా వేగంగా పరుగెత్తుకొస్తున్నారు. నలుగురైదుగురి చేతుల్లో కాగడాలు వెలుగుతున్నాయి!

ఆమె గుండె ఝల్లుమన్నది. తను తప్పించుకుపోవటం ఆటవికులు గమనించినట్టున్నారు. అందుకే తనని వెదుక్కుంటూ వస్తున్నారు. అగ్నిప్రమాదానికి కారకురాలైన తనని పట్టుకొని ఆ మంటల్లో పడేస్తారు. అనుమానంలేదు. తను అడవిలో ఏ చివరకు పరుగెత్తినా వాళ్ళకు దొరక్క తప్పదు!

సౌమ్య హతాశురాలయ్యింది. వాళ్ళకు దొరికి వాళ్ళ చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకొనే బదులు తనే ప్రాణాలు తీసేసుకుంటే....!?

ఆమెకు ఆత్మహత్య చేసుకోవాలన్న ఆలోచన రెండోసారి వచ్చింది. వింతగా నవ్వుకున్నది. చావుకి, బతుక్కి మధ్యదూరం యింత తక్కువా? అంతకి కొద్ది నిమిషాల క్రితం చావాలనుకున్నది. మళ్ళీ బతకాలనిపించింది. కాని, యింతలోనే మరణం అనివార్యమని తేలిపోయింది.

సరిగ్గా అప్పుడే ఆమెకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఆటవికులు తనని వెనకనుంచి తరుముకొని రావటానికి బదులు, తన ముందునుంచి యెలా వస్తున్నారు? బహుశా వేరేవాళ్ళేమో!

ఈ ఆలోచన రాగానే ఆమె గుబురుగా పెరిగిన ఓ చెట్టుపక్కకు తప్పుకొని, దారివైపు చూపు నిలిపింది. కాగడాల వెలుగు తనమీద పడితే ప్రమాదకరమని ఆమెకు తెలుసు. కాని, చెట్టు ఎక్కటానికి సమయం చాలదు. ఈలోపల వాళ్ళు తనకు ముఖాముఖి వచ్చేస్తారు.

కాగడాలు బాగా దగ్గరయ్యాయి. దూరం నుంచి యేభైమంది వుండొచ్చనుకొన్నదిగాని, అంతకన్న ఓ

పాతికమంది యెక్కడే వున్నారు. హుటాహుటిన పరుగు లాంటి నడకతో ఉరకలు పరుగులుగా సాగిపోతున్నారు. వాళ్ళు సౌమ్యకి స్పష్టంగా కనిపిస్తూన్నారు.

వాళ్ళు బాట వెంబడి సరాసరి వెళ్ళిపోయారు. వాళ్ళెవరు? ఆ అర్ధరాత్రి సమయంలో యెక్కడికి పోతున్నారు?

ఒక్కసారిగా అడివంతా ప్రకాశవంతంగా వెలిగిపోవటంతో సౌమ్యకు అదేమిటో వెంటనే అర్థంకాలేదు.

మెల్లిగా చెట్టెక్కి దృష్టిసారించింది!

ఆమె గుండెలు గుభిల్లుమన్నాయి! దూరంగా గుడిసెలు యింకా తగలబడుతూనే వున్నాయి. అదికాదు ఆమె నాశ్చర్యపరచిన విషయం; అడవిలోని చెట్లుకూడా అగ్నితో రగులుకొంటున్నాయి. కార్చిచ్చు అడవినికూడా కాలుస్తోంది.

అప్పుడే తెలిసిందామెకు — తను గుడిసెలకు చాలా దూరం వచ్చేసిందిగాని, తను గతంలో ఆటవికులకు దొరికిపోయిన ప్రాంతానికి వ్యతిరేక దిశలో యింతసేపు ప్రయాణించి వచ్చేసింది. తనకి కనిపించిన ఆటవికులు గుడిసెల దగ్గరకు చేరుకున్నారప్పటికి!

వాళ్ళు వేరే గూడెంవాళ్ళు. గుడిసెలను ఆర్పడానికి ఆ గూడెం వాళ్ళకి సాయంగా వెళ్ళిన ఎవరో గూడెపు కోయలు. అంటే యిక్కడ యిలాంటి గూడేలు లెక్కకుమించి వున్నట్టున్నాయి. వీళ్ళ దృష్టి తప్పించుకొని వెళ్ళగలదా? నవీన్ని కలుసుకోగలదా?

నవీన్ గుర్తుకు రాగానే ఆమె మనసంతా విషాదంతో నిండిపోయింది. తనకోసం, తనని రక్షించటంకోసం అనుక్షణం ప్రమాదాలతో చెలగాటాలాడుతూ, చివరికి

యేమయిపోయాడో కూడా తెలియకుండా మాయమయ్యాడు. ఈపాటికి ఆ లోయలోనుంచి బయటపడి వుంటాడా? తనకోసం వెతుక్కుంటున్నాడా?

ఆమె ఆలోచనలు చెదరగొడుతూ చెట్టుకింద ఎండుటాకులమీద పెద్దగా శబ్దమయ్యింది.

ఉలిక్కిపడింది సౌమ్య. నేలమీదకి కళ్ళుచిట్లించి చూసింది.

చీకట్లో మెరుస్తూన్న అగ్నిగోళాలవంటి కళ్ళు పైకి— తనవంకే చూస్తూన్నాయి. ఆ కళ్ళు తాలూకు క్రూర జంతువేమిటో గ్రహించేసరికి ఆమె గుండె వేగం హెచ్చింది. ఇదివరకట్లా ప్రతి ఆపదకు భయపడటం లేదిప్పుడు సౌమ్య. కాని ప్రమాదాల నెదుర్కొనే శక్తి నశించిపోతోంది!

ఓపక్క అడవంతా తగలబడిపోతోంది. మంట తను కూచున్న చెట్టుకు సమీపించటానికిక ఆట్టే సమయం పట్టదు. చెట్టు దిగి పారిపోటానికి వీల్లేకుండా నేలమీద తనని వేటాడటానికి సిద్ధంగా కూచున్న చిరుతపులి!

సౌమ్య కర్తవ్య విమూఢురాలిలాగా అలాగే చెట్టుపైన కూర్చుండిపోయింది.

* * *

విషకన్య, ఒక్కసారిగా పైకి లేచిన మంటల్ని చూసి విస్తుపోయింది.

అడవి అప్పుడప్పుడు తగలబడటం మామూలే! అదే జరుగుతోందా యిప్పుడు? అలా అయితే సౌమ్యని వెతకటం చాలా కష్టసాధ్య మవుతుంది. తన అనుచరులు నేలమీద ప్రాక్కొని వెళ్ళటం చాలా కష్టం!

నవీన ఆమె వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"నా అనుమానం, కార్చిచ్చు పుట్టి అడవిని తగల బెడుతోందని! కొద్ది నిమిషాల్లో యే విషయమూ తెలిసి పోతుంది!" అన్నది.

నవీన్‌లో టెన్షన్ పెరిగిపోతోంది. విషకన్యను అనుసరిస్తూవున్నా దేగాని అతని ఆలోచనలన్నీ సౌమ్య చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

ఉగ్రనాగు, తదితర అనుచరులు ముందుకి మహా వేగంగా సాగిపోతున్నాయి. వాటిననుసరిస్తున్నారు విషకన్య, నవీన్.

"ఆ దుండగులు సౌమ్యకేమీ అపకారం తలపెట్టలేదు కదా...." అన్నాడు నవీన్ అర్థోక్తిలోనే ఆపి, విషకన్యవైపు చూస్తూ.

"ఆమెకెలాంటి అపకారం జరగదు. ఈ ఆటవికులు నాగరికుల్లాగా స్త్రీమీద అత్యాచారం తలపెట్టరు. వీళ్ళకు సాటి మనుషులమీద అసూయాద్వేషాల్లేవు కాకపోతే, వీళ్ళలో మూర్ఖత్వం, మూఢనమ్మకాలు వేళ్ళు పాతుకుపోయి వున్నాయి. తమ మూర్ఖత్వానికి ఎప్పుడెవర్ని బలిచేస్తారో తెలీదు" అన్నది విషకన్య.

మరో పదిహేను నిమిషాల తర్వాత భగభగ మండిపోతున్న గూడెం సమీపించారు. ఉగ్రనాగు, తక్కిన నాగులు ఆగిపోయి విషకన్యవైపు తలతిప్పి చూశాయి.

విషకన్య అవి ఆగిన ప్రదేశం పరికించి చూసింది. అంతక్రితం సౌమ్యని బంధించి వుంచిన సగం నరికిన చెట్టు మొదలు, యింకా నేలమీద పడి వెలుగుతున్న కాగడా కనిపించాయక్కడ.

విషకన్య సాలోచనగా చూసింది నవీన్ వంక. నవీన్‌కి అప్పటికి పరిస్థితి అర్థమయింది. సౌమ్యని అక్కడ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

'మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ ' డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P.. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

బంధించి వుంటారని, ఈలోపల యేదో కారణంగా గుడిసెలు తగలబడ్డాయని, వాళ్ళు వాటినార్పుకొనే ప్రయత్నాలలో వున్నారని గ్రహించాడు. అయితే, సౌమ్య యేమయినట్టు?

విషకన్య ఉగ్రనాగువంక సాభిప్రాయంగా చూసింది. ఉగ్రనాగు అంతక్రితం సౌమ్య పరుగెత్తి తప్పించుకొన్న కాలిబాటవైపు సాగిపోయింది.

విషకన్య నవీన్ వంక చూసి సైగ చేసింది. ఇద్దరు ఉగ్రనాగును అనుసరించారు.

అప్పటికి అడవిలోని చెట్లు యింకా మంటల్లో చిక్కుకోలేదు. కాని, వాళ్ళు ఓ ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి కార్చిచ్చు రగులుకొన్నది. ముందుకి వెళ్ళటానికవకాశం లేకుండా నేల బారుగా వున్న మొక్కలు, పొదల్తో బాటు మంటల్లో చిక్కుకొన్నాయి.

ఉగ్రనాగు, తక్కిన నాగులు ముందుకి వెళ్లే అవకాశంలేక ఆగిపోయాయి. విషకన్యవైపు నిస్సహాయంగా చూశాయి. విషకన్య తీవ్రంగా ఆలోచిస్తోంది. నవీన్‌లో టెన్షన్ మరింత పెరిగింది. మంటల్లో చిక్కుపోలేదు కదా సౌమ్య.... అనుకొన్నాడు పదేపదే.

"మన ఉగ్రనాగు సూచనల్ని బట్టి సౌమ్య వీళ్ళనుంచి తప్పించుకొని ఇదే దారిన అడవి లోపలకు వెళ్ళిపోయింది. ఎక్కడో సురక్షితంగానే వుంటుంది. అయితే కార్చిచ్చు అడవిని దహించకముందే ఆమెను మనం ట్రేస్ చెయ్యగలిగితే మంచిది!" అన్నది విషకన్య.

కొద్ది క్షణాల సేపు రగుల్తున్న అడవికేసి, ఆకాశానికి

వాళ్ళు చూస్తున్న మంటలకేసి చూస్తూ అలాగే నిల్చుండిపోయారు.

* * *

సౌమ్య కొమ్మలమధ్య అసహానంగా కదిలింది.

మంటలు తను కూచున్న చెట్టును సమీపించటానికి కొద్ది నిమిషాలు మాత్రమే వ్యవధి వున్నది. తను చెట్టు దిగటానికి వీలేకుండా నేలమీద చిరుతపులి తనవైపే కళ్ళుప్పగించి చూస్తోంది.

చిరుతపులి చెట్టెక్కగలదని విన్నది తను. అదే జరిగితే తను ప్రాణాలమీద ఆశ వదిలేసుకోవచ్చు! ఆమె అసహానంగా చెట్టుమీద కొద్ది నిమిషాలు గడిపింది. మంటలు యింకా పెరిగకముందే తను సురక్షితమైన ప్రదేశం చేరుకోవాలి! ఎలా?

నేలమీద కూచున్న చిరుతపులి అకస్మాత్తుగా లేచి నిల్చుంది. సౌమ్య గుండె కొట్టుకుంటున్న చప్పుడు ఆమెకే స్పష్టంగా వినిపిస్తోంది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి. చెట్టెక్కుతుందా? తన జీవితం యిప్పటితో ముగిసిపోతుందా?

సౌమ్య గుండె దిటవు చేసుకొంది. ప్రాణభయంతో అనుక్షణం చచ్చేకన్నా ఒకేసారి యీ చిరుతవాతపడి చావటం మేలు అనుకొన్నది!

అయితే, చిరుతపులి చెట్టెక్కే ప్రయత్నం చెయ్యలేదు.

అంతకంతకు మీదికొస్తూన్న మంటల్ని ఒక నిమిషం పరికించి చూసింది. ఆ తర్వాత ఒక్కసారిగా విల్లునుంచి విడిచిన బాణంలా ఎటో దూసుకొని వెళ్ళిపోయింది.

సౌమ్య కొద్దిక్షణాలవరకు ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు.

(సశేషం)

